# భారతి

సాహిత్య

మాస పత్రిక

సంపాదకుడు :

శివలెంక శంభుప్రసాద్

మే 1954.

సంపుటము 31 సంచిక 5

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

-:o:-

## మే 1954


| | | |
|---|---|---|
| బృందలో వింత — దేశిరాట్ విరాట్ గారు | ... | 391 |
| అన్వేషణ — 'నాగ్ భూషణ్' | ... | 392 |
| నాచనసోమన హరివంశము — యస్. వి. యన్. భాష్యకారాచార్యులుగారు | ... | 401 |
| అమాయికత్వం — పన్యాల రంగనాథరావుగారు | ... | 407 |
| కోదండరామకవి — కోట లక్ష్మీనారాయణగారు | ... | 417 |
| అచల — శ్రీమతి మల్లాది వసుంధరగారు | ... | 423 |
| అభిజ్ఞానశాకుంతలము — మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు | ... | 431 |
| తప్పు — కొమ్మూరి వేణుగోపాలరావుగారు | ... | 439 |
| జలదమార్గము — పుట్టపర్తి నారాయణాచార్యులుగారు | ... | 447 |
| వజ్రహస్తుని అరసవెల్లి శాసనము — మండ నరసింహముగారు | ... | 449 |
| ఆఖరు గుణపాఠం — కొనకళ్ల వెంకటరత్నంగారు | ... | 459 |
| పాలకురికి సోమనాథునికాలము — బండారు తమ్మయ్యగారు | ... | 463 |
| సమమట్టం — కవికొండల వెంకటరావుగారు | ... | 473 |
| కలగూరగంప — | ... | 484 |
| గ్రంథ విమర్శనము — | ... | 487 |


త్రివర్ణ చిత్రము : పంటసిరి — రణవీర్ సాక్సేనాగారు



సంస్మరణ

గత చైత్రశుద్ధద్వాదశీపుణ్యదినాన దేశోద్ధారకుని వర్ధంతిమహోత్సవాలు
ఆంధ్రసీమ సర్వత్రా అత్యంత వైభవంగా జరిగాయి.



పంటసిరి

చిత్రకారుడు: శ్రీ రణబీర్ సాక్సె




జయ
వైశాఖము

భారతి

సంపుటము 31
సంచిక 5


# బృందలో వింత


శ్రీ దేశిరాట్ విరాట్


జరిగె బృందనొక వింత!
కలిగె దాన జాగింత!

యమునచెంత బృందకదా,
బృంద పుంత పొదవుకదా,
కనుమ దారి లేక నేను
వెనలి వచ్చుచుండు గదా—
జరిగె బృంద నొక వింత!
కలిగె దాన జాగింత!

పాతనీడ తెలియనిదా?
నాతోడనె కదలియాడు;
నీలినీడ తలమీదను
నెమిలిపించె మవతరించె!
జరిగె బృంద నొకవింత!
కలిగె దాన జాగింత!

నర్మవాక్కు లాడెనమ్మ
నాదు నీడ నాతోడనె,
నీడ సరస మేమి యనీ
నివ్వెరపడి నిలిచిపోతి!—
జరిగె బృంద నొకవింత!
కలిగె దాన జాగింత!!

నాటిక:

# అన్వేషణ

## 'నాగ్ భూష

ఎప్పుడో ఒకప్పుడు, ఎక్కడో ఒకచోటవున్న దొక వూరు. ఆ వూరికి మారుమూల అ[illegible] దిడ్డంగా మొలిచిన గృహాల గరిమనాభికి అల్లంతదూరాన ఓ దుకాణం. రోడ్డుప్రక్క వురి తీసి లాంతరు తాలూకు ఇప్పుడో మరుక్షణంలోనో చనిపోయేట ట్లనిపించే వెలుతురులో కనిపిస్తున్న దుకాణదారు. ముడతలు పడ్డ ముఖం, లోతుకు పోయిన కళ్లు, ఒత్తుగా తెల్లగా పెరిగిన [illegible] అతని గతించిన జీవితాన్ని అనుభవాలతో భాగిస్తే, బాధల విభక్తం పోను మిగిలిపోయిన దేహం.. నిజానికి వయస్సు యాభైమాత్రమే; కాని సమాజం విధించిన శిక్షలలో [illegible]యినా? అతని ఆలోచనల కొటంకంగా పోలీసు వస్తాడు.

పోలీసు అరె! అయితే నువ్వు చచ్చిపోలే దన్నమాట!

దుకాణదారు : లేదే! ఎవరు చెప్పారు నేను చచ్చిపోయానని?

పో : అబ్బే! ఎవరూ చెప్పలేదు...నే నే...

దు : నేను జబ్బుచేసినమనిషిలా కనిపిస్తు న్నానా? దున్నపోతులాగా మనిషిని వుంటే, చచ్చి పోవడం యేమిటయ్యా?

పో : లేదులే! అది...వూరికే...

దు : ఆఁ! వూరికే—?

పో: వూరికే, తమాషా కన్నమాట.

దు: (అర్థంకాక) ఏది?

పో: అదేనయ్యా! నువ్వు చచ్చిపోయావన్నది.

దు: కాని, నేను చచ్చిపోందే!!

పో: నిజమే! నువ్వు చచ్చిపోలేదు. చచ్చిపోలే దని నాకు తెలుసు......తమాషా కన్నానంటే అర్థం చేసుకోవేం? అది కేవలం తమాషాకన్నమాట. తెలి సిందా?

దు: తమాషానా? చచ్చిపోవడం తమాషా ఏమి టయ్యా?

పో: (తన హాస్యాన్ని అర్థంచేసుకోలేదని, నిస్పృహతో) సరేలే! ఇక వెళ్లొస్తా.

దు: అదేమిటి? చుట్ట ముట్టించుకుపోవూ?

పో: అక్కర్లేదులే; ఏం అనుకోకు.

దు: ఏం?

పో: మాని వేశాను.

దు: అయితే కూర్చో. ఒకటి కొం[illegible] తాను.

పో: అబ్బే! ఇవ్వాళ అక్కరలేదు.

దు: (గంభీరంగా) రేపు నే నిక్కడ వుండను.

[ఆమాట విననట్లుగా వుంటాడు పోలీసు...ఒక క్షణం నిశ్శబ్దం.]

పో: (గొణుక్కుంటున్నట్లుగా) చలి!

దు: ఎవరు?

పో: మనమే...గాలి......

దు: నువ్వు నీలోనే మాట్లాడుకుంటావు... నాకు చేతకాదు.

పో: (నవ్వుతూ) నీలో నువ్వు మాట్లాడుకో లేవు, ఎదుటివాళ్లతోనూ మాట్లాడలేవు...అంతేనా? ...అయినా నువ్వుచెప్పు...చలిగా వున్నదనుకోవడం కూడా నేరమేనా?

(కొంచెంసేపాగి) చలిగా వున్నదన్నంత మాత్రాన నన్ను పోలీసువుద్యోగంలోనుంచి తీసి వెయ్యరు గదా!...ఏం?...

[ఎంతకూ దుకాణదారు మాట్లాడడు...మాట మారుస్తాడు పోలీసు.]

పో : ఇంత భండాలపు రాత్రి నేను పుట్టిన తర్వాత చూడలేదు.

దు : నేను యింతకన్నా భయంకరాలపు రాత్రులు చూశాను.

పో : నిజమే అయివుంటుందిలే!

దు : ఒక్కొక్క రాత్రిని తలుచుకుంటే,... ...ఆరాత్రి బ్రతుకుతానో లేదో ననిపించేది...కాని నావంటి మొండిఘటానికి చావెట్లా వస్తుంది?

పో : (నవ్వుతూ) బాగా అన్నావు.

దు : పట్నంలో వుండగా, రెండు రోజుల గాలివానలో, రోడ్డ్రప్రక్క, పెళ్ళాం బిడ్డలతో వున్నాను. (కొంచెంసేపు నిశ్శబ్దం)......ఒకనాటి రాత్రికిరాత్రి కొడుకు వెళ్ళిపోయాడు...(బాధగా) ఒక రాత్రి నన్ను వదిలి అదికూడా వెళ్ళిపోయింది. అటువంటి రాత్రులు పగవాళ్ళకూడా వద్దనుకున్న వాటిని, ఎన్నింటిని గడిపానో?...ఇటువంటి ప్రతి రాత్రీ చచ్చిపోతాను నే అనుకున్నాను. కాని—

పో : (ముసిముసి నవ్వుతూ) కాని, నీవంటి మొండి ఘటానికి చావెట్లా వస్తుంది?...అంతేనా?

దు : అవును...అవును...(పోలీసు ఏదో చెప్ప బోతాడు) ఆఁ! ఏమిటో అనబోతున్నావ్?

పో : అబ్బే...అదే...నువ్వు చెప్పింది నిజమే ననబోతున్నాను.

దు: అటువంటివి నువ్వూ అర్థం చేసుకోగలవన్న మాట!

పో : ఓ!

దు : (వ్యంగ్యంగా) చాలామంచిది.

పో : (కోపంతో) ఆఁ! ఇహ నేను వెడతాను.

దు : మంచిది నాయనా! మంచిది...

[పోలీసు వెళ్ళిపోతాడు...దుకాణదారు ఒక పొగాకుకాడ తీసుకొని చుట్ట చుట్టుకుంటూవున్నాడు]

తమాషా కన్నా నంటాను; ఇటువంటివాణ్ణి పోలీసుల్లో ఎట్లా చేర్చుకున్నారో?

[ఇంతలో రెండో ప్రక్కనుంచి—]

'దానికి సమాధానం చెప్పటం తేలికే!...అటువంటి వాళ్ళను భగవంతుడు పుట్టించగా లేనిది, అధికారులు పోలీసుల్లో చేర్చుకోవడానికేం?'—

[ఈ మాటలంటూ ఒక యువకుడు వస్తాడు.]

దు : ఎవరు నాయనా, నువ్వు?

యువకుడు: నేనా?... నేను...ఎవరినైతే నేం? ...మీమాదిరిగానే ఒక మనిషిని కదా!

దు : అవును నాయనా! నువ్వు ఎవరివైతే నాకేం?

యు : (అతడు గాయపడ్డాడని గ్రహించి) క్షమించండి ... నా వుద్దేశ్యం అదికాదు... నేను 'ఫలానా' అని చెప్పడంవల్ల లాభంయేమిటి చెప్పండి? ప్రతిమనిషీ, ఎదుటి మనిషిలోని మానవత్వాన్ని అంగీకరిస్తే, ప్రపంచంలో ఇన్ని పోట్లాటలు, ఇంత అశాంతీ వుండవనుకుంటాను.

దు : నిజమే నాయనా !...నువ్వు చెప్పిందీ నిజమే!...ఆఁ! ఇంతకూ యేమిటి అంటున్నావ్?

యు : అదే! జాలిపడవలసినవాళ్ళను చూసి నవ్వడం మాత్రమే నేర్చుకున్నాడు పోలీసు. దానికి అతన్నని ఏం లాభం?

దు: మరి ఎవర్నననాలి?

యు : అతన్ని పుట్టించిన భగవంతుణ్ణనండి... అతన్ని అట్లా తయారుచేసిన సంఘాన్ని అనండి.

దు: ఇటు చూడు, నాయనా!.. నీకు భగవంతుడిమీద నమ్మకం లేదా?

యు : మనుష్యులమీదనే నమ్మకం పోతున్న వాడికి భగవంతుడిమీద నమ్మకం పోవడం అసహజం కాదుగా !

దు: ఒక మనిషి భగవంతుణ్ణి తప్పుపడుతున్నా డంటే అతను చాలా కష్టాల్లో వున్నాడన్నమాట... ఏం ?

యు : కష్టాల్లోనా ?...వాటి పుణ్యమా అని పుట్టినప్పటినుంచీ అవీ నేను వదిలివుండలేదు. సరే! పోనివ్వండి...ఎప్పుడూ వుండేగొడవే !...కొంచెం అగ్గిపెట్టె యిస్తారా?

దు : అయ్యో! ఎందు కివ్వనూ ?

యు: ఆ పోలీసైతే యేమనేవాడో తెలుసా? 'అయ్యో! ఎందుకిస్తానూ?' అనేవాడు.

దు: నీ కెలా తెలుసు?

యు: అట్లా ఎంతమందిచేత ఎన్నిసార్లనిపించు కున్నానో? (సిగిరెట్టు ముట్టిద్దామని నిప్పుపుల్ల వెలిగించి, ముట్టించకుండానే ఆర్పి) చలిగా వుందికదూ!

దు: నాకు బాగానే వుంది.

యు: ఇంత చలిలో బాగా వుండడం అదృష్టమే!... కాని, నేను పూర్తిగా దురదృష్టవంతుణ్ణి... ఇటువంటి చలి అనుభవించడం మొదలుపెట్టి నెల రోజులైంది... నేనుకూడా ఇదివరకు పెట్టెలాంటి యింట్లోనే వుండేవాణ్ణి.

దు: ఏం? ఇప్పు డక్కడ ఎందుకులేవు?

యు: ఉండలేకపోయాను. నా తత్వానికది పడదేమో మరి!

దు: ఏం? తాగి తందనా లాడేవాడివా?

యు: (నవ్వుతూ) అట్లా కనిపిస్తున్నానా?... అదేమీ కాదండి...మనిషిని దివాలా తీశాను.

దు: నాకు తెలుసుగా, ఈ వ్యాపారం లాభం లేదు నాయనా! ..సిగిరెట్టు తాగవేం?

యు: కొద్దిగా నీరసంగా వుంది.

దు: అచ్చు తెలుగుబిడ్డలా చుట్టలు కాల్చక, సిగిరెట్టేమిటోయ్?

యు: చుట్టలు పెద్దవాళ్ల సొమ్మండీ!...మేం వాటిని కాలిస్తే, మగవాడు చీరకట్టుకున్నట్లుగా వుంటుంది.

దు: అదీ నిజమేలే!...

యు: అబ్బా!...(అంటూ, తల పట్టుకొని కూలబడతాడు.)

దు: (కంగారుగా) ఏమిటది?...ఏం జరిగింది??

యు: భయంలేదు. నీరసంగా వుండి కళ్లుతిరిగినయ్....అంతే!...అది, నాకు మామూలే!

దు: ఏం? ఆకలిగా వుందా?

యు: (నీరసంగా నవ్వుతూ) ఉన్నట్లుగానే వుంది...నిన్నపొద్దున చేసిన భోజనం.

దు: అదేమిటి నాయనా! ఇంతవరకూ ఎందుకు చెప్పలేదు? (అరటిపళ్లు గెలలోనుంచి కోసి యిస్తూ) ఇవిగో! ఇవి తిని కాసిని సోడానీళ్లు తాగు, ప్రాణం జేరుకుంటుంది.

[ఈ ఆదరంతో తబ్బిబ్బైపోతాడు యువకుడు. లోతుగా పోయిన కళ్లు అంతులేని కృతజ్ఞత చూపడం మనకు కనిపిస్తుంది...త్వరితంగా తింటూ వుంటాడు. దానినిబట్టే తెలుసుకోవచ్చు, అతనెంత ఆకలిమీద వున్నదీ!]

దు: మెల్లగా తిను నాయనా! అందులోనూ ఆకలిమీద వుండగా మరీ మెల్లగా తినాలి...... (కొంచెంసేపు ఆగి, జాలిగా) ఇంత ఆకలిమీద వున్నవాడివి మాటమాత్రం అనలేదు; చావంటే ఇష్టమా?

దు: బ్రతకడం యిష్టం లేదని చెప్పలేను... కాని నాకిట్లా ఆకలితో వుండటం అలవాటే! అలవాట్లకు ప్రతి మనిషీ బానిసైనట్లే నేనుకూడా! ఇట్లా ఎన్ని రాత్రులు, ఎన్ని పగళ్లు గడిపానో?

దు: (ఓదారుస్తూ) కష్టాలు కాపురం వుండవు నాయనా! ముందు కష్టాలు పడితేనే తరువాతి సుఖం. నాలాంటివాళ్ళకు ముందు సుఖం, తరువాతి కష్టాలు.. కాని ముందు కష్టాలు పడితే, నిజమైన జీవితం, దాని లోతుపాతులు అర్థం అవుతయ్.

యు: "నేను ఆ ప్రాంతాలనుంచి తిరిగివచ్చిన తర్వాత, ఇంత జాలిగా, ఇంత మంచిగా మాట్లాడిందీ, సానుభూతి చూపింది మీరే!...మీరొక్కరే!

దు: ఎక్కడినుంచి తిరిగి వచ్చింది?

యు: నవాబుల దేశంనుంచి!

దు: అంటే, నైజాంనుంచేనా?

యు: ఊఁ!

దు: నైజాంలో ఏ ప్రాంతంలో వుండేవాడివి?

[ఈ ప్రశ్న విననట్లు నటిస్తాడతను.]

నిన్నే! ఏ ప్రాంతంలో వున్నావక్కడ?

యు: ఉత్తరంగా కుడిచేతివైపున, పైన.

గు: ఇటువంటప్పుడు నవ్వులాట పొవ్వుంచు. నిజం చెప్పు.. హైదరాబాదులోనా?

యు: (ఏ ప్రాంతంలో వున్నానని చెబుదామా అని ఆలోచిస్తున్న యువకుడు, ఏదో జ్ఞాపకం వచ్చినట్లుగా) ఆ, ఆ! హైదరాబాదులోనే! కొన్నాళ్లు వరంగల్ లో వున్నాను...అజంతాలో వున్నాను. కాని ఎక్కువ రోజులు హైదరాబాదులోనే!

దు: ఎటువంటి పట్నం అది?

యు: ఎటువంటిదా?...బలేబావుంటుంది.

దు: నువ్వక్కడ యేం వ్యాపారం చేస్తూ వుండేవాడివి?

యు: వ్యాపారమా? నేను వ్యాపారంచేసే మనిషిలా వున్నానా? నేను వుద్యోగం చేసే.

దు: ఏం వుద్యోగం?

యు: మీకు మూడు ఛాన్సు లిచ్చాను...చెప్పుకోండి.

దు: ప్రశ్న అడిగింది నేను—

యు: జవాబూ మీ చేతనే చెప్పిస్తాను.

దు: అబ్బాయ్! నువ్వు తెలివిగలవాడివిలా కనిపిస్తున్నది... నేను సూటిగా ప్రశ్న అడిగాను కదా, నువ్వూ—

యు: సూటిగానే జవాబు చెప్పమంటారు? ఇదివరకు చాలాసార్లు ప్రయత్నంచేసి చూశాను.

మరోసారి చూస్తాను...తొన్నాళ్లు నవాబుగారి మహల్లో వుత్తరాలకు స్టాంపులు అంటించేవాణ్ణి. అది చాలా కష్టమైనపనండీ! కొత్త ఎక్కువతక్కువలు వచ్చినయ్యా, మర్నాడు తలమీద మెడ—అహహా—మెడమీద తల వుండేదు...

దు: నువ్వు అబద్ధం ఆడుతున్నావ్!

యు: అరె! మీరూ కనుక్కున్నారే? కాని నేను నిజం చెబుతానే అనుకున్నారా మీరు?

దు: తప్పకుండా!

యు: మీరు పాతకాలంవాళ్లు; మీ సలా అనుభవంలో ప్పులేదు ... నాకు పెద్దవాళ్ళంటే ఉంది; నిజం చెప్పమంటారా?...ఎవరైనా బాదు వచ్చి, డబ్బు ఖర్చు పెట్టదలుచుకుంటే, త్తతో వుండేవాణ్ణి. వాళ్ళు చూడదలుచుకున చోట్లన్నీ చూపేవాణ్ణి...కొన్నాళ్ళ తరువాత అక్కడకు వచ్చిన ప్రతిమనిషికీ నాకంటే ఎక్కువ తెలుసు అనిపించింది అందువల్ల చాలా రోజులు 'సలానా' వుద్యోగం లంటూ ఏది చెయ్యలేదు.

[ఒక్కక్షణం నిశ్శబ్దం...తరువాత]

ద: (మెల్లగా) మా అబ్బాయి అక్కడే కులాసాగా! దేవుడి దయవల్ల నీలాటి కాదు...అయితే నీకెందుకు దొరకలేదు ?

యు: దొరక్కపోవటమేం? చాలా వుద్యోగాలు చేశాను. అన్ని నౌకరీల్లోనూ ఒకటే! బానిసల కంటె హీనంగా చూసేవాళ్లు. నేనా వుద్యోగాలు చెయ్యలేకపోయ్యాను. స్వతంత్రంగావుండి పొట్ట పోసుకుందామనుకున్నాను. కాని, ఒక అడుగు ముందుకు వేద్దామనుకొంటే, మూడడుగులు వెనక్కు తోసేవాళ్ళు ప్రతివాళ్లూ! నేను జీవితంలో సుఖంగా వుండలేననుకున్నకొద్దీ, జీవితంమీద సుఖంమీద ఆశ పుట్టింది. చివరకు జూదంకూడా ఆడాను.

దు: పాపం అదొక పాపం నాయనా!

యు: నిజమే! (పేలవంగా నవ్వుతూ) అన్ని పాపాలకులోను యిది ఒకటి! సాధ్యమయినన్ని పాపాలు చేస్తే సాధ్యమయినంత త్వరగా యీ ప్రపంచనుంచి వెళ్ళిపోవచ్చునని ఆశ!...సరే! పోని వ్వండి...ఇటువంటివి ఎవరూ వినాలని యిష్టపడరు.

దు: నాకివి అలవాటే నాయనా! నీవంటి వాళ్ళు ఎందరో ఇక్కడి యివీ, అవీ కొనుక్కోవడానికి వస్తారా, అందరూ ఏదో ఒకముక్క ఈ చెవిని వేసిపోతూ వుంటారు...అందరమూ మనుష్యులమే కద నాయనా! ఎవరికష్టాలు వారి కుంటయ్!

యు: అంటె యిట్లా బాధలు పెట్టింది నేనొక్కణ్ణే కాదంటారు.

దు: బాధ ఏముంది నాయనా!...నాకు తోచిన రెండు మాటలు చెప్పి ఓదార్చటానికి ప్రయత్నిస్తాను.

యు: అంతేలెండి....ఎవరి బాధలు వాళ్ల కుండగా, ఎదుటి వాళ్ల కష్టాలనుకూడా దుఃఖించటం కష్టమే! మన దుఃఖాలకే మన కన్నీళ్లు ఇంకిపోతయ్; మరొకళ్లకోసం మిగలవు

దు: (ముట్టుముట్టినట్లు) నీకు రావుబహదూర్ రంగారావుగారు తెలుసా?

యు: తెలియకేం? వాళ్ల అబ్బాయితో నెల రోజులు అజంతా, ఎల్లోరాల్లో వున్నాను.

దు: అవును. ఆ కుర్రాడే! ఇక్కడకు వచ్చేవాడు...చాలా చెప్పేవాడు. పాపం! అతను ఒక అమ్మాయిని పెళ్ళిచేసుకుందా మనుకొనేవాడు... కాని వాళ్ళ నాన్నకు యిష్టం లేదు...ఇద్దరూ లేచిపోయారు ... కాని మర్నాడే పట్టుబడ్డారు...ఆ అబ్బాయి మాత్రం తప్పించుకున్నాడు...ఆ అమ్మాయిని పట్టుకొని ఇంటికి తీసుకువచ్చారు; ఆ అమ్మాయి బావిలో పడి చచ్చిపోయింది.

యు: అతను కూడా దాదాపు పిచ్చివాడయినాడు. ఆ అమ్మాయి పోయినతర్వాత అతను కనిపించ లేదు. బ్రతికున్నాడంటేమాత్రం నాకు నమ్మకం లేదు.

దు: ఆ అబ్బాయినిగురించి నీకు బాగా తెలుసునే! నువ్వుకూడా అటువంటివాడి వెనల్లే వుంది!

యు: అటువంటవాణ్ణయినా బావుండేది! బ్రతకడానికి గాని, చావడానికి గాని ఏదో ఒక ఆశ కనిపించేది.....కాని మనిషికి ముందు కావలసింది తిండే; తన కనీస అవసరాలు గడవటం...ఆ రెండూ వుంటే తరువాత ప్రేమనాటకాలైనా అవసరము

దు: అవునవును .....ఇటువంటివే యెన్నో కథలు విన్నప్పుడు వాళ్ళతోపాటు విచారించటం తప్ప నేను చెయ్యగలిగిం దేముంది?

యు: నిజం...అటువంటివే, నా స్నేహితుల కథలు విని. నా సంగతులు జ్ఞాపకం వచ్చి, వాటికీ వీటికీ కూడా వెక్కి వెక్కి యేడ్చేవాణ్ణి.

దు: (దొంగపనులున్నాడని తెలుసుకొని, మాట మారుస్తూ) సరే...ఇదిగో ఈ సోడా తాగు. (సోడా కొట్టియిస్తాడు).

యు: (గబగబా త్రాగబోయి చల్లదనం భరించ లేక వుమ్మివేస్తాడు.) అబ్బ!

దు: ఏం? బాగుండలేదా?

యు: అబ్బ! ఇంత ఐస్‌లా వుందేం! ఈ చలి కాలం రాత్రి ఈ సోడా తాగితే, యిహ చెప్పక్క ర్లేదు...

దు: వేడి సోడా త్రాగనేకూడదు ... నీకు చూస్తే సారా అలవాటున్నట్లుంది?

యు: మీ పుణ్యాన అది ఒక్కటే తక్కువ... నేను సామాన్యంగా చలికాలం రాత్రులు వేడి టీ త్రాగేవాణ్ణి ... ఇప్పుడు కాదు...ఎన్నాళ్ళయిందో మాని! భగవంతుడికే తెలియాలి.

దు: వేడి టీ త్రాగటం మంచిదికాదు...

యు: (నవ్వుతూ) మీ దృష్టిలో యిక మంచి దేమిటో చెప్పండి...జూదం ఆడటం మంచిదికాదు.. వేడి టీ, వేడి సోడాలు మంచివికాదు...ప్రేమిం చటం మంచిదికాదు...

దు: నిజమే! అవన్నీ తప్పులే!

యు: సరే! కానివ్వండి. మీ మాటెందుకు కాదనాలి?

దు: సరే! ఈ ప్రాంతాలకు మళ్ళీ ఏమైనా పనివుండి వచ్చావా?

యు: (నీళ్లు నములుతూ) దానికీ, దీనికీ అని యేమిటి?—

దు: అంటే, ప్రత్యేకంగా ఒక పనికోసమని రాలేదా?

యు: (గాబరాగా) లేదు...ఆ...అవును... ఒక్కటే పని! (ఇదివరకటి కంటె గంభీరంగా, సీరి యస్‌గా) మా అమ్మనూ, నాన్ననూ వెదకడానికి వచ్చాను.

దు: ఈ ప్రాంతాల్లోనే వుంటున్నారు కాబోలు, కనిపించారా?

యు: నాకు తెలియదు.

దు: తెలియదా?

యు: ఊహుఁ! గుర్తుపట్టలేననుకుంటాను...అదీ కాక నేను రావటం ఆయనకు సంతోషమో, కాదో?

దు: అయితే, వాళ్లు ఎక్కడవుండేదీ నీకు తెలుసునన్నమాట!

యు: ఎక్కడ కనిపించేదీ తెలుసు...కాని తీరా వెడితే—

దు: అయినా, నీలాంటివాడేనా యువతి?

యు: ఏం?

దు: తండ్రుల్లాంటివాళ్లి కోసుకుపోతు...అది సహజమే కదా!

యు: ఓహో!...(కొద్దిగా ముడుచుకుంటూ)

దు: నీకు చలిగా వున్నట్లుంది. కొంచెం లోప లికి రా.

యు: అబ్బే! అక్కర్లేదు...ప్రాణం వుండేవాడికి కూడా భయం కలిగించే విషయాలు వింటే, వణుకు పుట్టడం సహజమేకదా!

దు: (తన కాఠిన్యానికి విచారిస్తూ) నే నన్న మాట తప్పే!

యు: అబ్బే! అక్షరాలా నిజం.

[క్షణం నిశ్శబ్దం]

దు: ఏమిటి ఆలోచిస్తున్నావ్?

యు: నైజాం వెళ్ళాడన్న మీ అబ్బాయిని నే నెప్పుడైనా కలుసుకున్నానేమో?...అతని పేరేమి టన్నారు?

దు: అబ్బే! పొరపాటునకూడా కలుసుకొని వుండవు.

యు: (హేళనగా) చాలా సంతోషం. కాని అతడు మర్యాదస్థుడైనంతమాత్రాన అతని పేరు చెప్ప డానికేం?

దు: వాడి పేరు మోహనరావు.

[యువకుడు పాలిపోతాడు. ఒక్క క్షణం దుకాణదారు కళ్లల్లోకి చూసి బాధతో]

యు: అవును...ఎప్పుడూ చూడలేదు...

దు: చెప్పానుగా! ఏడు సంవత్సరాలైంది వెళ్ళి—పదహారేళ్లప్పుడు—అప్పుడు స్పిన్నింగ్ మిల్లులో పని—...ఈసరికి గుమాస్తా అయి, హాయిగా వుండి వుంటాడు.

యు: (ఆలోచనగా) మీ కతను హాయిగా వున్నాడని యేం తెలుసు?

దు: తప్పకుండా వుండివుండాలి—...వాడి తత్త్వం నాకు తెలుసు.

యు: అంటే, మీ కతను వుత్తరాలు వ్రాయటం లేదా?

దు: వ్రాయనిమాట నిజమే ననుకో—

యు: ఇంతవరకు! ఏడు సంవత్సరాలు!!

దు: అయినా, వాడికి తీరిక ఎక్కడవుంటుంది? ముందు పొట్టకోసం పాటుపడాలి—ముందు ముందూ బాగుపడడానికి కష్టపడి పనిచెయ్యాలి. ఈసరికి ఓ పెద్ద వ్యాపారం చేస్తున్నాడన్నా నేను ఆశ్చర్యపడను...వాడు నిజంగా అంత సమర్థుడు.

యు: నిజమే!—అలానే వుండవచ్చు. ఒకవేళ అలాగా లేదనుకోండి—

దు: అట్లా అనుకోను; అనుకోలేను. వాడు సమర్థుడని చెప్పానుగా! వాడికి చేతకాని పనంటూ లేదు...

యు: మీరు చెప్పింది నిజమే ననుకోండి... కాని అతను చేసే వుద్యోగం అటువంటిది కావచ్చుగదా!

దు: ఎటువంటిదైనా ఫరవాలేదు. వాడు చెయ్యగలడు...ఇప్పటినుంచా? చిన్నప్పటినుంచీ వాడంతే! వాడికి చెయ్యలేని పనంటూ వుండేదు (ఆశతో) నా ఆశలన్నీ వాడిమీదనే పెట్టుకున్నాను.

యు: (ఎంతో బాధను అణుచుకుంటూ) అయితే...అతను...(ఏదో చెప్పబోయి, చెప్పలేక పోతాడు.)

దు: ఆఁ! ఏమిటి అతను?

యు: అదే! అతని దగ్గరనుంచి ఎవరికీ ఉత్తరాలు రాలేదా?

దు: (తేల్చివేస్తూ) ఆఁ! ఒకటో రెండో సార్లు వచ్చినయ్.

యు: (ఆసక్తితో) ఎవరికి?

దు: పోనిద్దూ...ఎవరికైతే మనకేం?

యు: వాళ్ళంటే మీకు యిష్టంవున్నట్లు లేదు.

దు: ఆఁ! ఎవరో అమ్మాయికి వ్రాశాడు. అక్కడికి వెళ్ళగానే, వాడికి యింటిమీద బెంగ పట్టుకున్నదట!...ఏడిశాడు —

యు: నిజంగానే ఇంటిమీద బెంగతో ఏడ్చా?

దు: (కొంచెం తీక్షణంగా) బాగుపడేవాడికి అటువంటివి పడితే యిక సాగినట్లే!...ఆ అమ్మాయి చెప్పింది, వాడు తనను పెళ్ళిచేసుకుంటానన్నాడని.. నేనన్నానూ—వాడు నీసంగతి ఎప్పుడో మరచిపోయాడు—అని.

యు: (ఆలోచనగా) ఉహూఁ! అమ్మాయే మరచిపోయివుండాలి.

దు: లేదు, లేదు...ఆ అమ్మాయికి మావాడిమీద యింకా ఆశవుందట!

యు: (ఆశ్చర్యంగా) ఆ అమ్మాయి కింకా కాలేదా?

దు: ఉహూఁ!

యు: ఏమో! ఆ అమ్మాయి అతనికోసమే యింతవరకూ పెళ్ళిచేసుకోకుండా వున్నదంటే నేను నమ్మను.

దు: మరి ఎప్పుడూ ప్రస్తావించే మాట్లాడుతుంది కదా!

యు: జీవితంలో అటువంటి సంఘటన లున్నప్పుడే నిలవనీరు కదిలేది. అందుకోసం కావచ్చు.

దు: నాకు అర్థం అయేటట్లు మాట్లాడు.

యు: ఏంలేదు...ఈ పరిస్థితుల్లో, మీ అబ్బాయిని గాని, ఆ అమ్మాయిని కాని యీ పెళ్ళిచేసుకుంటారా అని అడగండి వాళ్ళు మీ ఎదుటనే చేసుకోమని ఘట్టిగా చెబుతారు.

దు: మావాడిప్పటికీ ఆ అమ్మాయికి అడపా దడపా వుత్తరాలు వ్రాస్తాడు!

యు: చెప్పానుగా! అది కేవలం వాళ్ళకోసం కాదు. వాళ్ళనుగురించి ఇన్ని విషయాలు తెలుసుకున్న ప్రపంచం, వాళ్ళు ఏదో ఒకటి యిటువంటి పని చెయ్యకపోతే, వాళ్ళను ఒట్టి వాజమ్మలకింద కడుతుంది.

దు: ఏమిటో! కాని ఇటువంటి వన్ని జరిగినా, వాడు సుఖంగా మంచి వుద్యోగం చేస్తూవుంటాడీపాటికి.

యు: (గంభీరంగా, అయినా బాధగా) ఆఁ! ఒక్కమాట అడుగుతాను—ఏమీ అనుకోరుకదూ!—పూరికే వాదనకోసం అడుగుతున్నాను...మీ అబ్బాయి మీ రనుకున్నంత హాయిగా వుండకపోవచ్చు...చాలా కష్టాల్లోవుండి వెనక్కు తిరిగిరావచ్చు...అదృష్టం కనికరించకపోవచ్చు నతన్ని. మీకు తెలిసినప్పటికీ, యిప్పటికీ ఎంతో మారివుండవచ్చు

దు: (కోపంతో) ఎవరి సంగతి నువ్వు చెబుతున్నది? మావాడి సంగతేనా?

యు: కోప్పడకండి...పూరికే, వాదనకోసమని చెప్పానుగా!

దు: దేనికోసమైనా మావాడు చాలా హాయిగా వుంటాడు.

యు: (గబగబా త్రాగబోయి చల్లదనం భరించ
) అబ్బ!

దు: ఏం? బాగుండలేదా?

యు: అబ్బ! ఇంత ఐస్‌లా వుందేం! ఈ చలి కాలం రాత్రి ఈ సోడా తాగితే, యిహ చెప్పక్కర్లేదు...

దు: వేడి సోడా త్రాగనేకూడదు... నీకు చూస్తే సారా అలవాటున్నట్లుంది?

యు: మీ పుణ్యాన అది ఒక్కటే తక్కువ... నేను సామాన్యంగా చలికాలం రాత్రులు వేడి టీ త్రాగేవాణ్ణి... ఇప్పుడు కాదు...ఎన్నాళ్ళయిందో మాని! భగవంతుడికే తెలియాలి.

దు: వేడి టీ త్రాగడం మంచిదికాదు...

యు: (నవ్వుతూ) మీ దృష్టిలో యిక మంచిదేమిటో చెప్పండి...జూదం ఆడడం మంచిదికాదు.. వేడి టీ, వేడి సోడాలు మంచివికాదు...ప్రేమించడం మంచిదికాదు...

దు: నిజమే! అవన్నీ తప్పులే!

యు: సరే! కానివ్వండి. మీ మాటెందుకు కాదనాలి?

దు: సరే! ఈ ప్రాంతాలకు మళ్ళీ ఏమైనా పనివుండి వచ్చావా?

యు: (నీళ్లు నములుతూ) దానికీ, దీనికీ అని యేమిటి?——

దు: అంటే, ప్రత్యేకంగా ఒక పనికోసమని రాలేదా?

యు: (గాబరాగా) లేదు...ఆ...అవును... ఒక్కటే పని! (ఇదివరకటి కంటె గంభీరంగా, సీరియస్‌గా) మా అమ్మనూ, నాన్ననూ వెదకడానికి వచ్చాను.

దు: ఈ ప్రాంతాల్లోనే వుంటున్నారు కాబోలు, కనిపించారా?

యు: నాకు తెలియదు.

దు: తెలియదా?

యు: ఊహుఁ! గుర్తుపట్టలేననుకుంటాను...అదీ కాక నేను రావడం ఆయనకు సంతోషమో, కాదో?

దు: అయితే, వాళ్లు ఎక్కడవుండేదీ నీకు తెలుసునన్నమాట!

యు: ఎక్కడ కనిపించేదీ తెలుసు...కాని తీరా వెడితే——

దు: ఆయనా, నీలాంటివాడేనా యేమిటి?

యు: ఏం?

దు: తండ్రుల్లాంటివాళ్లి కొడుకులు...అది సహజమే కదా!

యు: ఓహో!...(కొద్దిగా ముడుచుకుంటూ)

దు: నీకు చలిగా వున్నట్లుంది. కొంచెం లికి రా.

యు: అబ్బే! అక్కర్లేదు...పూహించడానికి కూడా భయం కలిగించే విషయాలు వింటే, వణుకు పుట్టడం సహజమేకదా!

దు: (తన కాఠిన్యానికి విచారిస్తూ) నా మాట తప్పే!

యు: అబ్బే! అక్షరాలా నిజం.

[క్షణం నిశ్శబ్దం]

దు: ఏమిటి ఆలోచిస్తున్నావ్?

యు: నైజాం వెళ్ళాతన్న మీ అబ్బాయిని నేనెప్పుడైనా కలుసుకున్నానేమో?...అతని పేరేమిటన్నారు?

దు: అబ్బే! పొరపాటునకూడా కలుసుకొని వుండవు.

యు: (హేళనగా) చాలా సంతోషం. కాని అతడు మర్యాదస్థుడైనంతమాత్రాన అతని పేరు చెప్పడానికే

దు: వాడి పేరు మోహనరావు.

[యువకుడు పాలిపోతాడు. ఒక్క క్షణం దుకాణదారు కళ్లల్లోకి చూసి బాధతో]

యు: అవును...ఎప్పుడూ చూడలేదు...

దు: చెప్పానుగా! ఏడు సంవత్సరాలైంది వెళ్ళి——పదహారేళ్లప్పుడు——అప్పుడు గుట్టల మిల్లులో పని——...ఈసరికి గుమాస్తా అయి, హాయిగా వుండి వుంటాడు.

యు: (ఆలోచనగా) మీ కలను హాయిగా వున్నాడని యేం తెలుసు?

దు: తప్పకుండా వుండివుండాలి——...వాడి తత్త్వం నాకు తెలుసు

యు: అంటే, మీ కతను వుత్తరాలు వ్రాయటం లేదా?

దు: వ్రాయనిమాట నిజమే ననుకో——

యు: ఇంతవరకు! ఏడు సంవత్సరాలు!!

దు: అయినా, వాడికి తీరిక ఎక్కడవుంటుంది? ముందు పొట్టకోసం పాటుపడాలి—ముందు ముందూ బాగుపడడానికి కష్టపడి పనిచెయ్యాలి. ఈసరికి ఓ పెద్ద వ్యాపారం చేస్తున్నాడన్నా నేను ఆశ్చర్య పడను...వాడు నిజంగా అంత సమర్థుడు.

యు: నిజమే!—అలానే వుండవచ్చు. ఒక వేళ అట్లా లేదనుకోండి—

దు: అట్లా అనుకోను; అనుకోలేను. వాడు సమర్థుడని చెప్పానుగా! వాడికి చేతకాని పనంటూ లేదు...

యు: మీరు చెప్పింది నిజమే ననుకోండి... కాని అతను చేసే వుద్యోగం అటువంటిది కావచ్చు గదా!

దు: ఎటువంటిదైనా ఫరవాలేదు. వాడు చెయ్యగలడు...ఇప్పటినుంచా? చిన్నప్పటినుంచీ వాడంతే! వాడికి చెయ్యలేని పనంటూ వుండదు... (ఆశతో) నా ఆశలన్నీ వాడిమీదనే పెట్టుకున్నాను.

యు: (ఎంతో బాధను అణుచుకుంటూ) అయితే...అతను...(ఏదో చెప్పబోయి, చెప్పలేక పోతాడు.)

దు: ఆఁ! ఏమిటి అతను?

యు: అదే! అతని దగ్గరనుంచీ ఎవరికీ ఉత్తరాలు రాలేదా?

దు: (తేల్చివేస్తూ) ఆఁ! ఒకటో రెండో సార్లు వచ్చినయ్.

యు: (ఆసక్తితో) ఎవరికి?

దు: పోనిద్దూ...ఎవరికైతే మనకేం?

యు: వాళ్ళంటే మీకు యిష్టంవున్నట్లులేదు.

దు: ఆఁ! ఎవరో అమ్మాయికి వ్రాశాడు. అక్కడికి వచ్చీ గానే, వాడికి యింటిమీద బెంగ పట్టుకున్న దట!...ఏదైతేనేం—

యు: నిజంగానే ఇంటిమీద బెంగతో ఏడ్చాడేమో?

దు: (కొంచెం తీక్షణంగా) బాగుపడేవాడికి అటువంటివి పడితే యిక సాగినట్లే!...ఆ అమ్మాయి చెప్పింది, వాడు తనను పెళ్ళిచేసుకుంటానన్నాడని.. నేనన్నానూ—వాడు నీసంగతి ఎప్పుడో మరచిపోయాడు—అని.

యు: (ఆలోచనగా) ఊహుఁ! ఆ అమ్మాయే మరచిపోయివుండాలి.

దు: లేదు, లేదు...ఆ అమ్మాయికి మావాడిమీద యింకా ఆశవుందట!

యు: (ఆశ్చర్యంగా) ఆ ...ఇంకా పెళ్ళికాలేదా?

దు: ఊహుఁ!

యు: ఏమో! ఆ అమ్మాయి అతనికోసమే యింతవరకూ పెళ్ళిచేసుకోకుండా వున్నదంటే నేను నమ్మను.

దు: మరి ఎప్పుడూ వీడ్ని గురించే మాట్లాడుతుంది కదా!

యు: జీవితంలో అటువంటి సంఘటన లున్నప్పుడే నిలవనీరు కదిలేది. అందుకోసం కావచ్చు.

దు: నాకు అర్థం అయేటట్లు మాట్లాడు.

యు: ఏంలేదు...ఈ పరిస్థితుల్లో, మీఅబ్బాయిని గాని, ఆ అమ్మాయిని గాని యీ పెళ్లిచేసుకుంటారా అని అడగండి వాళ్లు మీ ఎదుటనే చేసుకోమని ఘట్టిగా చెబుతారు.

దు: మావాడిప్పటికీ ఆ అమ్మాయికి అడపా దడపా వుత్తరాలు వ్రాస్తాట్ట!

యు: చెప్పానుగా! అది కేవలం వాళ్లకోసం కాదు. వాళ్లనుగురించి ఇన్ని విషయాలు తెలుసుకున్న ప్రపంచం, వాళ్లిద్దరో ఒకటి యిటువంటి పని చెయ్యకపోతే, వాళ్లను ఒట్టి వాజమ్మలకింద కడుతుంది.

దు: ఏమిటో! కాని ఇటువంటి వన్నీ జరిగినా, వాడు సుఖంగా మంచి వుద్యోగం చేస్తూవుంటాడీ పాటికి.

యు: (గంభీరంగా, అయినా బాధగా) ఆఁ! ఒక్కమాటనుగుతాను—ఏమీ అనుకోరుకదూ!— పూరికే వాదనకోసం అడుగుతున్నాను...మీ అబ్బాయి మీ రనుకున్నంత హాయిగా వుండకపో వచ్చు...చాలా కష్టాల్లోవుండి వెనక్కు తిరిగిరా వచ్చు...అదృష్టం కనికరించకపోవచ్చు నతన్ని. మీకు తెలిసినప్పటికీ, యిప్పటికీ ఎంతో మారివుండ వచ్చు.

దు: (కోపంతో) ఎవరి సంగతి నువు చెబుతున్నది? మావాడి సంగతేనా?

యు: కోప్పడకండి...పూరికే, వాదనకోసమని చెప్పానుగా!

దు: దేనికోసమైనా మావాడు చాలా హాయిగా వుంటాడు.

యు : దురదృష్టవంతుల్ని బాగుచేసేవాళ్లెవరు?

దు: అటువంటి దేదైనావుంటే మాకు తప్పకుండా రాశేవాడు... వాడు రాయలేదంటే—

యు: వ్రాయతలు మరోక పోవచ్చుకదా!

[ఇంతకు పూర్వమే పోలీసు వస్తాడు. వీళ్ళ మాటలు పూర్తిగా వినడు. ఈ చివరిమాట విని ఆ యువకుడు కూడా తనకుమాదిరిగానే తమాషాకు మాట్లాడుతున్నాడనుకుంటాడు.]

పో : మాషబ్బాయ్! నువ్వతనితో యేదో హాస్యాలాడుతున్నావల్లేవుందే!... అట్లాగయితే మీ యిద్దరిలో ఎవరినో ఒకరిని పిచ్చాసుపత్రికి పంపించాలి.

దు నీ నవ్వులాటలు మళ్ళీ మొదలుపెట్టావా?

పో అరె! నేను తమాషాకంటున్నానని నీకూ తెలిసిందే!

దు కాని ఈ అబ్బాయికి తెలియదు.

యు : నేను యిందాకటినుంచీ, యీయనతో ఒక విషయాన్ని గురించి మాట్లాడుతున్నాను... మాట్లాడటం యేమిటి? వాదిస్తున్నాను... వాదించి లాభం లేదని నాకిదివరకే తెలిసివుండవలసింది.

పో : భేష్! ఈయన సంగతి పూర్తిగా తెలిసిందా ఏం?

యు : నాకెట్లా తెలుస్తుంది?

పో : ఎందుకు తెలియదు? నువ్వేం మాట్లాడినా ఎదురుచెప్పడు ఆయన.

దు : మళ్ళీ తమాషానా?

పో : ఈసారి మెచ్చుకుంటున్నావా యేం?

యు : (తను వెళ్ళడం భావ్యం అనుకొని) సరే! ఇక నేను వెడతాను.

పో: నేను రాగానే నువ్వు వెళ్ళిపోతున్నావంటే నిన్ను గురించి నేను అనుమానపడవలసివుంటుంది.

యు: (నవ్వుతూ) అయితే, నువ్వు అన్నం తినడం మానేసి సూదులు తింటున్నావా యేం?

పో: (అర్థంకాక) ఏం?

యు: అబ్బే! ఏంలేదు... వాటంత పదును గానూ వుంటేనూ!

పో: (నవ్వుతూ) బావుంది, బావుంది... కాని, తమాషాకు నన్నెన్ని అన్నా నాకు బాగానే వుంటుంది

యు: అయితే యింకేం? నువ్వూ వంటవా రకం!

పో: వంటవాడేమిటిది?

దు: అబ్బే! ఇతను స్వంతంగా వంటచేసుకోడు.

యు: అదికాదండీ! వంటవాడి మాదిరిగా యీయనకూ యితరులకు వడ్డించటం తప్ప పనేమీ లేదని.

దు: ఇతనటువంటివాడు కాదు! హైదరాబాదువాళ్లు అందరూ అటువంటి వాళ్లేనా యేమిటి?

పో: ఓ! అయితే నువ్వు హైదరాబాదునుంచి వచ్చావన్నమాట! ఏ ప్రాంతాలనుంచి?

యు: ఔరంగాబాద్... ఇంకా పైన..

దు: అదేమిటి! నాకు హైదరాబాదులో అని చెప్పావ్?

యు: అక్కడా వున్నాను... కాని ఎక్కువ రోజులు పైనే!

దు: అయితే హైదరాబాదులో అని ఎందుకు చెప్పావ్?

యు: ఏమిటో! మీరు హైదరాబాదువాళ్లేనా అని అడిగారు. ఔనన్నాను.

పో: అక్కడ ఏం చేసేవాడివి?

యు: నవాబునో, ప్రధాన మంత్రినో కావలసింది. కాని కాలేదు. .

పో: నే నడిగింది నువ్వు చేసిన ఉద్యోగం ఏమిటని?

యు: అదా! ఓ ఆఫీసులో గుమాస్తా.

దు: ఇందాక ఇంకేదో చెప్పావ్?

యు: మీరు వూరుకోండి బాబూ, పుణ్యం వుంటుంది.

దు: (బిత్తరపోయి) అట్లా అన్నావు-బావుంది. [నిట్టూరుస్తూ, మధ్యమధ్య యువకుడివంక చూస్తాడు.]

పో: (దుకాణదారుతో) ఏమిటి అట్లా తిరిగావ్? ఏమైంది?

దు: నాకేమైతే యేంకాని, ప్రతివిషయం నీకెందుకు?... ఇట్లా చంపుకుతింటాడు ప్రతి విషయంలో—

పో: (ఆశ్చర్యంతో) ఏమడిగాను? వూరికే విషయాలు తెలుసుకోవడాని కడిగాను... (యువకుడితో) ఏమయ్యా! నే నడిగిన ప్రశ్నలు నీకు కూడా బాగుండలేదా యేం? ఇంకా అడిగినా నువ్వు సమాధానం చెబుతావుగా!

యు : అయ్యో! దానికేం?

[ఈ మాటలు విని పోలీసు యువకుడి కళ్లల్లోకి చూస్తాడు...దగ్గరకు వచ్చి భుజం తట్టి]

పో : అది! అట్లా వుండాలి.

యు: (కొద్దిగా జంకుతూ) చూడండి! ఇందాక మీరు వచ్చేసరికి ఒక విషయాన్ని గురించి మాట్లాడుకుంటున్నాం. ప్రపంచంలో నిజంగా జరిగే ఒక విషయాన్ని, ఆయన్ని ఒప్పుకోమంటున్నాను.

దు : (కోపంతో) మా వాడు కులాసాగా లేడని, జైల్లో పడ్డాడని ఒప్పుకోమంటావ్!...... అంతేనా?

యు : (ఇక మాట్లాడ్డం అనవసర మనుకొని నిస్పృహతో) సరే, వెళ్లొస్తాను......వస్తాను కాన్‌స్టేబుల్!...నీవంటి పోలీసులు కనిపించడం చాలా అరుదు.

పో : నువ్వు వుంటే నాకూ హుషారుగా వుంది ...కొంచెం సేపాగు

యు : బాగుంది...(అంటూ వెళ్లడానికి ప్రయత్నిస్తాడు)

పో : అదేమిటోయ్! వెళ్ళిపోకు. నేనొక పెద్ద మనిషి కోసం వెతుకుతున్నాను చూడగా ఆ మనిషివి నువ్వే ననిపిస్తున్నది నాకు.

యు: నేనా? నేను పెద్దమనిషిలా కనిపిస్తున్నానా?

పో: కాకపోతే మరీ మంచిదిగా! నాతో పాటువచ్చి, ఈ రాత్రికి స్టేషన్‌లో వుండు...ఆ మనిషివి కాకపోతే ఏ యిబ్బందీ లేదు. ఆ మనిషివే అయితే, నేను యీ రాత్రంతా తిరిగే బాధ తప్పుతుంది...ఏమంటావ్?

యు: వెడతానంటాను.

పో: నువ్విట్లా అంటావని నాకు ఎప్పుడో తెలుసు.

[యువకుడు త్వరగా వెళ్ళిపోతాడు...అతని వెంటనే పోలీసుకూడా వెడతాడు, 'విజిల్' వేసుకుంటూ. ఈ సంఘటన దుకాణదారును కలవర పెడుతుంది. లేచి అటూ, ఇటూ చూస్తూవుంటాడు. ఒకసారి ఒకవైపు, మరొకసారి రెండవవైపు వినిపిస్తుంది విజిల్. దుకాణదారు తానుకూడా త్వరగా కొట్టు వేసి, ఎడమవైపుకు వెళ్లిపోతాడు...ఒక్కక్షణం తరువాత యువకుడు ముందు, పోలీసు తరువాత రెండవ ప్రక్కనుంచి.)

యు: చివరకు తరుముకువచ్చావ్! పద, ఇప్పుడు నీతో హాయిగా స్టేషన్‌కు వస్తాను.

పో: వస్తావా?....బావుంది. సరే! నిన్నొక్కసారి చూడనీ!

యు: నేనెవరో నీకు తెలియదు. ఒకవేళ నన్ను చూసినా నిరుత్సాహపడక మానవు.

పో: ఏం? నీ మొహం బావుండదా?

యు: (కోపంతో) నన్ను వీలైనంత ఎక్కువగా బాధ పెడదామని వచ్చినట్టున్నావ్? నీ మామూలు పద్ధతి పోనివ్వవు ...సరే! నీకు కావలసిన మనిషిని నేనేనా?

పో : ఏమో కాని ఈ దుకాణదారుని నీ కళ్ళల్లోకి ఒకసారి చూడమని చెప్పాలి.

యు: (కంగారుగా) వద్దు, వద్దు.

పో: అబ్బె! తప్పకుండా చూపిస్తాను

యు: చూపించటం నీకు చేతకాదు. అప్పుడు చూసేది నన్ను కాదు; నా శవాన్ని...నీకంతగా అవసరమైతే నన్ను స్టేషనుకు తీసుకుపో!

పో: నీ వాలకం చూడగానే గుర్తుపట్టాను... ఏదీ! నిన్నొకసారి సరిగ్గా చూడనీ!

యు : (తీక్షణంగా) నీ కప్పుడే ఒకసారి చెప్పాను.

పో: చెప్పావా?...అయినా చూడక తప్పదు.

[యువకుడు ఒక్కసారి పోలీసు కాళ్లు పట్టుకొని.]

యు: నన్ను వదిలిపెట్టు కాన్‌స్టేబుల్! నువ్వు నిజం కనిపెట్టావ్!...నేనిక ఒక్కక్షణం వుండను. వెళ్ళిపోతాను. అయినా మళ్ళీ నన్ను మావాళ్ళలో చేర్చే ప్రమేయం నీకెందుకు, చెప్పు?

పో: పారిపోయినవాళ్ళంటే నా కిష్టం లేదు.

యు : ఆలోచించు...ఎంతో ఆశతో వున్నవాళ్లను నిరుత్సాహపరిస్తే, ఒక్కొక్కప్పుడు గుండె ఆగి చచ్చిపోవడం కూడా కద్దు...(జాలిగా) ఏమంటావ్?

పో : సరే! అయిదు నిముషాలు టైం ఇచ్చాను నీకు. తరువాత నువ్వు కనిపిస్తే, అన్నంత పనీ చేసి తీరతాను.

[పోలీసు వెళ్ళిపోతాడు. దుకాణదారుకోసం యువకుడు వెతుకుతాడు. ఆలస్యాన్ని భరించలేక యిక వెడదామనుకుంటూవుండగా దుకాణదారు వస్తాడు.]

యు : ఓ! మళ్ళీ కనిపించరేమో ననుకున్నాను ...ఎల్లాగైతేనేం కనిపించారు......సెలవు తీసుకుంటాను.

దు : మంచిది నాయనా! ముందుముందు నువ్వు బాగుపడతావని నాకు గట్టి నమ్మకం వుంది.

యు : బాగుపడతానా?

దు : అవును...ఇంతకంటె——

యు : ఏమో, కావచ్చు...మీ ఆశీర్వాదం... ఆఁ! (ఒక క్షణం సంకోచించి) మీ అబ్బాయి——

దు : ఆఁ! మా అబ్బాయి సంగతికేం? ముందు-

యు : అది కాదు! అతను, వూహించలేని పరిస్థితుల్లో వస్తే, అతని తల్లి అయినా కనీసం ఆదరించదా —అని.

దు : తల్లా! ఆమె...చచ్చిపోయింది.

యు : (పాలిపోయి, గాద్గదికంగా) చచ్చిపోయిందా? చ...చ్చి...పోయిందా? తను కొడుకులు తిరిగివచ్చేవరకైనా తల్లులు బ్రతుకుతారనుకున్నాను. ప్రపంచం నిరాశానిలయం...అంతే!...వస్తాను...

దు: (యువకునివంక విచారంగా, ఆప్యాయంగా చూసి) మంచిది నాయనా!...నిన్ను చూస్తుంటే మావాడు జ్ఞాపకం వస్తున్నాడు......

యు: (కొంచెం ముందుకు వచ్చి, కన్నీళ్లతో, ఎంతో బాధతో, మెల్లగా) నాన్నా!!

[వెళ్ళిపోతాడు...ఇంతలో పోలీసు వచ్చి విచారంగా వున్న దుకాణదారువంక చూసి, నవ్వి, గుమ్మముకు వెళ్లినవైపు చూస్తాడు ..దుకాణదారుకూడా భారంగా అటే వెనుతిరావుండగా

[తెర]

[హెరాల్డ్ చాప్‌మన్‌కు కృతజ్ఞతతో]

# నాచనసోమన హరివంశము

## శ్రీ యస్. వి. యస్. భాష్యకారాచార్యులు

సోమనాథుడు మహాభారతోత్తర భాగమగు హరివంశము నాంధ్రీకరించి నన్నయాదులకంటె మిన్నయా యని యనిపించుకొనిన కవిశ్రేష్ఠుడు. సంస్కృతమునందు మహాభారతములోని యంత్య భాగముగనే హరివంశమునకు పరిగణనము. కనుకనే లక్ష సంఖ్యగల మహాభారతమునకు ఇరువదియైదు వేలు గ్రంథ సంఖ్యగల హరివంశముతో గలిసి "భారతము సపాదలక్ష గ్రంథ" మను ప్రతీతి కలిగినది. అట్టి మహా గ్రంథమును నన్నయ తిక్కన లాంధ్రీకరించి యాంధ్ర కవితామతల్లికి దారిజూపిరి. భారతారణ్య పర్వమున తుదిభాగము ఎఱ్ఱన పూర్తిచేసెనని ప్రతీతి గలదు కాని యాశ్వాసాంత గద్యమున నన్నయ కర్తృకముగనే చెప్పబడియున్నది. అందుచే భారత కవులుగా చెప్ప దగినవారు న్యాయముగ నన్నయ తిక్కనలుగదా! అయినను ఎఱ్ఱాప్రెగ్గడను భారతకవిగా పరిగణించుట హరివంశాంధ్రీకరణము మూలముననే యనుట సమంజసము. నష్టభాగముగ నరణ్యపర్వమున నేవో కొన్ని పద్య భాగములు పూరించినంత మాత్రమున నన్నయ తిక్కనలతో సమాన గౌరవమును కవిలోక మెఱ్ఱన కిచ్చియుండదు. భారతోత్తరభాగమగు హరివంశము నాంధ్రీకరించియే యెఱ్ఱన భారత కవి యను కీర్తి బడసె ననుట యుక్తము. అట్లు భారత కవులలో నెన్నికగన్న నాచన సోమనాథుడును (హరివంశము నాంధ్రీకరించి) ప్రయత్నించినను ఈతని కట్టి పరిగణనము లభింపలేదు. అందులకు నాచన సోమనాథుని కవితయందలి తీరుమాత్రము కారణము కాదు. నాచన సోమనాథునికంటె కొద్దికాలము ముందుగనే యెఱ్ఱన హరివంశము పూర్తియగుటయు నరణ్యపర్వమునందలి నష్టాంశము లీతనిచే పూరింపబడుటయు కారణము గావచ్చును. కాని సోమనాథుడు హరివంశ రచన మారంభించునాటికి ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశము రచితమయి రంగమునకు వచ్చియుండక పోవచ్చును. అట్టి సమయమున తిక్కనవంటి కవితాశక్తిగల సోమనాథుడు తిక్కన మిగిలించిన భారతమును పూర్తిచేయ దలపెట్టినట్లు కానవచ్చును. కావుననే సోమనాథుడాశ్వాసాంతమున "తిక్కన సోమయాజికృతి మహాభారత కథానంతరమున" నని వ్రాసికొనియెను. అట్టి సంబంధమును మహాభారతముతో గల్పించుకొనన దలంపు లేక ప్రత్యేక గ్రంథమును రచింప నుద్దేశించినచో పైరీతిని మహాభారత కథానంతరమున ననుట యనావశ్యకము. ఈ వాక్యమే యానాటికి మహాభారతానుబంధముగా హరివంశము వేరొక్కటి రచింపబడలే దనుటకు నిదర్శనము. సోమనాథుడు తిక్కనవలె హరిహరనాథునే కృతిపతిగా నొనర్చుటయు భారత సంబంధము నుద్దేశించియే యనదగును. కవితారీతులయందును సోమనాథుడు తిక్కనకు దగ్గరగా నుండుననుట కెట్టి సంశయమును లేదు. కాని దైవవిధాన మన్యవిధముగా నుండుటచే సోమనాథుడు భారతకవిగా నెఱ్ఱనవలె తిక్కనపజ్జకు రాజాలకపోయెను.

సోమనాథుడు 14 వ క్రీస్తుశతాబ్దమున నున్నట్లు వీరేశలింగ ప్రభృతులు చెప్పుచున్నారు. మనకు కాల విమర్శ మంత ముఖ్యము గాకపోయినను ఎఱ్ఱాప్రెగ్గడకు సమకాలికుడనుట మాత్రము నిక్కము.

సోమన కవితకు ఆంధ్రకవు లనేకులు పరవశులయిరనుట మాత్రము సత్యము. రామరాజ భూషణుడు వసుచరిత్రమున "మహిమ న్వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు దన్మహనీయస్థితి మూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహామహులై సోముడు భాస్కరుండు వెలయింపన్" అని యాంధ్రోక్తిమయప్రపంచమునకు చల్లని ప్రకాశము నిచ్చి యాహ్లాదముం గల్గించువానిగా చెప్పియున్నాడు. శ్రీనాధాది మహాకవులు సోమనాథునియం దపరిమిత గౌరవమును జూపిరి. చిన్నయసూరి యలికంబున యక్షిని దాచినట్టి సర్వజ్ఞుడనియె. సీతారామాచార్యులుగారు హరివంశము భారతముకంటెను మిన్నయనియు సోమనాథుని సర్వజ్ఞుడనుటకు సందేహింపబనిలేదనియు నుడివిరి. విమర్శించినచో నీత డట్టి నుతికి సర్వవిధములనర్హుడనుట కెట్టిసంశయమును లేదు.

హరివంశ పూర్వభాగము గూడ నీతడు రచింపనయ్యది యంతరించి యుత్తరభాగము మాత్రమే నిలిచియున్నట్లు తోచుచున్నది. ఉత్తర హరివంశారంభము జూడ నయ్యది గ్రంథారంభము గాదన్నట్లు

తప్పక స్ఫురించును. ఇట నిష్టదేవతానమస్కారాదులు గానరావు. గ్రంథమన్యమున నాశ్వాసారంభమువలె "శ్రీ సర్వమంగళాకుచవాసంతీ వకుళ గంధవద్వన మాలా। వాసుకి విలాస వేదవ్యాసముని మనోనివాస హరిహరనాథా॥" యను పద్యముతో కథ యారంభమయినది. హరిహరనాథభక్తుడును ఆస్తికాగ్రేసరుడును అగు సోమనాథుడు మంగళాచరణమును జేయకయే కావ్యము నారంభించి యుండడు. ఇష్టదేవతానమస్కారము పూర్వకవిస్తుతి గ్రంథారంభకారణోక్తియు సామాన్యముగా నాకాలపు కవులు జేయుచుండ సోమనమాత్రము నిట్లు తద్భిన్నముగా నారంభించియుండడు. వైశంపాయనుడు జనమేజయునితో నేసందర్భమున జెప్పుచుండెనో యా విషయముమాత్రమయినను ఊహోద్ఘాతముగ జెప్పవలసియున్నది. "హరివంశ ప్రథమ కథాంతరమునగల వింతలెల్ల దప్పక మదిలో దిరమయ్యెగదా మీదట నరవర యేకథలొక్కో వినం బ్రియమనుడున్" అనుటయు మీదిభాగము కొంత యున్నట్లు సూచించుచున్నది. ఈ వాక్యము సంస్కృత హరివంశములోని శ్లోకమున కనుకరణమను టకును నట్టియర్థముగల శ్లోకమందు లేకుండుటచే వీలుకాకున్నది.

గ్రంథారంభమయినచో దప్పక పూర్వకవిస్తుతి షష్ఠ్యంతములు, మొదలగువానిం గూర్చియుండును. పై కారణములనుబట్టి సోమనాథుడు హరివంశ పూర్వోత్తర భాగములు రెండును రచించెననియు నేకారణముననో పూర్వభాగము లుప్తమయ్యె ననుటయు, యుక్తముగా కానవచ్చుచున్నది.

కవిత్రయమున చేర్పఁబడకపోయినను నాచన సోమనాథుడు ప్రత్యేక గౌరవమున తిక్కనకు పోక హరివంశరచనమున తనకీర్తి పదిదిశల మారుమ్రోగున ట్లొనరించెను. ఏ తదితర గ్రంథములవిషయమేమియు దెలియరాకుండుటచే నీ హరివంశముం బట్టియే యీతని వైదగ్ధ్యమును లోకము గ్రహింపవలసియున్నది.

ఇతనికవిత యతిమనోహరము. కేవల సంస్కృతప్రాయముగాకయు దేశ్యప్రాయమునుగాక సంస్కృతాంధ్రపదము లొక చక్కని పాలుగగూడి యనిర్వాచ్యశైలి నీతని కవిత నడిచెను. అప్రయత్నసిద్ధముగా నీతని పదగుంభన ముండుటచే సామాన్య లౌకిక సంభాషణమువలె నకృత్రిమమయి పాఠకులకు పరవశత్వమాపాదించును. ఉక్తిప్రత్యుక్తిరూపములగు సామాన్య సంభాషణములను చక్కగ పద్యమున నడిపి మనోహరతం గూర్చును.

పద్యమున చెప్పదలంచిన యర్థమునకు సరిపడునట్లు పదముల నన్యూనాతిరిక్తముగ ప్రయోగించుట కవియొక్క గొప్పతనమును సూచించు లక్షణము. ఇట్టి గుణము మహాకవులలోగూడ చాల నరుదుగా నున్నది. కాని యీకావ్యమున మాత్రము నియ్యది సర్వవ్యాప్తము.

పిఱికివి గాక నీవు నొక
  పెగ్గడవే సభలుండు భంగి ము
న్నెఱుగనివాడవై భ్రమసి
  యెవ్వరిమీఁదట నేమి మాటలో
యఱచితి, వారి జంకెనల
  కంతట దోపడివచ్చితిచ్చటం
గఱవగవచ్చునే బలిమి
  గాడిదకుం బులితోలు గప్పినన్.

ఇందు కృష్ణుని నుతించుచున్న జనార్దనుని హంసుడు నిందించురీతిలో పదము లెంత యన్యూనాతిరిక్తముగ నున్నవో చిలకింపుడు.

గడుసుదనము లేని పిఱికిపందవు. సభలన్న నెన్నడెఱుంగని గ్రామీణుడవు. పరుల యైశ్వర్యమును జూచి భ్రమసిపోయితివి. ఎక్కడెట్లు మాటాడుటనో యెఱుంగక పరుల బెదిరింపులకు భయపడితివి. అయ్యో నీకట్టి తుచ్ఛ మెట్లు కలుగును. గాడిదకు పులితోలు గప్పినంతమాత్రమున కఱవగలదే. అని యెంతయో భావము నింపలి పదములు చక్కగ బోధించుచున్నవి ఇప్పట్టున వాక్యార్థమును సరిగ బోధించుటకు కొన్ని పదముల యర్థ మూహించుకొన నక్కరలేదు. అర్థబోధమునకు తగినన్ని పదములు చక్కని తీరున నమరియున్నవి. ఒక పదమయినను అనవసరమయినది గాని ఊతపదముగా గాని యిందు కానరాదు. ఇట్టి పద్యములిం దనేకము లున్నవి. అనేకము లననేల! అన్నియు నట్టివే యనవచ్చును.

ఓరిదురాత్మ నీకు దెగ
  నొల్లకయుండుట నీ పరాక్రమం
బారసికాదురా, వెఱవ
  కాడుము, దూత యవధ్యుడెందు నీ
వీరుల నిన్ను నమ్మొటన
  వ్రేయుదు, డాయుదు, బోర శౌరికిన్

సీ॥ బాహుసారమెస
నేయుము, జేయుదు రాజసూయమున్.

ఇందు పదములు రసానుగుణముగా, నన్యూనానతిరిక్తములుగా నున్నవిగదా! ఇట్టితీరునే సమ్మితత్వమను గుణముగా నాలంకారికులు నిర్వచించిరి.

రసానుగుణములు సంభాషణములు, శైలియు నీతని సొమ్ము. ఒరి దురాత్మ యను మీది పద్యమున ఒరి దురాత్మ, కాదురా! ఇత్యాది పదము లెంతయు రసానుగుణములుగదా! ఇట్టే

నురాసాత్యకి మాటలేమిటికి రా
వేదండ కోదండ
లిన సంకేత నరేంద్ర నూతన బలో
ద్రగంబుగా మోహరిం
ప నవశ్యంబును వత్తు బుమ్కరసర
పార్శ్వంబునం వెల్లి గొ
ల్లైన లెత్తింతు విరోధు లంబునిధి
వెల్లిండ్లొ జల్లింపగన్॥

ఇచట గర్వమును చక్కగ సూచించినాడు. "అన్యక్షేకరణా దాత్మోత్కర్షో గర్వో బలాదిభిః" అని గర్వలక్షణము. ఇచ్చట క్రోధభావమున కంగముగా గర్వమును బోషించి యుండెను. ఈ సందర్భమున వినురా! ఏమిటికిరా! ఒరీ ఇత్యాదిక మెంత చక్కని శబ్దజాలమో సహృదయ వేద్యము

రీతులను వృత్తులను సందర్భానుగుణముగ నీతడు సంఘటించుచుండును. ఇతడు సాధారణముగా కోమలవర్ణ పదగుంభనము జేయుచుండునుగాని వికటాక్షరఘటనయు నట్లు అతిదీర్ఘ సమాసరచనమును గూర్చడు. అందుచే నిందు తరచు కైశికీవృత్తియు నచ్చటచ్చట భారతీ సాత్వతీ వృత్తులును గానవచ్చునే గాని యారభటి సాధారణముగా గానరాదు. అట్లని రౌద్రాది రసస్థలములందు విరుద్ధములగు కైశిక్యాదులను గూర్చడు. రసానుగుణముగ మధ్యమారభటీ వృత్తి నవలంబించునేగాని యుద్ధవర్ణనసందర్భమునందైనను రౌద్ర భయానకాది రసోచితమగు నారభటి యుచితమయ్యును నట్టి వికటాక్షర బంధాదు లితనికి సహజములు కావు. అట్లని రసవిరుద్ధమగు వృత్తి నవలంబింపక మధ్యమారభటి నవలంబించును. లేదా మధ్యమ కైశికి నడిపించును. అంతియగాని యారభటీ వృత్తి యితని గ్రంథమున చాల తక్కువ.

పై రెండువృత్తులును సర్వరస సాధారణములని విద్యానాథుడు "మధ్యమారభటీ చైవ తథా మధ్యమ కైశికీ । వృత్తీ ఇమే సర్వరస సాధారణే మతే" అని వచించెను. నరకాసురుని వీరత్వవర్ణనసందర్భమునను వైనతేయుని వీరత్వ భయానకత్వ వర్ణనమునను మధ్యమారభటిని రసానుగుణముగ నుపయోగించెను.

ఊర్వశీ నరకాసుర సల్లాపసందర్భమునను శృంగార రసాభాసానుగుణముగ కైశికీ మధ్యమకైశికీ వృత్తుల నవలంబించెను. ఏకలవ్య బలరాముల యుద్ధసందర్భమునను కాశీపతిపై ప్రయోగించునప్పటి చక్రవర్ణనమునను ఆరభటీవృత్తియు గౌడీరీతియు నెంతియో సమంజసముగా నున్నవి. ఇట్లా యా సందర్భానుగుణముగ వృత్తులను జాగరూకతతో నవలంబించెను. కొందరుకవు లిట్టి విషయమున స్వాతంత్ర్యము నవలంబించుట గలదు. నందిమల్లయ ఘంట సింగయ్యలు తమ వరాహపురాణమున శృంగార రసాలంబనమగు నొక కాంత విరహవేదనా వర్ణనమున నొక ద్వ్యక్షర కందమును రచించియున్నారు. ఇట్టి శబ్దచిత్రములు కావ్యమున, నందును శృంగారవర్ణనమున, నందును విప్రలంభ శృంగారమున సఖీజనుల వాక్యములుగా, నిట్టి తీరున నుండుట రసానుగుణము కాదుగదా! సరసతర కవితానిపుణుడగు పింగళి సూరనార్యుడు ప్రభావతీప్రద్యుమ్నమునను కళాపూర్ణోదయమునను రసానుగుణముగ శైలి నాదరించుటచేతనే యా కావ్యముల కట్టి లోకోత్తరత లభించెను. ఆతడు నొకటి రెండు స్థలములందు శృంగారరస విరుద్ధముగా న సమాసముల నుపయోగించెనుకాని సోమనాథుడు మాత్రము ఆపాటియు రసాననుగుణమగు శైలి జొనుపడు. వీరరస ప్రధానమగు నికావ్యమున నాతిప్రౌఢమగు సందర్భమును గూర్చి కావ్యమునకు రమ్యత నాపాదించుట యాతని వైలక్షణ్యమనక తప్పదు.

ఈ గ్రంథమున నర్థాలంకారములు విరళముగనే యుండును. రసదృష్టి గలవాడగుటచే నిక్కవి కలంకారములం దాదరము తక్కువయేమో. "లోక పాలకుల్ కాలుచిచ్చునకు గాచ్పులు దోడగు చందమొప్పగన్", "గతిజల సేతుబంధనము జేసిన రాదటె నవ్వుబాటు" ఇట్టి యుపమా లలితాద్యలంకారము లచ్చటచ్చట మాత్రమే గానవచ్చును. ఉత్ప్రేక్షాతిశయోక్త్యలం దీమాత్రపు టాదరము నిక్కవికి కానరాదు. చాలవరకు సహజత్వమును సౌకుమార్యమును కాంక్షించువాడగుటచే నట్టి యథాతి కల్పనము లీతనికి నచ్చవు. క్రమాలంకారము మాత్రము

నొక విచిత్రశైలితో ననుప్రాసముతో జతచేసి మనోహరముగా నీతడు గూర్చెను.

అలంకారాదరము తక్కువ గల యిక్కవి శబ్దాలంకారములనుమాత్రము తరచుగా గూర్చును. అవి యాతని కప్రయత్న సిద్ధములు. అర్థాలంకారములందైన మక్కువలేని రసైకప్రవణుడగు నిక్కవికి శబ్దాలంకారములందు ప్రయత్నముండునా! కాన నప్రయత్నముగనే యీతనికి శబ్దాలంకారములు జతగూడుననుట యుక్తము. శబ్దాలంకారములను గూర్చుట మంచిపద్ధతి గాదని యాలంకారికుల యభిప్రాయము కనుకనే "శక్తావపిప్రమాదిత్వం" అని సమర్థుడైన కవియు ప్రయోగింపరాదని వారి యుద్ఘోషణము. సోమనాథుడు సమర్థుడగుటచే నట్టి ప్రమాదము రాకుండ నతిసుకుమార మగు రీతిని శబ్దాలంకారము లిందు వాడియున్నాడు. శబ్దాలంకార మెట్లుండిన రస విరోధి గాదో యా మర్మ మెరిగి యనంతర కవులకు అట్టి రహస్యము నుపదేశించినవాడనవచ్చును. పద్యమంతయు చల్లగా నడిపించి యొకటి రెండు చోటుల మాత్రము సుకుమారములగు వర్ణములుగల చిన్న పదములయావృత్తి ఘటించుచుండును. పాఠకుని ప్రత్యేక దృష్టి యుపయోగించనిచో నయ్యది యలంకారమని తెలియకయే యొకవిధమగు మనోహరత్వము పద్యమున సమకూడుచుండును. ఇట్టి యతిసుకుమారా ప్రయత్నసిద్ధానుప్రాసాలంకారములు గ్రంథమంతటను రస విరోధము లేకుండ మిక్కిలి చమత్కారిగా నుండుట ముఖ్యముగా గమనింపదగిన విషయము. ఈ గుణము చాలమంది గొప్పకవులందును మృగ్యము.

కొన్ని యుదాహరణములు. (ప్రథమాశ్వాసమున 153 పద్యమునుండి)

...యింపును దెంపును లోనమానమున్...

...మేలపుజూపుల వాడి తూపులన్

...గనయంబుం గొనయంబు......

...చనుదోయిం గనుదోయి...

తర్జన గర్జారవ జర్జరాంగ
రుధిరాసారంబు తోరంబుగన్.—

అరవిందనయన......సరవిందన
పరివేషము......సరివేషము
మొగము జగము నుతింపన్

దనుజ......గాత్రంబు గోత్రంబుగన్
సత్యభామ సంగ్రామసీమ.

అరిజూచున్ హరిజూచు......
...శరాసారమున్ పూరమున్......
పూర్వ సుపర్వపురాణగర్వమున్......
అచ్చర లిచ్చమెచ్చరే.

ఈ యుదాహరణము లన్నియు వరుస పద్యముల లోనివి గాని యచ్చటచ్చట నున్నవిగావు. ఇట్లే ఎచ్చట చూచినను సుకుమార శబ్దాలంకార భాసుర మయియున్నది.

కవులలో కొందరు సంస్కృతపద బాహుళ్యమును కొందరు దేశ్యపద బాహుళ్యమును ఉపయోగింతురు. ఇతడు ద్వివిధ పదజాలమును స్వేచ్ఛగా వాడగల నేర్పరి. అతని కవా లోచితముగ నవి యూరివచ్చుచుండును. వెదకి తెచ్చుకొని వేయు పదములు కావు. అప్రయత్నముగ నెచ్చట నే పదముండిన బాగుండునో నచ్చట ఆ పదము చక్కగ నదికికొనును.

అట్టేల జగములన్నియు
బుట్టింపం బెంప ద్రుంప బురుషులుముగ్గురై
పుట్టిన వేలుపవట, నా
పట్టియెడం దగునె నడిమిపని మానుటకున్.

ఇయ్యది పుత్రుడగు నరకాసురునిగూర్చి విలపించు భూదేవి విష్ణునితో జేసిన ప్రసంగము.

ఈతని పాత్రపోషణమును చాల రమ్యము. ప్రథమాశ్వాసమున స్వర్గమును జయించి నరకుడు ఊర్వశిని పిలిపించు పట్టున చక్కగ పాత్రపోషణము నొనరించెను. ఆసందర్భ మీ క్రిందివిధముగా నున్నది. నరకు డమరావతి నాక్రమించి యింద్రసింహాసన మధిష్ఠించి యాతని ధూర్తత కనుగుణముగా నూర్వశిం దోడితెమ్మనెనట. ధూర్తుని యనుచరులును నిట్టి చెడ్డ పనికి యహమహమికం జూపిరట. "ఊర్వశి దోడితెమ్మనుచు నొక్కని బంప బదుండ్రు పారి"రట! ఊర్వశిమాత్రము చారులు రాగనే భయపడి పారిపోవ ప్రయత్నింపలేదు. ఆమె యిట్టి ధూర్తులకు లొంగి భయపడి పారిపోవు ముగ్ధకులాంగన కాదు. కాన ధైర్య మభినయించి వచ్చెద పదుండని వారివెనుక నామెయు బయనమయ్యెను. కాని స్త్రీ జన సహజమగు భీతి యెట్లు లేకుండును? ఆమె ప్రౌఢగాన భీతి గప్పి పుచ్చుకొని బయలుదేరినది. భయముతో కాళ్లు తడబడునప్పుడు సవిలాసగమన మెట్లుండును. రాబోవు నాపద నూహించి మనము కలవరపడుచుండ నానన

సహజమగు చిరునగవె ట్లంతరింపకుండును? ఇంక చూపులలో భయము తొంగిచూపక తప్పదు. అట్టి స్థితిని భావనాశక్తిప్రధానుడగు కవి యిట్లు వర్ణించి యుండెను.

ముఱిపెమును నుజ్జగించిన ముదురునడపు
చిరునగవు నోసరించిన చిగురుమోవి
కలికి చూపులవీడ్కొన్న కన్నుగవయు
నింతి మదిభీతి వెలుపలి కెఱుకసేయ.

తత్సందర్భానుగుణముగ చక్కని సుబోధములగు కవిజన నిత్యవ్యావహారికములగు నాచ్ఛికపదముల కూర్పు నిందు మనోహరము !

ఇట్లే యుషాకన్యక విషయమునను గ్రంథము రమణీయముగా నున్నది. ప్రభావతీ ప్రద్యుమ్నమున ప్రభావతి తన తండ్రిం జంపుమని మూలనున్న కత్తి మగని కందిచ్చినట్లు యుషాకన్య మగనికి కత్తి నీయలేదు. మీదుమిక్కిలి స్త్రీస్వభావానుగుణముగా భర్తను యుద్ధప్రయాణమునుండి తప్పింపజూచినది.

ఆ తరుణి వలదు వలదని
భీతిం దనుబట్టఁబట్ట భీకరతర ని
ర్ఘాతరవ సింహనాదుం
డై తత్సౌధంబు డిగ్గెనవుడు గఱచుచున్.

ఇట్లు కవి యమర్చుట మిగుల రమణీయము. “ప్రేమ పశ్యతి భయాన్యపదేపి” యన్నట్లు భర్త కేమి ప్రమాదమగునో యని నవోఢయగుటచే భయపడి యుద్ధసన్నద్ధుడగు భర్తను వారించుట యెంతయు సహజము. ఇంతియగాక తన తండ్రి జగద్విదిత ప్రభావుడు. ఈశ్వరప్రసాదలబ్ధ వరశాలి. ముల్లోకములు జయించిన మహాబలశాలి. అట్టి స్థితిలో నీమె భయపడి వలదు వలదని దను భీతింబట్టుట యెంతయు సహజము. ఇట్టి సంవిధాన మెంతయు రమణీయము.

కాంతలను వర్ణించు సందర్భమున కవులు సహజతకు దూరమయినను కవిసంప్రదాయానుసారముగా, నభూతకల్పనములను సామాన్యముగా జేయుచుందురు. అందే చంద్రోపాలంభనము మలయమారుతాది నిందలును జేరును. “అలకామోదోపి భారాయతే” అనున దా మార్గమేగదా! సోమనాథుడు మాత్ర మట్టి లోకదూరము కల్పనలం జేయకపోవుట యాశ్చర్యమే. ఇట్లు వర్ణనములవిషయమున సోమనాథుడు తన చాతుర్యము నుపయోగించి చాల మితమొనర్చెను. ఇంకొక కవి యయినచో నుషాకన్యక సర్వాంగ వర్ణనముతో సగ మాశ్వాసము పూర్తిచేయును.

కృత్యాకృత్యములు మనసున చక్కగ హత్తుకొనునట్లు శృంగారాది రసమయ మొనర్చి యుపదేశించుట కావ్యముల యాశయము. అట్లు ప్రతివిషయమును హృదయమున హత్తుకొనిపోవునట్లు వర్ణించుటలో రసమయ మొనర్చుటయె గాక చక్కని లోకోక్తుల నీతడు సహాయము చేసికొనుచుండును. లోకోక్తులు పద్యమున చెప్పబడిన భావమును చక్కగ విశదపఱచుచు హృదయమున స్థిరపఱచుచుండును. అనంతామాత్యాదులు కొందరు లోకోక్తులు తఱచుగా వాడియున్నారు గాని యితడు వానిని అడుగడుగునను గూర్చుట విశేషము. అవియును చక్కగ నతికియుండున ట్లమర్చబడినవి.

..శిర సుండగ మోకాలికి సేసలువెట్టుట...
..చీమ చిటుకన్నను||
.వగపుతో దాగరము నెండవలసినట్లు...
.తవుడుతిని చచ్చువానికి విసము పెట్టువాడు వెఱ్ఱివాడు...
..ముంజేతికంకణమున కద్దమేటికి...
..కొఱవిందల బరికికొన్న కొఱుతులు గారే...
..మద్దులు మునింగి పారదెంపట్లు తమ కెంత బంటి యనుట...

..చల్లకువచ్చి ముంత దాచినగతి...
..పాముకాటు చీర దుడిచినం బోవునె...
..దుప్పుజూచి నక్క యొఱలు గాల్చికొన్న వసువున...
...చెరువువిడచి కాలువ పొగడంజనునే...
...గాడిదకుం బులితోలు గప్పినన్...
...నిప్పు చెదలంటునటే...
...ముల్లువుచ్చి కొఱ్ఱడచిన చందమయ్యె...
...నీళ్ళను ముంచిన పాలముంచినన్...

సీసపద్యములందు శ్రీనాథునికి సోమనాథుడు మార్గదర్శకు డనవచ్చును. ఇతని సీసములందు ప్రక్రమానుసరణము మిక్కిలి కొనియాడదగినది. సామాన్యముగా సీసపద్యములందు ప్రక్రమభంగము లేకుండ వర్ణించుట గొప్ప శోభాహేతువు

శ్రీనాథుని సీసములందు ప్రక్రమానుసరణము ఒక ముఖ్యగుణము. శ్రీనాథునిపద్యములందును ఒకటి రెండు తావుల కొద్దిపాటి ప్రక్రమభేదము గనవచ్చుచున్నది.

కట్టించె నొకతాత కంచి హార్మ్యంబులు
హరిణాంకమౌళి కేకామ్రపతికి.
బాలార్క మనియెడి పద్మరాగను దాచె
నొక తాత కంచినాయకుని నాభి

ఇందు మూడుపాదములందు కట్టించెనను క్రియ యుండి రెండవపాదమున మాత్రము లేచెనని భిన్న క్రియాప్రయోగము కొద్దిపాటి ప్రక్రమభేదముగా నున్నది. ఇట్టిపాటి క్రమ భంగముగూడ హరివంశమున సామాన్యముగా గానరాదు. ఒకేపదము నాల్గు పాదములందును (కట్టించె నొకతాత...ఇట్టి రీతిని) వచ్చునట్టి పద్యము లిందు విరళములు. సామాన్యముగా సమానరీతిగల భిన్నపదముల యుపయోగించు చుండును.

వేలుపు జకదారి విందారగించునో
నానందబాష్పంబు లడ్డపడును.

ఇట్లు ప్రథమపాదమున నడ్డపడునని క్రియ యుండ మిగిలిన మూడు పాదములందును ఓలలాడు, పరగుచుండు, దొరగుచుండు అను భిన్నక్రియలను బ్రయోగించెను. ఒకే క్రియ బ్రయోగించుట యరుదుగానున్నది. సీసపద్యమున యతిస్థానమున సంస్కృతమువందువలె పదవిచ్ఛేదము కలిగియుండుట యొక విశేషము. అట్లయినచో చదువుటకు ఒక చక్కని తీరు గలిగియుండును. ఇట్టి రహస్యమునే శ్రీనాథుడును గ్రహించెను. సీసపద్య పాదమున నారింద్ర గణములును చివర రెండు సూర్య గణములు నుండవలయును. అందు నల, నగ, సల, భ, ర, త, యనునవి యింద్రగణములు. ఇందు నల, భగణములు ఒక జాతికిని మిగిలినవి వేరొక్క జాతికిని చెందును. అనగా చతుర్మాత్రకములు పంచమాత్రకములు నను భేదము వానిలో గలదు. ఇం దేజాతికి చెందిన గణములయినను సీసపద్యమున గూర్పవచ్చును. కాని స్వేచ్ఛగా నీ రెండుజాతుల గణములను కలగాపులగము జేసి గూర్చినచో పద్యపు నడకలో కుంటుబాటు కలిగియుండును. ఈ మర్మము నిక్కవి తెలిసికొని యొక విధమగు చక్కని నడకలో పద్యముండునట్లు ఎన్నిమాత్రల గణ మెచ్చట నుండవలయునో తెలిసికొని తదనుగుణముగా పద్యమును నిర్మించుచుండును. తరచుగా నైదుమాత్రల గణముల యీలని సీసపద్యములందు కూర్పబడియుండును. ఇట్టిగుణ మీతని నుండియే శ్రీనాథుడును గ్రహించెనేమో. సీసపద్యములందు ఒక్కొక్క పద్యమున నొక్కొక్క తీరు గూర్చి అతిమనోహరముగా నితడు రచిత వడిసించెను.

ఇతడు సంస్కృతాంధ్రపదములను నిర్దుష్టముగా నుంతారీతిని ప్రయోగించును. చాలమంది కవులు ఇతరుల మాటకేమి శ్రీనాథాది మహాకవులు గూడ కొన్ని విషయములందు స్వాతంత్ర్యము నవలంబించియున్నారు. కైవార అనుపదము ఆంధ్రపదముగా భావింపబడుచున్నది. సంస్కృతభాషలో నెవ్వరు నీపదమును ప్రయోగించినట్లు కానరాదు. సంస్కృతనిఘంటువులందును ఈపదము లేదు. ఏదోయొక ధాతువు నాధారముగా చేసికొని రూపమును తయారుచేసినను అయ్యది కృతకమునక తీరదు. ఇట్టి సంస్కృతపదమును శ్రీనాథుడు సంస్కృతముని తలంచి "కైవార పదానుసారి" అని సంస్కృత సమాసమున గూర్చి ప్రయోగించినాడు. ఇయ్యది చింత్యము. ఇట్లే తంటము అను పదమును సంస్కృతమని యీతడు భావించెను. ఇట్టి పదముల సంస్కృత పదము లనుటకు సాధనములు లభించును గాని యవి సహజములు గావు. ఇట్టి స్వాతంత్ర్యము నాతడే గాక చాలమంది కవులు చూపియున్నారు. సోమనాథుడు మాత్ర మట్లుగాక సంప్రదాయమును పాటించి భాషల యందు తనకుగల కూలంకష పాండిత్యమున కనుగుణముగనే వర్తించెను. క్త్వార్థకార సంధి యీతడె హెచ్చుటచ్చుట ఉపయోగించెను.

...గజపురంబు, సొచ్చి ప్రుచ్చిమి సేయజూచిన
నెరిగప్పుడా రాజు.

ఇందు ఎరిగి + అప్పుడు అనుపదములు సంధి చేయబడినవి. ఇట్టి సంధి సంప్రదాయసిద్ధమే యని ప్రౌఢ వ్యాకరణకర్త ప్రయోగములను జూపియున్నాడు.

తిక్కనవంటి దేశీయ పదగుంభనా చాతుర్యము నన్నయవంటి ప్రసాదగుణ పరిపూర్ణ సంస్కృత పద గ్రథనము, శ్రీనాథునివంటి సీసపద్యవైచిత్రి, పోతన వంటి యంత్యప్రాసా నైపుణ్యము, నింక నెన్నియో మహాకవులయందు ప్రత్యేక గణనీయములగు సుగుణములు సోమనాథునియందు మూర్తీభవించెను.

# అమాయికత్వం

శ్రీ పన్యాల రంగనాథరావు

పంతులుకి ఆ రోజంతా కూడా దుర్దినంగానే పరిణమించింది. పొద్దున్న నిద్రలేవకముందే గురుతుగాడొచ్చాడు. వాడన్న ముక్కలేవో తుంపురుగు ముక్కలల్లే జ్ఞాపకమున్నాయి. తను పెరట్లోకి పోతూ ఉండగా, రమణయ్య నౌకరు పరుగెత్తుకుంటూ వొచ్చాడు. చంటివాడికి రాత్రి హఠాత్తుగా జబ్బు ఎక్కువయిందనీ, తన్ను వెంటనే రమ్మన్నారనీ చెప్పి వెళ్ళాడు. ఏడాదైనా నిండిందో లేదో వాడికి, నాలుగు రోజులై సరిగా ఊపిరైనా తీయలేకుండా ఉన్నా[illegible] ఏదో అర్థంకున్నట్టుగా బాధ పడతాడు. రాత్రి డాక్టరునైనా పిలిపించారో లేదో! ఆ డాక్టరు—రమాపతిగాడు—ఈ జబ్బుకేదో పెద్ద పేరుకూడా ఏడిశాడు. రోగాలకు పెద్దపెద్ద పేర్లు పెట్టడం చాతవును ఈ డాక్టర్లకు! ఇచ్చే మందుల్లో గుణం పూజ్యం! సరి, ఈ రమణయ్య నౌకరు అలా వెళ్ళాడో లేదో, తను పెరట్లో నూతి గట్టుదగ్గర జారిపడ్డాడు. కాలో చేయో విరగలేదు. అక్కడికది నయం.

వీటన్నింటికేంగానీ, ఎన్నడూ లేనిది, ఇవేళ పంతులు తలకాయలో ఆలోచనా పరంపరలు, గాజు బుడ్డీలో చేప లీత్తున్నట్టు ఈత్తున్నాయి. ఆలోచనలు చేయటమంటే పంతులుకి మండుకొస్తుంది. అందుకే ఇవేళ మరీ దుర్దినంగా కనిపిస్తున్నది. ఈ ఆలోచనలైనా ఇప్పుడే రావాలా? వేళాపాళా లేదా?

రాత్రి ఒంటిగంటప్పుడు, కటికచీకట్లో పంతులు అడుగులో అడుగు వేస్తూ నడుస్తున్నాడు. పైగా తుంపరజల్లు కూడానూ. వర్షాకాలమంతా దాటిపోయినాక, ఇక్కడ వర్షం పెళ్ళినడకతో సహా వచ్చింది. ఇదికూడా ఆ గురుతుగాడు కట్టుకున్న పుణ్యమే! వాడన్నమాట దాఖలా ఇచ్చి తీరుతుంది. ఒక్కొక్కరి నోట్లో శనిగాడు నాట్యంచేస్తూ ఉంటాడు కాబోలు, తను నిద్రలేవకముందే వచ్చి, గురుతుగాడు, "ఇవేళ వర్షం పడేట్టుంది" అన్నముక్క, తనకు జ్ఞాపకముంది. గురుతు మంచి సూక్తులెన్నడూ పలకడు, అందుకే కాబోలు దాదాపు అన్నీ దాఖలా ఇస్తాయి. తన ఎరికలో వాడన్న ఒక్క మంచి మాటా, తన గురించే!

"నీకూ, నీతోపాటు నాకూ మంచి రోజులున్నాయిలే. బెంగపెట్టుకోకు," అన్నాడు ఒకసారి. ఇటువంటి మాట వెంటనే దాఖలా ఇవ్వకూడదూ?

ఎటుచూసినా జీబురుగానే ఉంది. ఈ రొజ్జగాలికీ, చినుక్కీ, మ్యునిసిపల్ దీపాలు కాస్తా ఆరిపూరుకున్నాయి. గుడ్డివాడికీ, తనకూ ఈ క్షణంలో భేదం లేదనుకున్నాడు పంతులు. వర్షం అంత ఎక్కువగా లేదు. అయినా ఈ కాస్త చినుక్కీ చేతిలో ఉన్న గొడుగు ఆనేటు లేదు. పంతులు, రోడ్డు పక్క ఉన్న ఒక యింటి అరుగుమీద కెక్కి, కుడిచేతిలో ఉన్న చిన్న మందుసీసా ఎడమ చేతిలోకి తీసుకొని, ఎడమచేతిలో ఉన్న గొడుగు కుడి చేతికి మార్చాడు. నిజానికి, ఈ మాత్రం మార్పువల్ల పంతులు ఆలోచనలు మట్టుకు పోలేదు. రెండు నిమిషాలు అట్లానే నిలబడి, పంతులు మళ్ళీ, వర్షంలో, చీకట్లో, వీధిలో పడి నడవసాగాడు.

పంతులు కిప్పుడు ముఖ్యంగా మంచి చెడ్డల గురించి ఆలోచన పట్టుకుని పీడిస్తున్నది. తెలిసి తెలిసి, తను ఈ సంఘం జోలికి ఎన్నడూ పోలేదు. అయితే, గురుతు ఇటీవల ఆమాట పదేపదే ఉపయోగించాడు. ఇప్పుడది తనకు మరపుకి రావటం లేదు. ఆలోచించినకొద్దీ — పాడు ఆలోచన — సంఘంలో ఉన్న సత్యాన్ని తనే కనిపెట్టినట్టనిపిస్తున్నది! ఈ సంఘం, ఒక సరళరేఖనుబట్టి పోతుందనుకున్నాడు పంతులు. దానికి ఒక వైపంతా మంచీ, మరోవైపంతా చెడూ కనిపిస్తున్నది. ఈ రెండింటికీ, ఆదినుంచీ రామ రావణ యుద్ధం సాగుతున్నట్టు తడుతున్నది తనకు.

పంతులు ఒకసారి తనలో తను నవ్వుకున్నాడు, అమాయకంగా. చటుక్కున పంతులుకి, ఈ మంచి చెడ్డలన్నీ కల్పించుకున్నది మనమే అని తట్టింది. ఆ 'మనం' లో తనుకూడా ఒక పాత్రే అనిపించింది. ఈ రెండుగుణాల మధ్యా ఉన్న సరళ రేఖమీద, సంఘాన్ని రిక్షా లాగినట్టు లాగుతున్న కోట్లాది జనప్రవాహంలో, పంతులుకి తన రూపంకూడా కనిపించ సాగింది.

అయితే, ఇందులో మంచేదో చెడేదో చెప్పటంలోనే వస్తున్నది ఒకరికి మంచిగా తోచినది మరొకరికి చెడుగా తోస్తున్నది. తనకే మంచిగా తోచింది ఇతరులకు చెడు కావచ్చుకద!

పంతులు నుదుటిమీద చెమట పోసింది. తల వేడెక్కినట్టు అనిపించింది. ఈ మంచి చెడ్డల ఆలోచనకూడా తన తలలో కెక్కించింది గురుతే అని చప్పున తట్టింది.

"ఛీ...ఈ మంచి చెడ్డలంటేనే ఏమిటో అర్థం కాకుండా పోతున్నది." అనుకున్నాడు పంతులు.

గురుతుగాడి మాటనుకూడా బొత్తిగా కొట్టి పారెయ్యటానికి వీలుపడదు—వాడి నోట్లో ఎంత శనిఉన్నా! వాడుమట్టుకు ఏం చేస్తాడు? ఉన్న నిజమేదో చెప్తాడు—ఉత్త అమాయకుడు!

గురుతు తనకు చేసే సహాయమంటూ ఏదీలేదు. ఆమాట కొస్తే, రమణయ్యనే చెప్పుకోవాలి. తన కెన్నిసార్లు చేబదుళ్లివ్వలేదు రమణయ్య? తను మళ్లీ తీర్చుకోలేడని రమణయ్యకు తెలుసు. అయితే ఏమాట కామాటే. గురుతు అప్పుడప్పుడు ఒక వొడ్డు మట్టుకు కాసేస్తాడు. వెనకొకసారి, తన కూతురిమీద, ఈ డాక్టరుగాడు—ఈ రమాపతే, కన్ను వేసినప్పుడు, గురుతుగాడుండబట్టి కద గండం గడిచింది!

పంతులు పెద్ద గడసరి కాడు. అంత వంతుడూ అనలేం. అతను కేవలం మామూలు మానవ మాత్రుడు. అయితే, కేవలం మామూలు మానవ మాత్రులుకూడా, ఒక్కొక్కప్పుడు ఎన్నడూ లేని ఆలోచనలు చేస్తారు. ఎన్నడూ లేని సాహసంకూడా చూపిస్తారు.

"నువెంత అమాయకుడివి!" అన్నాడు గురుతు ఎన్నోసార్లు. బహుశా అది నిజమే కావచ్చు!

ఆమాటకొస్తే, అమాయకు లెవరు కారు? తన కూతురు! ఎంత అమాయకురాలు కాకుంటే, దాని బతుకిట్లా తెల్లవారుతుంది! గురుతుగాడు మాత్రం? ఏదో వాగుతాడు గాని, ఎంత అమాయకుడు కాకుంటే, తన దరిద్రమే ఐశ్వర్యమైనట్టు తన్నే అంటిపెట్టుకుని ఉంటాడు! పోతే రమణయ్య—వాడి భార్యా కూడా అమాయకులు కారూ? చంటివాడికి జబ్బుచేస్తే కళ్లనీళ్లు పెట్టుకోవటం లేదూ?

సాహసించి ఇంతవరకూ తను, సాహసమయిన పని ఏదీ చేయలేదు. సాహసం లేకుంటే, బతకటం కష్టమన్నాడు గురుతు, నిజమే. అందుకే, తనైతాను ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక సాహసానికి వొడిగడతాడని మాత్రం పంతులు విశ్వసించలేదు.

పంతులు తన జీవితాన్ని తరచి చూసుకోవడం ఇదే మొదటిసారి. ప్రతీ వ్యక్తీ, ఏదో ఒకరోజున, జీవితాన్ని ఈవిధంగా పునశ్చరణ చేసుకోవలసిందే. కాని, గురుతే లేకుంటే, పంతులు అసలీ ఆలోచనలకే దిగేవాడు కాడు—కనీసం ఇప్పుడు జరిగిఉండేది కాదు!

పంతులులో గొప్ప విశేషమేదీ లేదు ఇది తనకు బాగా తెలిసినదే. చాలామంది పేద కుటుంబీకుల లాగనే, తనుకూడా పేద కుటుంబీకుడే తన తండ్రి తనకు వారసత్వంగా ఇచ్చిపోయిన ప్లీడరు గుమాస్తాగిరే, నాటినుంచీ వెలిగిస్తున్నాడు పంతులు. ఆ ప్లీడరు ఎవరో కాదు. తన స్నేహితునివంటివాడు రమణయ్య! తన తండ్రి, రమణయ్య తండ్రివగ్గర గుమాస్తా చేస్తే, తను రమణయ్యదగ్గర చేస్తున్నాడు. తనూ రమణయ్యా దాదాపు ఒకే యీడువాళ్లు. చిన్న క్లాసులలో కలిసి చదువుకున్నవారు! ఆ అభిమానం ఉండబట్టికద తన్ను ఆదరించాడు రమణయ్య!

పంతులుకి దక్కిన సంతానం—ఇద్దరుకొడుకులూ నలుగురు కూతుళ్ళనూ. పెద్దవాడు తనకు మించిన ఘనుడు. వాడి కిప్పుడు ఇరవైయ్యేళ్లు వచ్చినై. చదవవేస్తే, ఉన్న మతికూడా చెడగొట్టుకున్నాడు. ఊరుమీద పడి తిరిగే ఆంబోతుకీ, వాడికీ ఆట్టే తేడాయేదీలేదు. వాడివల్ల తనకు దమ్మిడీ ప్రయోజనం లేదని ఏనాడో తెలుసుకున్నాడు పంతులు. పెద కూతురు కొస్తా—దాని కిప్పుడు పద్దెనిమిదోయేడు-ఇల్లు పట్టింది. ఇంటో ఆడదిక్కంటూ ఉందనుకో వచ్చు. కాని, పాపం, దాని కాపరం కాస్తా బుగ్గయినట్టే. దాన్ని కట్టుకున్నవాడు ఎటు పోయినాడో, అసలు ఎక్కడున్నా బతికున్నాడో లేడో, అతీగతీ లేదు. ఆ తర్వాత పంతులుకి వరసగా ముగ్గురుకూతుళ్లు

ఇద్దరు కొడుకులు. కూతుళ్లు దక్కి, కొడుకులు పోయినారు. భార్య ఒక యేడాదిపాటు మంచం కూడా పట్టింది. మళ్ళీలేచి, కాస్త తిరగ్గలుగుతున్నదనగానే పుట్టె మునిగినట్టు, నరసుగాణ్ణి కన్నది! దాన్నిమాత్రం అని ఏం లాభం? అమాయకురాలు! తనబుద్ధి గడ్డి తిన్నది. అయినకొడి కేదో అయింది. పోతే, తన ఆశలన్నీ ఆ నరసుగాడిమీదనే! వాడి కిప్పుడు అయిదోయేడు వెళ్ళి ఆరోయేడు వస్తున్నది. రమణయ్యా పెంపకంలో!

కష్టాలలోనే పుట్టి పెరిగినవాడూ, జీవిస్తున్నవాడూ గనక, పంతులు, ఈ కష్టాలను లెక్క చేయలేదు. మూడేళ్ళకిందట—నరసు రెండోయేట, తన భార్య పోయినప్పుడుకూడా పంతులు అటే విచారించలేదు. విచారించినట్టుకు చేసేదేముంది? అప్పటికింకా కూతురు ఇల్లు పట్టలేదు. అది వచ్చి రెండేళ్లయింది.

పెద్దకూతురు పెద్ద అందగత్తె కాదు. ఆడపిల్లలకు ఈడే అందం! అందుకే ఈ డాక్టరుగాడు కన్ను వేశాడు.

“దాన్ని నాకిచ్చి పెళ్ళి చేయమంటే, నువ్వు వినిపించుకున్నావా? ఇప్పు గతి పట్టేఉండేదా? నాకన్న పదహారేళ్లు చిన్నదని గోలపడ్డావు. ఇప్పుడేమయింది మరి? అన్నాడు గురుతు. తను సమాధానం ఇవ్వలేదు. ఏముంది ఇవ్వటానికి?

“ఊరికే హాస్యానికన్నాను, నాపొట్ట నేనే నింపుకోలేనివాణ్ణి, దాన్ని కట్టుకుని ఏం చేసుకోను!” అన్నాడు గురుతు.

“హాస్యాని కెందుకంటావులే! నీతోపాటే అదీ ఉండేది. మొగుడెంటూ కళ్ళకు కనపడుతూ ఉండేవాడు!” అన్నాడు తను. పంతులుకి ఇందులో తన అమాయకత్వం స్ఫురించకపోవడంలో ఆశ్చర్యం లేదు. గురుతు నవ్వి ఊరుకున్నాడు.

పంతులు జీవితంలో దరిద్రం బాగానే తాండవిస్తున్నది. కాలం సుఖంగా గడుస్తే దారిద్ర్య ప్రస్తావనే ఉండదు. పంతులుకి కాలమంతా గడ్డుగానే ఉంటున్నది. రెండో పిల్ల పెళ్లికి సిద్ధంగా ఉంది. భగవంతుడనేవాడుండి, తన కేదన్నా వరం ప్రసాదించాలనుకుంటే, ఆ వరమేదో, ఈ పిల్లకు అందం రూపంలో ఇచ్చిపోయినా అనుకున్నాడు పంతులు.

ఆరునెల్ల కిందట, గురుతు ఎవణ్ణో లాక్కొచ్చాడు. వాడు ఈ పిల్లను సినీమా తార చేస్తానని కూర్చున్నాడు. తనకే దేనికో భయం వేసి, దీన్ని పంపలేదు. గురుతు ఎంత బలవంతం చేశాడు! పంపినా బాగుండిపోనేమో! ఈ బతుకు సుఖంగా గడిచిపోయేది, పంపకపోవడంవల్ల, నాటినుంచీ దీనికి సినీమా పిచ్చి జాస్తి అయిపోయింది. ఎట్లా వెళుతుందో గాని, అది చూడని సినీమాలు లేవు. తనమాట లక్ష్యపెట్టకుండా మారింది. ఏ నిమిషాన దీన్ని ఎవడైనా ఎగరేసుకు పోతాడో అన్న భయమొకటి పీకుతున్నది పంతులుకి.

ఇక మిగతా ఇద్దరు ఆడపిల్లలూ, దినదినానికీ పెరుక్కొస్తున్నారు. ఏ పిల్లకీ చదువు సంధ్యలు అసలు లేవు. వీళ్లందరికీ మొగుళ్లెక్కడ దొరుకుతారు? పెద్దదానికయినట్టు, ఎవడో వచ్చి నట్లేట్లో ముంచేస్తే ఏందారి? గురుతుగాడికి తనమీద ఎందుకో ఇంత జాలి! అమాయకుడు! తనకున్న ఆడసంతానం చూస్తే, ఎవరికేనా సానుభూతి కలగాలి! వాడొకడుండి, వీళ్లందర్నీ వెంట తిప్పుకుంటూ ఉండడంవల్ల తనకు ఊపిరి సలుపుతున్నది. రోజూ ఈ సంతానాన్ని ఇంట్లో చూస్తూ కూర్చుంటే, ఈపాటికి, బెంగతో, తన ప్రాణాలు ఎప్పుడో ఎగిరిపోయేవి!

తన గుమస్తాగిరి ఏమంత ఎక్కువ విలవైంది కాదు. రమణయ్యా గనక సరిపోయింది. తోటివాళ్ళకన్న నాలుగు రాళ్లు ఎక్కువ ముడుతున్నా యనుకో వచ్చు. భార్య ఎప్పుడో జబ్బుపడ్డప్పుడు, చేయవలసి వచ్చిన అప్పు ఇంకా పీడిస్తున్నది. పూటకు ఆరు కడుపులు నిండాలి. ఈ రోజులలో ఇంతకన్న పెద్ద ఆర్థిక దారిద్ర్యం మరొకటి ఎక్కడుంది? రమణయ్యా, తన్ను ఒక కంట కనిపెడుతూ ఉండబట్టి, అప్పు పెరగడంలేదు. అందుకు తను రమణయ్యకు ఎంత కృతజ్ఞత చూపినా చాలదనిపిస్తుంది.

నరసుగాడు పుట్టినప్పుడు, వాడిమీద తనకు పుట్టుకొచ్చిన ఆశలు జ్ఞాపకం రాసాగాయి పంతులుకి. అయితే, నలుసంత ఉన్నాడు. వాడు పెరిగి పెద్దవాడైన దేనాడు? ఏ యమ్మేవో ప్యాసయి, పెద్ద ఉద్యోగస్థుడై, తన దరిద్రం తీర్చే దెప్పుడు? ఆశ లెలా ఉన్నా, తనుమాత్రం వాడికి దూరం కాక తప్పలేదు. ఈ దరిద్ర వాతావరణం వాడివొంట పట్టకూడదనే పంతులు, వాడికి దూరమయినాడు. సరిగ్గా తన భార్య పోయిన సమయంలో రమణయ్యా, వాడి భార్యా తన్ను ఆదుకోని, ఈ కడుగొట్టు గుడ్డుని చేరదీయక పోయిఉంటే, ఈపాటికి ఈ దరిద్రరక్తం వాడివొంట కొంత పట్టేది. గోచీ పెట్టుకుని వీధిలో నలుగురితో

పాటు గోలీకాయలాడుతూ ఉండేవాడు. పెద్దవాడు మట్టుకు ఈ యీడప్పుడు అంతకన్న ఏం చేశాడు?

రమణయ్య ఎంతైనా సంస్కారం ఉన్నవాడు. ఈ సంస్కారాన్ని పంతులు ప్రత్యక్షంగానే చూశాడు. ఎంతసంస్కారం ఉన్నవాడూ కాకుంటే, ఆగర్భశ్రీమంతుడై ఉండికూడా, తన్ను నలుగురితో పాటే సమానంగా చూసుకుంటాడు!

భార్యపోయిన కొద్దిరోజులకే పంతులు, నరసుని, రమణయ్యకు వప్పగించాడు. రమణయ్యకు పిల్లలెలా లేరో, వాడి భార్యకు, పాపం పిల్లలంటే అంత ప్రాణం. దారిద్ర్యమూ, ఐశ్వర్యమూ, సంతానమూ సమపాళ్లలో ఎందుకుండవో ఎంత ఆలోచించినా పంతులుకి తట్టలేదు. రమణయ్య భార్యవగ్గర నరసుగాడికున్న ప్రాపకంవల్ల, తల్లి పోయినప్పుడు వాడి కాభేదంకూడా తెలీలేదు. తెలిసిన కొద్దిపాటలోటూ, వారిభార్యేతీర్చింది. జ్ఞానమొస్తున్న ఆడపిల్లలు ఏడ్చారు; బెంగపెట్టుకున్నారు తల్లికోసం. కొద్దిరోజుల్లోనే అంతా మరిచిపోయి, మామూలైనారు—రమణయ్య రమణయ్య భార్య మూలంగానే! తను రమణయ్యకీ, వాడి భార్యకి ఎంతో ఋణపడి ఉన్నాడు.

అప్పట్లో నరసు పెంపకానికి కావలసిన తంతు జరగలేదు. రెండేళ్ళకిందట, తన పెద్దకూతురు ఇల్లు పట్టిన రోజులలో, ఆ తంతేదో రమణయ్యే జరిపించుకున్నాడు. శంఖంలో పోసిన తీర్థమయినాడు నరసు. ఇది తెలుచుకొని, పంతులు చాటుగా కొన్నాళ్ళు కళ్ళు తుడుచుకోకపోలేదు. కాని ఇదంతా నరుసు వృద్ధిలోకి రావడంకోసమే చేశాననీ, ముమ్ముందు, హాయిగా, ఏదో వాడి చాటున కాలం వెళ్ళబుచ్చే రోజులకోసమే చేశాననీ, గురుతన మాటలు గుర్తుకొచ్చి తృప్తిపడేవాడు.

నరసు ఏ ముహూర్తాన పెంపకానికి వెళ్లాడో గాని, ఆరు నెలలకే రమణయ్య భార్యకు వేవిళ్లు ప్రారంభమైనై! ఇట్లా జరుగుతుందని ఎవరూ అనుకోలేదు. భార్య కాపరానికొచ్చి ఇరవైయేళ్లయింది. ఇక పిల్లలు పుట్టరనుకున్నాడు రమణయ్య. తనూ అంతే అనుకున్నాడు పంతులు. ఇప్పుడు రమణయ్యకు ఏడాది చంటివాడు! దీనివల్ల నరసుగాడి బతుకు బండలవుతుందని తన మనసు కెలికినవాడు గురుతు! రమణయ్య విషయంలో తను అట్లా భావించటం మహాపాపం!

తనకున్న కష్టాలు చాలకుండా, కూతురు మరి కొన్ని మూటకట్టుకొచ్చింది! ఇది ఇల్లు పట్టినప్పుడు దానికి నాలుగో నెల. ఉన్నట్టుండి దానికి చచ్చినంతయింది. అప్పట్లో డాక్టరు రమాపతికన్నా చెప్పుకో తగ్గ డాక్టరులేడు. రమాపతిదగ్గర ఒక మంత్రసాని కూడా ఉందన్న ధైర్యంమీద, రమణయ్య సహాయంతో, దాన్ని రమాపతి 'నర్సింగ్ హోం'లో చేర్చాడు పంతులు. కడుపుపోయింది. గండం గడిచి, కూతురు బయటపడింది. కాని పీడమాత్రం పట్టుకుంది!

తన కూతురే చాలామట్టుకు తన కళ్లు కప్పిందనుకున్నాడు పంతులు. చాలా కాలం గడిచాకగాని తన కా విషయం తెలిసిరాలేదు. కన్నునొప్పో, కాలునొప్పో ఏదో ఒక వంక పెట్టి, అది నిత్యకృత్యంగా ఆస్పత్రికి పోయొస్తుండటం, మొదట్లో తన కేమీ అనుమానానికి దారితీయలేదు—గురుతు వచ్చి చెప్పేవరకూ!

ఇందులో గురుతుకున్న శ్రద్ధేమిటో పంతులెన్నడూ ఆలోచించలేదు. పంతులు ఒకటే నమ్మాడు. గురుతు ఎంతచెడ్డా, తన మంచికే ఆలోచిస్తాడు!

అమాయకత్వం కాకుంటే, అదిట్టుకేం చేస్తుంది? దాని అమాయకత్వం గ్రహించే ఈ డాక్టరు—ఈ నక్క—దాన్ని కాస్తా బుట్టలో వేసుకున్నాడు.

గురుతు ఏంచెప్పినా బాగానే ఉన్నట్టు కనిపిస్తుంది తనకు. రెండుమూడు రోజులకిందట గురుతు ఒక ముక్కన్నాడు. ఇవేళ తెల్లవారు ఝామునే వచ్చినప్పుడుకూడా, బహుశా ఆ ముక్కే అని ఉంటాడు. ఇప్పుడు తన ఆలోచనలన్నీ ఇట్లా తెల్లవారుతున్నందుకు వాడే కారణం!

“రమణయ్య కొడుక్కి చాలా జబ్బుగా ఉందిట కదూ?” అన్నాడు గురుతు.

ఏడాదైనా నిండిందో లేదో! బాలారిష్టాలు తీరేసరికి మూడు చెరువుల నీళ్లు తాగాలి—అనుకున్నాడు తను.

“నిమోనియానో, టైఫాయిడోట కదూ!” అన్నాడు గురుతు.

“నువ్వన్నదేదో అయి ఊరుకుంటుంది. అట్లాయేం అనకు. ఇంకా ఏదీ నిర్ణయం కాలేదు. డాక్టరుని మార్చమని చెప్తూనే ఉన్నాను. వాళ్ళకు రమాపతి

దేముడై కూర్చున్నాడు. పెద్దవాళ్లు, ఏంచేయను?" అన్నాడు తను. గురుతు నవ్వాడు.

"అదే నీ పొరపాటు. నీకు మంచిగా తోచింది అందరికీ మంచిగా తోస్తుం దనుకుంటావు. ఎట్లా కుదురుతుందీ? పోన్లే. ఏదొచ్చినా మనమంచికే అనుకుంటే సరి" అన్నాడు గురుతు.

పంతులుకి ఈ చివరిముక్కలో శ్లేష స్ఫురించలేదు. పంతులు మౌనంగా ఉండటం చూసి, గురుతు మళ్ళీ అందుకున్నాడు—

"రమణయ్య భార్య కడుపుతో ఉన్నప్పుడు నేనన్నాను జ్ఞాపకముందా ? ఎందుకు తొందరపడి నరసుని పెంపకాని కిచ్చావని? భగవంతు డనేవాడుంటే, నీ దరిద్రం—నీతో పాటు నాదీ చూడడూ?"

"నరసుని పెంపకానికి తీసుకున్నప్పుడు వాళ్లు మట్టుకు కలగన్నారా యేమిటి కొడుకుని కంటామని? ఇంక కాన్పు ఉండవని నమ్మబట్టేకద వాణ్ణి తీసుకున్నారు! అప్పటికప్పుడే పదిహేను ఇరవైయేళ్లయి కాపరం చేస్తున్నారాయె. అంత మరీ ఆలస్యంగా కాన్పొస్తుందని ఎవ రనుకోగలరు ? ఇంతకీ ఇప్పుడు నరసుకేమయిందినీ ? రాజాలాగ ఉంటున్నాడు అక్కడ. వాడికీ దరిద్రం తీరిపోయింది " అన్నాడు తను.

"వాళ్లు ముసలికాలానికి తీరిగ్గా కూర్చొని పిల్లల్ని కనడం ప్రారంభిస్తే మట్టుకు ఎవడికొక్కవాలిలే! సరిగ్గా నేను చెపుతున్నదీ అదే! నువ్వన్నట్టు నరసు దరిద్రం తీరింది."

"అదే కద నేను కోరేది?" అన్నాడు తను.

"అవును. కాని, నువు కోరని మరో రకం దరిద్రం వాణ్ణి పట్టుకుంటున్నది. ఆసంగతి ఎప్పుడన్నా ఆలోచించావా అంటున్నాను." అన్నాడు గురుతు చుట్ట ముట్టిస్తూ.

పంతులు కిదేమీ అర్థం కాలేదు.

"నరసు కేమయిందంటావు?" అన్నాడు తను.

"నీకు తెలీకే అడుగుతున్నావా?" అన్నాడు గురుతు.

"వాడు బంగారులాగున్నాడు. వాడంటే, రమణయ్య భార్యకెంత ఇష్టమో నీకేం తెలుసు? ఆ పుట్టిన పిల్లవాడంటే నరసు కెంత ప్రాణమో నువేం చూశావు? తమ్ముడూ, తమ్ముడూ, అంటూ, ఒక ఆటబొమ్మలా వాడు ఆడుకుంటూ ఉండడం, కూడా ముచ్చటగా ఉండదా?" అన్నాడు తను.

"ఏడిసినట్టుంది నీ ఆలోచన. వాణ్ణి ఆడించే వాడైనాడు చివరకు నీ నరసు. నరసు కాయింట్లో ఉంటున్న గౌరవమేమిటో, ఎంతో, అర్థమయిందా నీకు? ఇప్పుడన్నా కాస్త ఆలోచించు" అన్నాడు గురుతు.

తనకు తోచని విషయాలు ఈ గురుతు కెట్లా తోస్తయ్యో పంతులుకి అర్థంకాలేదు. ఈ ముక్క తనకు బొత్తిగా తట్టలేదు. గురుతు చెప్పింది నిజమే అనుకోవాలా? గురుతు ఏంచెప్పినా ఆలోచించే చెపుతాడు. ఇదివర కెన్నిసార్లిట్లా, అనేక సందర్భాలలో చెప్పలేదు? గురుతు చెప్పిన తరువాత ఆలోచిస్తే, అది నిజమే అనిపిస్తున్నది.

"ఇందులో ఆలోచించటాని కేదీ లేదులే. అంతా స్పష్టంగా తెలుస్తున్నదే. నీకు తోచకుంటే నే చెపుతా విను. కన్న కడుపు ఎట్లాగూ వేరు. నరసు గాడిమీద నీకుండే ప్రేమాభిమానాలు వాళ్ళకుంటా యనుకోవటం పొరపాటు. వాళ్ళకు సంతానం కలగకుండా ఉండిఉంటే, వేరేవిషయం. కలిగాక, ఇక నరసుగాడు ఎప్పుడా సంగతి ఆలోచించినా పరాయి వాడుగానే తోస్తాడు. తోచటంతో కాదు. పరాయి వాణ్ణిగానే చూస్తారు."

పంతులు మాట్లాడకుండా వింటున్నాడు. గురుతు మళ్ళీ ప్రారంభించాడు.

"నీకు మనుషుల నైజం తెలీదు. ఎన్నాళ్ళ నుంచో నీతో చెప్పాలనుకుంటున్నాను. సమయం వచ్చింది గనక చెప్తాను విను. అసలు ఇంతదూరం ఎవరికీ ఏదీ చెప్పను. ఎందరో తెలిసినవాళ్ళు సలహాలడుగుతూ ఉంటారు. సలహాలు మట్టుకు అంత చవకా? కాని, నువు ఏ సలహాకూడా అడగ నక్కరలేకుండానే అనేకం చెపుతూ ఉంటాను. ఎందుకూ? నువు నా వాడివిగనక. నేను చెప్పినట్టువిని, చేయమన్నది చేస్తావు గనక. నువు వెర్రి బాగులవాడివి. అందుకే నిన్ను ఒక కంట కనిపెట్టుకుని ఉంటున్నాను. ఎవరినైనా నువు ఇట్టే నమ్మేస్తావు. వాళ్లు చెప్పేది నిజమనుకుంటావు. నా మాటకూడా పూర్తిగా నమ్మమని నిన్ను బలవంతం చెయ్యను. నేను మట్టుకేం ఎక్కువా? కాని, ఒకటి ఆలోచించు మకుంటూఉండు. ఎవరు చెప్పినదాన్లో ఎంతవరకూ నిజముంది అని ఆలోచించు. నీకే తెలు

స్తుంది. నువ్వసలు ఏదీ ఆలోచించవు. ఆలోచనలకు కూడా ఇతరులమీద ఆధారపడతావు. ఈ సంగతి ఏనాడో తెలుసుకున్నాను గనుక, వెయ్యికళ్ళతో నిన్ను కనిపెడుతున్నాను. నీ బాగుకోసం ఎన్నో సలహాలిచ్చాను. ఆమాటకొస్తే, నరసుగాణ్ణి పెంపకానికి ఇవ్వాలని, దూరమాలోచించి నీకు నేను సలహా ఇవ్వలేదూ? పెంపకానికివ్వటంలో తొందర పడ్డావని తరవాత అన్నాననుకో, అంటే, ముందు వెనకలూ, మంచి చెడ్డలూ ఆలోచించేవాణ్ణి గనక, అదీ అన్నాను. ఇవ్వటమే మంచిదయిందని మళ్లీ అంటున్నాను. ఎందుకంటున్నానో తరవాత చెప్తాను."

పంతులు ఆలోచించసాగాడు. గురుతు చెప్పే ముక్కలలో నిజానికి ఒక్కపాల్లు ముక్కకూడా పంతులుకి తట్టలేదు.

గురుతు, చుట్టనుసిదులిపి, నోట్లోనమిలినపొగాకు తుంచి, ఉమ్మేసి, ఒక్క పీల్పుపీల్చి మళ్లీ ప్రారంభించాడు.

"నీకు ఆ రమణయ్య పెద్ద స్నేహితుడై కూర్చున్నాడు, వాడు నిన్నెక్కడ బుట్టలో వేస్తాడో అనే నాభయం. అట్లా జరక్కుండా ఉండాలనే, నరసుగాణ్ణి పెంపకానికి, ఆ రమణయ్యకే ఇమ్మన్నాననుకో. నువ్వేదో అనుకుంటావుగానీ, ఆ రమణయ్య ఎంత అసాధ్యుడో నాకు తెలుసు. మనుషుల గుణాల్ని నేను ఇట్టే పట్టెయ్యగలను. అది నీకింకా చాతకావడం లేదు. ఎప్పుడో నీకు నేనే నేర్పించాలిలే. అతనివన్నీ ప్లీడరు గొత్తులు. వృత్తిదోషంలే. ఇన్నాళ్లు అతనికింద ఉన్నావు—నీకు ఒక్క గుణం అబ్బలేదు. చెప్పానుకానా నువు వుత్త వెర్రివాడివని! నీ అమాయకత్వం బాగా చూశాడు. నీచేత అరవ చాకిరీ చేయించుకుంటున్నాడు. కావలసినప్పుడు కానీ డబ్బు ముష్టికింద పడేస్తే, నీ నోరు కడుతున్నది. నీదగ్గర ఎంతో మంచిగా ఉన్నట్టే కనిపిస్తాడు. ఎందుకూ? నీవల్ల పనిజరుగుతున్నది గనక, చూడూ— ఒకటి మరిచిపోకు. స్వార్థం లేకుండా ఎవడూ ఏ పనీ చేయడనుకో. నాకుమట్టుకు లేదా స్వార్థం? నీకేదో మంచి సలహాలు ఇచ్చి నిన్ను కాపాడుకొస్తూ ఉంటే, నా దినాలు కాస్త గట్టెక్కుతున్నాయి. అయితే, అంతా నాలాగ మంచితనం మూలంగా స్వార్థం గడుపుతారనుకోకు. రేపు నరసుగాడి విషయంలోనూ ఇదే జరుగుతుంది. నీకన్నా వయసులో నేను కొద్దిగా చిన్నవాణ్ణే అయినా, ప్రపంచం ఎక్కువ చూశాను. మొదట్నుంచీ సంసార తాపత్రయంలో పడ్డావు గనక, నీకా అవకాశం ఆటే లేకపోయింది."

ఈ ప్రసంగాన్ని తదేకంగా వింటున్న పంతులుకి, గురుతు పడుతున్న బాధేమిటో స్ఫురించలేదు.

ఒకటిమట్టుకు పంతులుకి తెలుసు. ఏదిలేనిదే గురుతు ఇన్నిమాటలు చెప్పడని. గురుతు బాగా ఆలోచించి చెపుతున్న మాటలలో అబద్ధమెందుకుంటుందీ? రమణయ్య, తన మంచికోసం, ఈవిసంగా ఎన్నడయినా మాట్లాడాడా? ఇప్పుడు తెలుస్తున్నది తనకు. మనిషికీ మనిషికీ ఉన్న భేదమేమిటో!

"ఇంతకీ, నేను చెప్పాలనుకున్నది ఇంకా అలానే ఉంది. ఆ రమణయ్య కొడుకుకాస్తా పెరిగి పెద్దవాడవుతే, వాడి ఆ స్తిలో నరసుకి చిల్లిగవ్వ దక్కనివ్వడు" అన్నాడు గురుతు. ఈ ముక్కతో పంతులుకి ఉన్న మతి కాస్తా పోయినట్టయింది.

"ఏమిటి నువ్వంటున్నది? రమణయ్య పెద్దమనిషి కాడా? నరసుని అన్యాయం చేస్తాడా?" అన్నాడు తను.

"ఇటువంటి పెద్దరికాలు చాలా చూశాం లెద్దూ! నేను ఇప్పటిమాట చెప్పటం లేదు. పాతికేళ్ల తరువాత ఏం జరగవచ్చునో చెపుతున్నాను. ఈ వ్యవహారం రమణయ్యదాకా రానక్కర్లేదు. వాడి కొడుకు పెద్దవాడయితే, నరసు పెంపకంబాపతు అని తెలియకుండా ఉంటుందా? నరసుని ఇంట్లోంచి వెళ్ళగొట్టడనే గ్యారంటీ ఎక్కడుంది?"

"పోనిస్తూ, ఎప్పటిమాటో ఇప్పుడెందుకూ?" అన్నాడు పంతులు కాస్త విసుగుతో.

"నాకు తెలుసు నీకిటువంటివి రుచించవని. నాకేం కాసులు రాల్తాయా యేమిటి? ఇప్పుడు ఇప్పటి మాటకూడా చెపుతాను విను. వాళ్ళకు సొంతంగా కొడుకు పుట్టాక, నరసుగాణ్ణి ఎందుకు ఆదరించాలీ? నిన్నుమట్టుకు ఎందుకు ఆదరించాలీ? నువ్వెవరు వాళ్లకి? నాకుతోచింది నేను చెప్పాను. కొంప లంటుకుంటేనేగాని, నోరు విప్పనుకద! రేపొద్దున్న, ఆ పిల్లాడి జబ్బు కాస్తా నయమయ్యాక, నీ బదులు రమణయ్య మరో గుమాస్తాని పెట్టుకున్నా నే నాశ్చర్యపడను," అన్నాడు గురుతు.

పంతులు కాస్త జలదరించాడు.

"అదెట్లా సంభవం?" అన్నాడు

సురుతు చిరునవ్వు నవ్వాడు.

"ఎందుకు కాకూడదూ? రమణయ్యకు కొడుకు పుట్టడంతో, నీ అవసరం సగానికి సగం తీరిపోలేదూ? ఉన్న లంపటాలు వొదిలించుకోడానికీ, ముమ్మందు ఎటువంటివీ లేకుండా చేసుకోడానికీ ప్రయత్నించడా? ఏమిటల్లా తెల్లపోతావు?" అన్నాడు గురుతు.

పంతులు మాట్లాడలేదు. రమణయ్యే తన్ను అప్పుడే పనిలోంచి తీసివేశాడనిపించింది. పంతులుకి ముచ్చెమటలు పటసాగినె.

"నువ్విలా ఆలోచిస్తూ, శూన్యంలోకి చూస్తూ కూర్చుంటే లాభంలేదు. నీ కన్నీ నేనే చెప్పాకు రావాలి. ఏం చెయ్యను? తీరుతుందా మరి? నువు గంగలో కొట్టుకుపోతూ ఉంటే చూస్తూ ఊరుకోవటం నా చాతకాదు." అన్నాడు గురుతు.

"ఏం చెయ్యమంటావు?" అన్నాడు తను.

"అదే చెప్పటానికి ప్రయత్నిస్తున్నాను. నేను చెప్పకుండా, చేయవలసిన మంచి పనేదో నీకే తడుతుంది చివరకి. ఈ ముక్క చెప్పు. నీ కొడుకుని ఏ ఉద్దేశంతో పెంపకానికిచ్చావు? వాడు బాగుపడాలనేనా? శ్రీమంతుల ఇంట్లో నిక్షేపంగా బతకాలనేనా? వాళ్ల తదనంతరం వాళ్లకున్నది యావత్తూ, వాడికి దక్కాలనేనా? వాడితోపాటు నువుకూడా తలెత్తుకు తిరగాలనే కద? ఈ గర్భదరిద్రంనుంచి బయట పడాలనేకద? ఇదంతా నీ మంచికే కద? ఇంతలో పుట్టెముని గేలాగ వాళ్లు ఒక పిల్లవాణ్ణి కని కూచుంటారని నువుమట్టుకు కలగన్నావా? తీరా కన్న తర్వాత చేసేదేముంటుంది? నరసుగాడిమీద ప్రేమాభిమానాలు ఏమున్నా, ఇప్పుడవి ఆ పిల్లవాడి సొత్తేకద! నరసు పెద్దవాడైనాక, ఈ సంగతులు తెలీవా? తెలిస్తే బాధపడడా? పడతాడని ముందే నీకు చెపుతున్నాను—జ్ఞాపకముంచుకో, అంతేకాదు. బతికున్నన్నాళ్లు నిన్ను అసహ్యించుకుంటాడు. నిన్ను శత్రువల్లే చూస్తాడు. ఇంకొకరి యింట్లో పనిచేసే కుర్రాడిగా తన్ను నువు అమ్మేసినట్టు భావించుకుంటాడు. నువు ఇంత దూరపాలోచన చెయ్యలేదు. నేను చేశాను, ఎందుకు? నీ మంచి ఆలోచించినవాడినై చేశాను. తప్పా?"

పంతులు మాట్లాడలేదు. సురుతు చెపుతున్న మాటలు, అతని చెవిలో గంటలు మ్రోగించటం ప్రారంభించినై.

"నాలోనూ కొంత స్వార్థముందని నీకిదివరకే చెప్పాను. ఆమాటకొస్తే స్వార్థంలేనివా డెవడూ లేడు. నువు వాణ్ణి పెంపకానికివ్వటంలోనూ, వాళ్లు పెంపకానికి తీసుకోవటంలోనూ కూడా స్వార్థమే పనిచేసింది. స్వార్థంలేనిది ప్రపంచమే లేదనుకో, ఇక నామాటా? ఏదో నీ పంచపట్టినవాణ్ని. నిన్ను కాపాడుకుంటూ, నిన్నే నమ్ముకున్నవాణ్ణి. నీకొడుకు బాగుపడితే, నీతోపాటు, నీ కూతురుతోపాటు, నీ పెద్దవాడితోపాటు, ఈ తతిమ్మా ముగ్గురు ఆడపిల్లలతోపాటు నేనూ బాగుపడ్డా నన్నమాటే. అందుకు నువు కాదంటావు గనకనా? ఈ ఆడపిల్లలకి పెళ్లిళ్లు చేయాలనేదిగులుకూడా నీకుండదు. అంతా వాడే చేసుకుపోతాడు. అయితే ఇవన్నీ గాలిమేడలయినట్టు కనిపిస్తోంది కద? కేవలం నీ అమాయకత్వంమూలంగా ఇప్పుడు—ఇంతమందిమి—కేవలం నువు కళ్ళు మూసుకోవటంమూలాన మట్టి కొట్టుకుపోవడానికి సిద్ధంగా ఉన్నాం."

పంతులు కళ్లకు ఈ ప్రపంచమంతా అయోమయంగా కనిపించసాగింది. దరిద్రం, అందులో కొడుకూ, కూతుళ్లూ తనూ తలోమార్గం పట్టి, ఇష్టమొచ్చినట్టు గంతులేస్తున్నట్టు కనిపించసాగింది.

"మాట్లాడవేం ఇంతచెప్పుకొస్తున్నా కూడానూ?" అంటూ హెచ్చరించాడు గురుతు.

"నరసుని తిరిగి మనం తెచ్చుకుంటే ఈ సమస్యలన్నీ పరిష్కారమవుతాయనేనా నువ్వనేది?" అన్నాడు తను.

గురుతు పక్కున పెద్దనవ్వు నవ్వాడు.

"నీ తెలివి పూర్తిగా తెల్లవారింది. వాణ్ణి అక్కడనుంచి తెచ్చుకొని ఏం చేద్దామనుకుంటున్నావో, నాకు బోధపడలేదు. నువు చేయవలసినపని, వాణ్ణి అక్కడ శాశ్వతంగా ఉంచటమే" అన్నాడు గురుతు.

"ఉండకేమవుతాడూ? వాళ్లు తరమకొడతారా?" అన్నాడు తను.

"ఇన్నాళ్లకి   ంలో ఒక్క తెలివైనమాట, ఆలోచించిన మాట అన్నావు. అదే పదివేలు చేస్తుంది." అన్నాడు గురుతు.

"అట్లా ఎన్నటికీ జరగదు. నరసంటే ప్రాణం పెడుతున్నది వాడి భార్య. అంతపని చేస్తుం దనుకో

వటం నీ వెర్రి. ఇవేళ మరి నాకేమీ చెప్పకు—నీ పుణ్యముంటుంది" అన్నాడు తను.

గురుతు ఆనాటికి మరేమీ చెప్పలేదు. మర్నాడు వచ్చి, మళ్ళీ ఇదే ప్రసంగం ఎత్తటానికి పూర్వం—కడచిన ఇరవై నాలుగ్గంటలలోనూ, పంతులు మనసు అనేకసార్లు భూప్రదక్షిణం చేసివచ్చింది. ఆ మనసులో, తనకు తెలీకుండానే, ఎన్నో ఆలోచనలూ, ఎన్నో భయాలూ బయల్దేరినై. ఆ మనసు, చక్కని మార్గాలలోనే కాక, సందుగొందులు దూరి, నానాకశ్మలాన్నీ కూడా మట్టి, తిరిగొచ్చింది.

గురుతు రాగానే తను—

"నిన్న నువు నా మనసుని కెలికిపోయినావు. రాత్రి నాకు నిద్రకూడా రాలేదు." అన్నాడు.

"ఇన్నాళ్ళూ నువు నిద్రపోతున్నావని వేరే చెప్పక్కర్లేదు. ప్లీడరు గుమాస్తావి అయిఉండి, తెల్లవారిలేస్తే వెయ్యికేసులు తెలుసుకుంటూ ఉండేవాడివి, నీ కీమాత్రం మెళుకువలు పట్టుపడలేదంటే నమ్మ శక్యం కాకుండా ఉంది. మరొకడెవుతే అసలు నమ్మడు. నెల్లాళ్ళకిందట, ఈ పక్కవీధిలోనే ఒక యింట్లో పదేళ్ళపిల్ల రాత్రి నూతిలో పడి చచ్చింది. జ్ఞాపకముందా?" అన్నాడు గురుతు.

"ఊఁ—" అన్నాడు తను. ఆ పిల్లా తన మూడోకూతురూ ఒకే యీడువాళ్ళు. తన కూతుళ్ళతో ఆ పిల్ల అప్పుడప్పుడు తిరుగుతూ ఉండటం జ్ఞాపకముంది పంతులుకి.

"ఆ కేసుగురించి ఆరాతీశానే!"

"ఆరా తీయటానికేముంది? ఆపిల్ల నీళ్ళకువెళ్ళి, కాలు జారి పడిందిటా—దిగుడుబావిలాంటిది కూడానూ!" అన్నాడు తను.

గురుతు నవ్వాడు.

"ఏం కాదు. అంతా కల్పన. సవితల్లి వయసులో ఉంది. తండ్రి ముసలాడు. రెండో పెళ్ళి. ఆపిల్లకు ఇంట్లో ప్రైవేటు మేస్టర్ని పెట్టి చదువు చెప్పిస్తూ ఉండేవాడు. వాడికీ ఇంటావిడకీ బేరం కుదిరింది. ఒకనాడేమో ఆపిల్ల బయటి కెక్కడికో వెళ్ళి వచ్చిందిట. పిన్నీ, మేస్టరూ గదిలో తలుపు వేసుకున్నారని కనిపెట్టేసింది. రాత్రి తండ్రితో చెప్పే ఉంటుంది. ఆముసలాడు పెళ్ళాం మక్కెలు విరగదన్నాడు. రెండురోజులకే ఆపిల, కాలుజారి నూతిలో పడిందన్నారు. ఇప్పుడా మేస్టరు ఆవిడకే చదువు చెప్తున్నాడు" అన్నాడు గురుతు.

"ఆపని ఆవిడే చేసిందంటావా?" అన్నాడు తను.

"ఆసుక్కు తెలుస్తూనే ఉందిగా! కాని ఆ ముసలాడేవో కుమ్మక్కు చేశాడు. తన పీకలమీద కొస్తుందని! దానితో అంతా అణిగిపోయింది. ఎందుకు చెప్పొచ్చానంటే, మంచీ, చెడ్డా అంటూ తిష్ఠ వేసుక్కూచుంటే, ఈ ప్రపంచంలో సాధించే దేదీలేదు. ఏది మంచిదనుకొని, ఏ మంచితనాన్ని నువు పట్టుకుని పాకులాడుతావో, అదే నీ కొంప తీస్తుంది. అంతా మంచివాళ్లనుకుంటావు. ఎందుకూ? నువు మంచివాడివి గనక. అంతా అమాయకు లనుకుంటావు, నువు అమాయకుడివి కనక. అక్కడే పప్పులో కాలు వేసేవన్నమాట. నా యేడుపేమిటంటే, నువ్వనుకుంటున్నంత మంచివాళ్లు, కనీసం నీఅంత మంచివాడు, మరొకడు లేడని!"

"నువ్వింతకీ చెప్పొచ్చే దేమిటి? నిన్నట్నుంచీ వేదాంతంతో చంపుతున్నావు!" అన్నాడు తను.

"నేను వేదాంతం చెప్పటంలేదు. ఉన్న నిజం చెపుతున్నాను. మన యిద్దరికీ సంబంధించిన వ్యవహారంలో ఒక పని నాకు మంచిగా తోస్తుంది. అంటే, నా మేలుకోసం, నా బతుకుకోసం, నా సుఖంకోసం అది నాకు చాలా మంచిపని. కాని, అది నీకు సరిపడదు. ఎంచేతా? దానివల్ల నీకు కొంత నష్టం ఉండొచ్చు గనక. ప్రపంచంలో కేవలం మంచిగానీ, కేవలం చెడుగానీ లేదు. రెండూ సమపాళంలోనే ఉన్నాయి. ఉండక తీరదు. ఒకదాని కొకటి తోడునీడలు. లాభనష్టాలూ అంతే. ఎంత లాభాని కంత నష్టం. ఎంతచెట్టు కంతగాలి అన్నట్టు. పాముంది. అది నిను చూడగానే కాటేసుంది. దాని ప్రాణం నువెక్కడ తీస్తావో అని దాని భయం. నిన్ను అదెక్కడ కాటువేస్తుందో అన్న భయంవల్ల, నువు దాన్ని హతమారుస్తావు. అక్కడే వుంది అసలీ సృష్టి వైచిత్ర్యం యావత్తూనూ." అన్నాడు గురుతు.

"నాకు పాఠం చెప్తున్నావా యేమిటి నువు?" అన్నాడు చిరాకుతో.

"అవసరమొచ్చినపుడు అదీ చేయాలి మరి! తప్పుతుందా? ఇప్పుడొక పాము నిన్ను కాటెయ్యటానికి సిద్ధంగా ఉంది. దాన్ని హతమార్చేపని నీ

చేతిలో ఉందంటావా, లేదంటావా? నే నన్నింటికీ తెగించినవాణ్ణి, నీకు కోపమొచ్చి నా ముఖంమీద ఉమ్మేసినా ఉమ్మెయి. కాదనను. కాని నువు పిలలుగలవాడివి. నీ కూతుళ్ళ పెళ్ళిళ్ళు నరసుమీద ఆధారపడిఉన్నాయి." అన్నాడు గురుతు.

పంతులు ఉమ్మెయ్యలేదు. చలించలేదు. మాటాడనేలేదు.

"అన్నట్టు — డాక్టరు రమాపతిదగ్గర్నుంచి నువ్వే మందు తెచ్చి పెడుతున్నట్టున్నావు!" అన్నాడు గురుతు చప్పున జ్ఞాపకం వచ్చినట్టు.

పంతులు సమాధాన మివ్వలేదు. కొయ్యమాదిరిగా, తదేకంగా గోడవేపు చూస్తూ కూర్చుని పోయినాడు. పంతులుకి మతి పూర్తిగా చలించిఉండాలి.

*   *   *

మంచంమీద ఏడాది పసికందు శరీరం జ్వరంతో కాగిపోతున్నప్పుడూ, రమణయ్య భార్య ముఖంలో దిగులు చూసినా, పంతులు ఆలోచనలు తగ్గలేదు. నరసు, ఆవిడను సమీపించి, 'అమ్మా! తమ్ముడికి జ్వరంపోతే, వాడికోసం చిన్న తోపుడుబండీ కొనవుటే?' అంటున్న మాటలు పంతులుకి వినపడలేదు.

"వాడికీ వేళంతా జ్వరం తగ్గలేదోయ్! డాక్టరొస్తానన్నాడులే అవసరముంటే. నిమోనియా అని అనుమానిస్తున్నాడు. ఎందుకేనా మంచిది—ఒకసారి వెళ్ళొస్తావేమిటి?" అన్నాడు రమణయ్య పంతుల్ని సమీపించి.

"ఆఁ—ఎందుకూ? ... డాక్టరా?" అన్నాడు పంతులు.

"ఏమిటో పరధ్యానంగా ఉన్నావు, నాకులేని బెంగ నీకు పట్టిందా యేమిటి? అన్నాడు రమణయ్య పంతులు భుజం తట్టి.

"అబ్బే — ఏం లేదు. వెళ్తాను ...ఎన్నటికీ కాదు." అన్నాడు పంతులు ఇంకా పరధ్యానంగానే.

"ఏమిటి ఎన్నటికీ కాదు?" అన్నాడు రమణయ్య, ఏదీ అర్థంకాక. పంతులు ఇప్పటికి తేరుకున్నాడు.

"ఏంలేదులే. నాకు నరసొకటీ వాడొకటీనా— ఎన్నటికీ కాదంటున్నాను. సీసాపడెయ్యి, పోతాను"

"రేపొద్దున్న వెడుదూగాని లెద్దూ. ఈ నిశిరాత్రప్పుడేం వెళతావు. పైగా వర్షం కూడానూ. పిల్లాడి కిప్పుడే నిద్ర పట్టినట్టుందిలే." అన్నాడు రమణయ్య.

"ఏం భయంలేదు. ఒకసారి డాక్టరుతో చెపితే ఎందుకేనా మంచిది. మందు మారుస్తాడేమో. గొడుగుంటే ఇవ్వు" అంటూ లేచాడు పంతులు.

రాత్రి ఒంటిగంటప్పుడు, చేత గొడుగూ, మందు సీసా పట్టుకొని, ఆవర్షంలో నే బయల్దేరాడు పంతులు, రమాపతిదగ్గరకి.

*   *   *

నాకేమిటో అర్థం కాకుండా ఉంది. ఏదీ అర్థం కాలేదు. నాకు నేనే అర్థంకాను......!" అనుకోసాగాడు పంతులు. ముసురుపోయి పెద్దచినుకులు పడుతున్నాయి. గొడుగుమీద చినుకులశబ్దం ఎక్కువయింది.

తొలిరోజున గురుతు చెప్పింది యథార్థమే అవుతుందా? ఏమో! ఎవడు చూశాడు! ఎవడికి తెలుస్తుంది మనసు లెట్లా మారతాయో! గురుతు ఎంతకేనా తెలివైనవాడు. వాడిపాటి ఆలోచనాశక్తి తనకు లేదు. తీరా వాడు చెప్పాక ఆలోచించటం ప్రారంభిస్తే, అంతా నిజంలాగనే తోస్తున్నది—పాడు!

నిజమే—ఎవడిసుఖం వాడు చూసుకోవాలి మరి. తన సుఖంకోసం, నరసుకోసం, వాడికోసం తను చేసేపని తనకు మంచిగాతోస్తే, ఇతరులకది చెడుకావచ్చు. అవుతే నేం? ఇతరులూ అదే చేస్తున్నారు గురుతు చెప్పినట్టు! ఈ సంఘంలో అందరూ అదే సూత్రం అనుసరిస్తున్నారు. ఎంతెంత మంది ఎన్నెన్ని పనులు చేయటంలేదు? ఏదో ఒకటి చేయాలి. చేస్తేనే నోటికి ముద్ద, ఎవడేంచేసినా చివరి లక్ష్యం ఒకటే—తిండికోసం! ఏదీ చేయని వాడినే దరిద్రం వరిస్తుంది. ఏదో చెయ్యాలి. ఎందుకు చెయ్యకూడదూ? నరసుకోసం, వాడి సుఖంకోసం చేయాలి. ఇంతలో పోయిందేముంది?

పంతులుకి వెర్రెత్తినట్టయింది. తల చిటపటలాడడం ప్రారంభించింది.

ఆ గొడవలో రమాపతి ఏదో ప్రశ్నించాడు. చిరాకుపడ్డాడు. ఇంత వర్షంలో అర్థరాత్రి రాకుంటే ఏం మునిగింది? అన్నాడు. పంతులు సమాధానాలు

ఇవ్వలేదు. పిల్లవాడు నిద్రపోతే లేపవద్దనీ, నిద్రలేస్తే ఇవ్వమనీ ఏదో మందిచ్చాడు. పంతులు అది పుచ్చుకొని బయటపడ్డాడు.

రొజ్జగాలి రివ్వుమంటున్నది. పంతులు నుదుటిమీద చెమట బొట్లు కట్టడం ప్రారంభించింది. వర్షం ఎక్కువయింది. పంతులు ఇప్పుడు ఆలోచనలు చేయటంలేదు. అతని తల ఖాళీగాఉన్నట్టు తోచింది. గుండె తీవ్రంగా కొట్టుకుంటున్నది. పంతులు ఒక అరుగెక్కి కాసేపు నిలబడ్డాడు. గొడుగు ఝాడించాడు. వర్షం తగ్గినట్టయింది. మళ్ళీ ఆ చీకట్లో పడ్డాడు. గబగబా నడవడం ప్రారంభించాడు. ఆ చీకట్లోనే మెట్లు అడ్డొచ్చాయి. కాసేపు ఆగాడు పంతులు. మెట్లెక్కాడు. వెంటనే దిగిపోయాడు. తల వేడెక్కిపోయింది. మళ్ళీ మెట్లెక్కాడు, తలుపు కొట్టాడు.

గురుతు వచ్చి తలుపు తీశాడు!

* * * *

తలుపు తీసిన రమణయ్య తడిసి ముద్దకట్టిన పంతులునిచూసి కంగారు పడ్డాడు.

"పద పద. నీకొక్కస్తా ఏ జ్వరమో వచ్చేట్టుంది చూస్తే, ఆ బట్టలు మార్చు ముందు. ఇంద నా పంచె. నేరక పంపాను నిన్ను" అంటూ, రమణయ్య, పంతుల్ని లోనికి తీసుకుపోయినాడు. పంతులు వొణుకుతున్నాడు.

"రమాపతి తెల్లారేసరికి వస్తానన్నాడు. పిల్లవాడు నిద్రలేస్తే ఈ మందు ఒక మోతాదు పట్టమన్నాడు" అన్నాడు పంతులు. మందు సీసా ఇస్తున్నప్పుడు అతని చేతులు వణికినై. ఆ కంగారులో సీసా కింద పడబోయింది.

"నువు వణకిపోతున్నావు. కాస్తలో అది జారిపడేది. బట్టలు మార్చుకో" అన్నాడు రమణయ్య.

"ఫరవాలేదులెద్దూ! నేను ఇంటికి పోతాను. తెల్లారేసరికి వస్తానులే" అన్నాడు పంతులు.

"ఇప్పుడింటికేం పోతావు?"

"ఆడపిల్ల లొక్కళ్ళే ఉన్నారు. పెద్దవాడు రాత్రి ఇంటికొచ్చాడో లేదో. పోతాను" అంటూ పంతులు గుమ్మం దిగాడు. అతనికి ముచ్చెమటలు పోస్తున్నై—ఒకవైపు వొణికిపోతున్నప్పటికీ, తను చేస్తున్న దేమిటో తనకే తెలీదనిపిస్తున్నది.

పంతులు ఇంటికి పోలేదు. ఆజడివానలో తడుస్తూనే, చీకట్లో, గోడపక్కనే, కటికబురదలో చతికిలపడ్డాడు, అతని కాళ్లలో శక్తి పోయిందనిపించింది. అంతా నిశ్శబ్దంగా ఉన్నట్టున్నది. జడివాన శబ్దంకూడా పంతులుకి వినపడటం లేదు.

ఎక్కడో గంటలు మ్రోగినై. పంతులు గుండెలలో గంటలు మ్రోగినై. నాలుగు గంటలు వినపడ్డాయి. పంతులు గుండెలో వేయిగంటలు వినపడ్డాయి. మరి గంటల మ్రోతలేదు. పంతులు గుండె కూడా గంటలు కొట్టలేదు. గుండెమీద చేయివేసి చూసుకున్నాడు పంతులు. దడదడమంటున్నది గుండె; పిరికిగుండె!

పిల్లవాడు లేచిఉంటాడు. మందు కొస్తా పడుతుంది—రమణయ్య భార్య! అమాయకురాలు! వెంటనే పోయి, ఆ మందు పట్టవద్దని వారిస్తే? ఎట్లా?

పిల్లవాడు లేచినట్టయింది. పంతులులేచి నిలబడ్డాడు, ఒకసారి గుమ్మమెక్కాడు. మళ్ళీ దిగిపోయినాడు.

పంతులు కెక్కడో ఒక కేక వినపడ్డది. ఉలిక్కిపడ్డాడు.

గదిలోంచి మరో కేక వినపడ్డది.

రమణయ్య భార్య!

నరసు లేచినట్టయింది. వారి ఏడుపు వినపడుతున్నది. రమణయ్య ఏమయినాడో!

పంతులు ఒక్క పెట్టున—నిలుచున్న పాటున పరుగెత్తాడు.

"నరసు! నరసు! నరసు కింక దిగులులేదు, వాడు బతికిపోతాడు!" అన్నమాటలు మట్టుకు పంతులు చెవిలో ప్రతిధ్వనించినై.

పంతులు ఎక్కడికి పరుగెత్తుతున్నదీ, ఆ చీకట్లో, వర్షంలో ఎటుపోతున్నదీ, అతనికే తెలీదు.

# కోదండరామకవి

## శ్రీ కోట లక్ష్మీనారాయణ

నేను లోగడ కందుకూరి వీరేశలింగముగారి కవి జీవితములు మూడు సంపుటములును జదువు సందర్భమున మూడవదానిలో "కోటకలపూడి వేంకటకృష్ణసోమయాజి—ఈ కోదండరామకవి" అను శీర్షికలోని విషయమును జూచి విచారపడితిని. పూర్వకవులు వ్రాసిన గ్రంథములతో సరితూగగల గ్రంథ సముదాయమును వ్రాసిన కోదండరామకవి జీవితము సమగ్రముగా నందు లేకుండుట విచారకరము. "పంచ పంచాశద్యుత్ప్రబంధ కర్త" యని కవియే వ్రాసికొని యుండెను.

ఇక్కవికుంజరుని గ్రంథములను జాలవరకు మదరాసు ఓరియంటల్ పుస్తక భాండాగారము వారికి నేను కవి పౌత్రునిచే మాతృకల నిప్పించుటలో శ్రమపడి ప్రోత్సహించి కృతార్థుడనైతిని.

పూర్వము నుండియు కోదండరామకవి వంశజులు బొబ్బిలి పురాధీశ్వరుల యాంధ్రాభిమానములకు పాత్రులై బహుళ గ్రంథకర్తలై శాశ్వతకీర్తి నార్జించిరి.

గోదావరి కృష్ణ జిల్లాలలో నెచటనుండియో కృష్ణపండితుడు బొబ్బిలి వచ్చెను. బొబ్బిలీశ్వరులపు డాతని నాదరించి స్థిర జీవనోపాధులు గల్పించిరి. నాటనుండి వారి వంశావళి వివరముగా దెలియును. ఈ విషయము కోదండరామకవి ఆంధ్రీకృత నృసింహ పురాణమున విపులీకరింపబడినది.

ఇతని తండ్రి వేంకటకృష్ణ సోమయాజి. బొబ్బిలి ప్రభువగు శ్రీ రావు రాయడప్ప రంగారాయల పురోహితుడును ఆస్థానకవియునై దిలీప చరిత్రాద్యష్టాదశ ప్రబంధకర్తయై వన్నెకెక్కెను

మా తండ్రిగారు తఱుచుగాఁ గోదండరామ కవితో నిష్ఠాగోష్ఠిఁ గాలము బుచ్చు సందర్భమునఁ గవిగారినోట నాలించిన విషయములును—కవిగారి మనుమడు చినకోదండరామయ్య యిచ్చిన విషయములును ఈ వ్యాసమునకు మూలాధారములు.

ఈ సోమయాజికిఁ బ్రథమ కళత్రమునందు అయిదుగురు కుమారులును ఒక కూతురును జన్మించిరి. ఈయన బొబ్బిలిప్రాంతమున గల కుసుమూరాగ్రహారస్థుడును వేదవిదుడు నగు గన్నవరపు వేంకటావధాని కుమార్తె వేంకమాంబను బెండ్లియాడి జన్నమొనరించి సోమయాజి యయ్యెను. ఆమె మొదటి కొడుకు బాల్యముననె మరణించెను. రెండవవాడు కోదండరామకవి.

ప్రథమ కుమార వియోగానలతప్తయగు వేంకమాంబ కోదండరామతీర్థులను నొక స్వాములవారి నాహ్వానించి భిక్షయిడి వారి యాశీర్వాదమున మరుచటియేట నొక కుమారునిగని యా స్వాములవారి జ్ఞాపకార్థము ఆ బాలునికి కోదండరాము డని నామకరణము జేసెను.

కోదండరామకవి తే 28.8.1807 దికి సరియగు ప్రభవ సంవత్సర శ్రావణ బహుళ యేకాదశినాడు జన్మించెను. పునర్వసు నక్షత్ర చతుర్థపాదము. జన్మకాల గురుమహాదశాశేష సంవత్సరములు మూడు—ఆతని జాతకచక్ర మీ క్రిందివిధముగ నుండెను.




ఇతనికి అయిదవయేట నక్షరాభ్యాసమును ఏడవయేట నుపనయనమును శాస్త్రోక్తముగ జేయబడెను. సంస్కృతాంధ్ర నిఘంటువులను మనోగణితములోని క్లిష్టసమస్యలను అనతికాలమున నేర్చెను. పండ్రెండవ

యేటనుండియు నుభయభాషా కావ్య పరిశ్రమచేసి యసమానపాండితీ మహిమాన్వితు డయ్యెను.

తన జనకుని శిష్యులు గణితశాస్త్ర మభ్యసించు సమయమున నితడు వారికి రహస్యముగ నాయా ప్రత్యుత్తరములను నోట జెప్పెడివాడు.

ఒకనాటిరాత్రి స్వప్నమున నతనికి సరస్వతి సాక్షాత్కరించి రెండు మిఠాయి యుండలు దెచ్చి యాతనినోట వేసినట్లు గానబడెను. నాటినుండి యాతడు ఛందోగ్రంథములను దిరుగవేసి తొలుత భారతీశతకమును రచించెను. పూర్వకవుల ప్రబంధ రాజములలోని విశేషములనుగూర్చి తండ్రితోడను ఆయన శిష్యులతోడను జర్చింప నారంభించెను. యువకుడగుటచే శృంగార రసభూయిష్ఠ గ్రంథములను స్నేహితులకు వినిపించి వివరింపదొడగెను.

తనవీధిలోని యొక వటుడును ఒక బాలవితంతువును అన్యోన్య ప్రేమాస్పదులగుట ఇతడు గ్రహించి "ద్విజ్ఞద్విరేఫ చరిత్ర" యను మూడాశ్వాసముల ప్రబంధమును వ్రాసెను. అయ్యది కూచిమంచి జగ్గకవి వ్రాసిన చంద్రరేఖా విలాపమువలె ఆమూలాగ్రము హాస్యరసభూయిష్ఠమై యందఱను విరగబడి నవ్వునట్లు చేయుచుండెనట.

కోదండరామకవి తన మేనమామలపై పరియాచకమునకు చెప్పిన చాటువులు.

మారీచ తత్తనూ భవ
మైరావణ పంక్తికంఠ మాలిసుమాలుల్
తారక కుంభి నికుంభులు
ధారుణి నవధాని పుత్రతతియై వెలసెన్"

"జ్వాలాభీల కరాళ
వ్యాలంబగు శరము దశరథాత్మజుఁ డేయం
గా లంక దూసి చని యా
కోలందెగిపడ్డ ముక్క కుసుమూరాయెన్.

బ్రాహ్మణుడు వేదవిదుడునైన రావణుడు క్రూర కర్ముడు. అట్లే వేదవిదులైన తన మేనమామ కుమారులు లంకతో బోల్పదగు కుసుమూరున గలరని ధ్వని.

బొబ్బిలికి సమీపమున గల రామభద్ర పురాగ్రహార నివాసియు జ్యోతిశ్శాస్త్రవేత్తయునగు చావలి గున్నయ్యగారు కోదండరామకవికి జ్యోతిషము నేర్పెను. గురువుతో జర్చించి నూతన విషయములను శిష్యుడు చెప్పుటచే నత డిక ఒజ్జగా నుండ నొల్లక వదలెను.

అవ్వల గోదండరామకవి విశేషవిషయములను జూపుచు నార్యభటతంత్ర వ్యాఖ్యానమును, నక్షత్రచింతామణియు, కల్పలతయు, జ్యోతిషగ్రంథములు రచించెను. బాలబోధిని—జాతక చంద్రికయను నవి వ్రాసి తన శిష్యులకు బోధించెను ఆర్యభట సిద్ధాంతములో లేని నూతన విషయములను గ్రోడీకరించి ఆనందపాద మను గ్రంథమునుగూడ వ్రాసెను.

కీ॥ శే॥ బొబ్బిలి మహారాజావారిని దత్తస్వీకారము చేసికొనుటలో గోదండరామకవి వేంకటగిరిరాజ కుమారుల జాతకములన్నియు బరిశీలించి యాతనినే దత్తపుత్రునిగ స్థిరపరిచి రాణి మన్ననల నందెను. ఆ రాజన్యులే బొబ్బిలి కీర్తి నినుమడింపజేసిరి. వారి వివాహసమయమునకు క్రొత్త రాజభవన నిర్మాణమును వాస్తుశాస్త్రరీత్యా జ్యోతిష శాస్త్రరీత్యా కోదండరామకవి బాధ్యతవహించి పూర్తి జేయించెను.

## ప్రపదన పారిజాతగాథ

దక్షిణదేశమునుండి యొక వైష్ణవ పండితుండు బొబ్బిలివచ్చి రాజదర్శనముచేసి వైష్ణవ మతగ్రంథము ప్రపన్నామృతమును జదివి బోధింపగోరెను. వారంగీకరించిరి. వైష్ణవేతరు లాలింపగూడదని యా పండితుడనుటచే గోదండరామునకు వీలు చిక్కలేదు. నౌకరుల సానుభూతిచే నతడును నతని సోదరుడగు యజ్ఞేశమును యజ్ఞేశముగారి కుమారుడగు సోమయాజియు మార్గాంతరమున సౌధమునకుబోయి మరొక గదిలో గూరుచుండి నిత్య మా వైష్ణవుడు చదువు శ్లోకములను వీరు ఏకసంథా ద్విసంథా త్రిసంథా గ్రాహులగుటచే గ్రహించి వ్రాసి యొసంగగా నత డేనాటిశ్లోకముల కానాటి రాత్రి ఆంధ్రీకృత పద్యములను సిద్ధపఱుచుచు క్రమముగ గ్రంథమును బూర్తిచేసి "ప్రపదన పారిజాతము"అని నామకరణము జేసి సిద్ధపఱిచెను. ఒకనా డా వైష్ణవ పండితుని సన్మానింప రాజు నిర్ణయించుతఱి నా కోదండరామకవి తన వ్రాసిన గ్రంథ మా పండితసముఖమున జదువుటకు అనుమతింప గోరెను. వారు వల్లె యనిరి. అతడు చదివెను. ఆ పండితు డాశ్చర్యచకితుడై కవికి సాష్టాంగదండ ప్రణామము లాచరించి తన కీయబోవు పారితోషి

కాదులను గవి కొసంగ కోని ప్రార్థించెను. కవి లౌకిక వ్యవహర్త కావున నా పండితుని ప్రస్తుతించి రాజు నుచితరీతుల ప్రోత్సహించి గౌరవాదుల జేయిం పించెను. ప్రపదన పారిజాతము కీ॥ శే॥ బొబ్బిలి మహా రాజావారిచే ముద్రింపబడెను.

కోదండరామకవి మనుస్మృతిగూడ నాంధ్రీక రించెను. అప్పటి రాజకీయము లేవో వ్యత్యస్తము లగుటచే బొబ్బిలి ప్రభువులకు అంకితమైయుండియూ కృతిప్రదానమహోత్సవము జరుగలేదు. గోదండ రామ కవి నిర్యాణానంతర మాతని దౌహిత్రుడు కీ॥ శే॥ నవుడూరి జగన్నాథశాస్త్రి రాజ వంశానువర్ణనలు తీసివేసి యుంగరాపె జమీందారుల వంశక్రమానువర్ణనము చేసి వారికి గృతియొసంగి రనియు ప్రతీతి కలదు. కోదండరామ కవి తాను దౌలుత వ్రాసిన పద్యము లీ క్రింద బొందుపరుచు చున్నాను.

సీ॥ ఆంధ్రగీర్వాణ వాక్ప్రపంచిత పంచ
    పంచాశ దుద్యత్ప్రబంధకర్త
నిగమాంతకథిత నిర్ణిద్రాఖిలమతస్థి
    తార్యసిద్ధాంత రహస్యవేది
స్కంధత్రియ సహేతుక జ్యోతిష జ్ఞాన
    దీపిత విద్వజ్జనోపదేష్ట
సాంఖ్యాయన ప్రాప్త శౌరిదయాలబ్ధ
    మానితాతీంద్రియ జ్ఞానశాలి.

గీ॥ కలిత కొటికలపూడి సత్కులసముద్భ
వుండు కోదండరామాఖ్య పండితుండు
తగ మనుస్మృతిఁ దెనిఁగింపఁదలఁచెనిపుడు
కమలభవురాణి నీదయ కలుగుకతన.

క॥ శ్రీ చతురానన నిర్మిత
    భూచక్రప్రథిత నృపతిపుంగవ! శ్రీ వి
ద్యాచతురా! వేంకట శ్వే
    తాచలపతి రంగరాణ్మహారాజవరా!

శా॥ స్వస్తిశ్రీలగుమాస్తనస్తబక సం
    స్థన్యస్తకస్తూరికా
గ్రస్తోరస్థల నిస్తుల స్తిమిత సం
    జాగ్రత్ స్ఫురత్కౌస్తుభ
శ్శ్రీ స్తుత్యవిభా స్థిరాస్తరణ హా
    స్తన్యస్త శస్త్రాస్త్ర సం
గ్రస్తత్రస్త నిరస్తవైరికిని రం
    గారాయ రాణ్మౌళికిన్.

ఉ॥ మంగళ మర్కవంశ్యునకు
    మంగళమబ్జభవాండకర్తకున్
మంగళమార్యసేవ్యునకు
    మంగళముజ్జ్వలచాపపాణికిన్
మంగళమీశ్వరేశునకు
    మంగళమంగజతుల్యమూర్తికిన్
మంగళమాది దేవునకు
    మానితకీర్తికి రామమూర్తికిన్.

దండరామకవి రాజసన్మానమందు కొన నువ్వీళులూరుచున్న సమయమందే అనగా 1883 వ సం॥రము (స్వభాను సం॥ర మాఘశుద్ధ పౌర్ణమినాడప రాహ్ణమున) పరమపదించెను. కీ॥ శే॥ నవుడూరి జగన్నాథశాస్త్రి శ్రీ వేంకటేశ్వర విలాసము గజేంద్రమోక్షము మున్నగు ప్రబంధములు రచించెను. శతకములుగూడ వ్రాసెను. శ్రీ కురుపాము జమీం దారువారి సతీమణి జీవితమును (లలితాదేవియని ప్రతీతి) ఆమె నిర్యాణానంతరము ప్రబంధరూపమున వ్రాసి రాజాదరణను బొందెను. ఈతని కవిత్వమున కును కోదండరామకవి కవిత్వమునకును గల శైలి భేదము మనుస్మృతి కృతిపతి ప్రశంస సందర్భమున దెలియదగును.

## కోదండరామకవి శిష్యులు *

1. కొటికలపూడి రామదాసు. ఏకసంథా గ్రాహి.

2. కస్నెపల్లి వలమయ్యశాస్త్రి.

3. ఉప్పా నాగేశ్వరశాస్త్రి—ఉప్ప ఏలూరు సమీపమునగల చోదిమెళ్ళ గ్రామవాసి.

---

* ఆంధ్రభాషా వ్యాసంగమునకై యాతనికడ విద్య నేర్చినవారి నిట చేర్కొనలేదు.

4. రాయప్రోలు సుబ్రహ్మణ్య సిద్ధాంతి.— చిత్తూరు నివాసి. రెండేండ్లు కవియింట భుజించుచు బ్రతునివలెనుండి కేవల సూర్యసిద్ధాంతము నే యభ్య సించిన బుద్ధిశాలి.

5. పిడపర్తి చినపూర్ణయ్య సిద్ధాంతి.

6. ఈ దక్షిణామూర్తి సిద్ధాంతి.

7. ఈ విశ్వేశ్వర సోమయాజి.

8. కల్లూరి వీరయ్య సిద్ధాంతి.

9. కొటికలపూడి యజ్ఞేశముగారి నృసింహ సిద్ధాంతి—ఈయన కోదండరామకవి యనంతరము బొబ్బిలి సంస్థాన జ్యోతిష శాస్త్రవేత్తగ నుండిరి. ఈయన భారత యుద్ధకాల నిర్ణయము—శ్రీరామ జననకాల నిర్ణయము—ముహూర్త నారసింహము—మొ॥ వ్యాసములు రచించెను. భారతి సంచికలలో ప్రచురితము లయ్యెను. బొబ్బిలి రాజేంద్రులలో ఏ రాజాస్థానమున తన వంశస్థు లెవ్వరెవ్వరుండిరో పేర్కొనుచు వారివారి గ్రంథరచనల నుదాహరించుచు నొక వ్యాసము వ్రాసిరి. అది ముద్రితము గాలేదు.

10. కొటికలపూడి అగ్నిహోత్రుడుగారి నృసింహ సిద్ధాంతి.

11. లక్ష్మీపతి సోమయాజులు సిద్ధాంతి.

వేదపీఠమని ప్రసిద్ధికెక్కిన బులుసు పాపయ్య శాస్త్రిగారు బొబ్బిలి వచ్చునపుడు కోదండరామకవి యింట నతిధిగనుండి వాఙ్మయగోష్ఠి జరిపి కవిని విను తించుట కలదు.

పునహానగరమున జ్యోతిషము నేర్చివచ్చిన నృసింహచయనులుగారు కోదండరామకవి శిష్యుడై నూతన విషయములను నేర్చెను.

## కోదండరామ కవికృతాంధ్ర గ్రంథములు

1. భారతీ శతకము.
2. శ్రీ సతీ శతకము.
3. సర్వమంగళా శతకము.
4. రామశతకము. (రామా! దేవచూడామణీ! మకుటము)
5. మారుతీ శతకము. (ముద్రితము)
6. శ్రీ వేణుగోపాల శతకము.
7. రామప్రభూ! శతకము.
8. మాధవా! శతకము.
9. రామా! రాజవతంస! శతకము.
10. గణపతి శతకము.
11. రామనామామృతము.
12. ప్రపదన పారిజాతము.
13. రంగనాయక శతకము. (వర్షాభాసచే క్షామ బాధ జనించినపుడు వ్రాయబడియెనట)
14. మనుస్మృతి. (ఆంధ్రీకరణము.)
15. నృసింహ పురాణము. (ఆంధ్రీకరణము)
16. తారకబ్రహ్మ మాహాత్మ్యము.
17. ప్రయాగ మాహాత్మ్యము.
18. జానకీరామ సహస్రము—పండ్రెండు వందల సీసపద్యములతో సర్వమతసార సంగ్రహము గలిగి అద్వైత మతస్థాపనతో నొప్పారును.
19. ద్విపల్లీ ద్విరేఫచరిత్ర—ఇయ్యది వ్రాసిన కొలది దినములలో నే కవి తన జనకుని ఆజ్ఞప్రకారము గోమాత కాహారముగ నా తాళపత్రములు బెట్టెనట.

## సంస్కృత గ్రంథములు

20. కల్పలత, జ్యోతిషము.
21. ఆర్యభటతంత్ర వ్యాఖ్యానము.
22. నక్షత్ర చింతామణి జ్యోతిషము.
23. రామ స్తవము.
24. శివ స్తవము.
25. సూర్య స్తవము.
26. జాతక చంద్రిక (పరాశర మహర్షికృత మింకొకటి గలదు)
27. బాలబోధిని. జ్యోతిషము.
28. ఆర్యభట సిద్ధాంతమునకు వ్యాఖ్యానము (తెలుగు)
29. ఆర్యభట సిద్ధాంతములో లేని నూతనాంశములను గ్రోడీకరించి వ్రాసిన "ఆనందపాదము" అను నాలవపాదము.
30. సరస్వతీ వ్రతకల్పము.
31. లక్ష్మీవ్రతకల్పము.

జాతకచంద్రికలోని ఒక శ్లోకము:—

శ్రీమద్వేంకట యజ్వతనయః
కోదండరామాహ్వయో
విద్వాన్ కొక్కొలపూడివంశతిలకః
శ్రీరామపాదాశ్రితః
వేదాంతార్థవిదాం వరఃకవినుతః
కార్తాంతికగ్రామణిః
వక్ష్యేజాతక చంద్రికాం బుధమనః
కల్హారసచ్చంద్రికామ్

బాలబోధినిలోని శ్లోకము:—

కోదండరామవిబుధో
హారితస్యసగోత్రజః
సుఖా జ్జ్యోతిషబోధాయ
కరిష్యే బాలబోధినీమ్.

కోదండరామ కవి నలువదియేండ్లవరకు సన్నముగ బక్కపలుచగ నుండెను. బంగారువన్నె మేని చాయ. విశాల ఫాల భాగము. ఆకర్ణాయత నేత్రములు. సహజ మందహాస వదనారవిందము గల యందగాడు.

మృదు మధుర గంభీర హాస్య రసోపేత వాక్చమత్కృతితో నొప్పు వ్యక్తి. నలువదియేండ్లు దాటినపిదప స్థూలకాయుడై లేచి కూర్చొనుటకు శ్రమించుట గలదు. మంచముమీద గాని కుర్చీమీద గాని కూర్చొనుట పరిపాటియయ్యెను. ఇతనికి తాంబూలము ఆహారముతో సమానమయ్యెను. రాజాస్థానమునకు బోవునపుడు కోటలోనుండి పల్లకి వచ్చుట యాచారమయ్యెను.

కోదండరామ కవి తన కూతురు చనిపోయిన మూడుమాసముల కావిషాదముచే క్రుంగికృశించి పరమపదించెను. తన మరణకాల మాసన్నమగు సమయమును దనవారికి దెలిపి పారలౌకిక క్రియాకలాపాదుల కాయత్తముగా నుండుడని సూచించెను.

# అచల

శ్రీమతి మల్లాది వసుంధర

మే మిద్దరము కవలపిల్లలము. నేను కవలపిల్లలను గూర్చి చాల చదివితిని. వారి రూపురేఖ లొకేరీతిగ నుండునని, వారి యభిరుచులు కూడ నంతియేనని, వారి నడకలలో చర్యలలో నిసుమంతయు భేద ముండదని యెన్ని రకములైన యభిప్రాయములనో చదివితిని. తరచుగ కవలపిల్లలిద్దరును బ్రతుకరట. ఈ యభిప్రాయములన్నియు మాయం దేమియు నిజము కావు. అచలకును నాకును నే విషయమునందును సమానత లేదు. అచలకు చదువన్న నెంత ప్రీతియో నా కంత విసుగు. ఆమె నాకన్న పెద్దది. పెద్దదియని చెప్పుటలో నాకు నవ్వు వచ్చుచున్నది. ఆమె బక్కపలుచనిది పొట్టిది. నేను దృఢమైనదానను. కాలి పొడుగుదానను. ఆమె నాకంటె నొక గడియ పెదది.

అచల క్రమక్రమముగ చదువులో పైకి వచ్చుచున్న కొలదిని ఆమెకు సాహిత్యమునందలి యాసక్తి మిక్కుటమైనది. ఆమె సర్వకవుల గ్రంథములు నిశితముగ పరామర్శించుచు చదివినది. ఆమె బుద్ధి నైశిత్య మొరుల కబ్బనిదని నాన్నగారు చాలసారనుట నెరుగుదును. ఆమె యే కావ్యమునైన నిట్టె చదివి యందలి దోషాదోషములు నిరూపించును. ఆమె తెలివికి మా యింటికి వచ్చెడి పండితులు కూడ నాశ్చర్యపడెడివారు. ఆమె చిన్నచిన్న కథలు వ్యాసములు వ్రాయ మొదలిడినది. దానికిగూడ కొంత ప్రశస్తి వచ్చినది.

మురారి దేశ ప్రసిద్ధుడైన మహాకవి. మీయందర కాయన తెలిసియే యుండును. మా యక్క దృష్టియం దాయనను మించిన కవి సృష్టియం దింతవరకు జనన మందినది లేదు. ఇకముందుకూడ నుండునను నాశ లేదు. ఆమె కాయన గ్రంథములందు చాల భాగములు కంఠస్థములు. ఆమె నిదురలేచినది మొదలు నిదురపోవువరకు మురారి మాటలే చెప్పును. ఆయన పుస్తకములు చదువుచునే యుండును. తరచుగ నాన్నగారికి నచలకు మురారి రచనలమీద తర్కవితర్కములు జరుగుచుండును. ఎంత క్లిష్టములైన విషయములను విడదీసి సులువుగ చెప్పి యొప్పించి నాన్నగారిమీద తనవాదమును నిలబెట్టుకొనును.

నేనెప్పుడామెగదికి పోయినను మురారి యొక్క యొక నవలయో నాటకమో కావ్యమో యామె చదువుచునే యుండును. నేను మాటాడబోయినదానిని తప్పించి తా నప్పుడు చదువుచున్న మురారి గ్రంథమునందలి ప్రాశస్త్యము నుగ్గడించుచు నా వచ్చిన పనిని మరపించెడిది. ఇంతకును ఆ మురారి యెవరో మనిషి యెట్లుండునో మే మెవ్వరము నెరుగము. మాది పల్లెటూరు. మా నాయనగా రాయన నెదో సభలో చూచెనట. ఆయన వృద్ధుడని చెప్పెను. వృద్ధుడనగా నేబదియేండ్లు దాటినవాడని, యచల యడుగగా మా నాయనగారు చెప్పిరి.

అచల బక్కపలుచని మనిషి. తమలపాకుతీగవలెనుండును. పచ్చనిపసిమి. ఆమె చెప్పకొనతగినంత సౌందర్యవతి కాకపోయినను ముచ్చటైన విగ్రహము. ఆమె యందము మనదేశ సంబంధముగ నుండదు. కాని యామెలో నొకానొక యాకర్షణమున్నది. అది యిదమిత్థమని చెప్పరానిది. ఆమె చూపులతి విచిత్రములు. అందరు నన్నందకత్తె యందురు. నాకు కొంచెము గర్వముగకూడ నుండును. నేనందకత్తెననుట అచలకు కష్టము కలిగించుట నాకు తెలియును. ఆమె యందమును సామాన్యముగ నెవ్వరును మెచ్చరు. ఆమె యుద్దేశములో మెచ్చినవారు వివేకులు. ఆమె దృష్టిలో సౌందర్యము కేవలము దేహాగతమైనది కాదు. ఆత్మమిళితమైన దేహసౌందర్యమే సౌందర్యమట. ఆ సౌందర్యాభ్యాసము తనయందున్నదని యామె భావన.

మా యింటికి చాలమంది పెద్దమనుష్యులు వచ్చుచుందురు. అందక తియను నేను. ఆకర్షించునది అక్క పెండ్లి సంబంధములు వచ్చినప్పుడు మాత్రము గ్రతాంబూలము నాది.

స్నేహితురాండ్రతో కూడ మురారి కవిత్వ చర్చ. వారిలో నెవరైన మురారిని కాదన్నచో యింక నామెకు వచలకు మాటలు లేవన్నమాట. ఆమెకు మురారి గ్రంథములే నిద్రాహారములు. ఆమె నిద్రపోవునపుడు కూడ మురారి యేదో గ్రంథ మామె ప్రక్కమీద నుండవలయును. నే నామెకు మురారి పిచ్చిది యని పేరు పెట్టితిని.

ఒకనా డచలయు నేను రెండవయాట సినిమాకు పోయివచ్చితిమి. ఆమె వచ్చి యిదివరకు యెన్నిసార్లో చదివిన మురారి యొక నవలను చదువ నారంభించెను. నాకు కనులు కూరుకువచ్చుచున్నవి. నా నిద్ర యచల నిద్రలేమిని సహించరాకుండ నున్నది. నే నిట్లంటిని. "ఏమీ! అది యన్నిసార్లు చదువతగిన యుద్గ్రంథమా? ఏనవలయు నొక్కసారి కన్న నెక్కువ చదువనక్కరలేదు."

అచల: అవును కమలా. నీవన్నది కాదనను. లోకములో నవలలంతే. మురారి పుస్తకము లట్టివి కావు. నవలయైనను సరే చివరకు చిన్న కథయైనను చదివినకొలది నూత్న నూత్న భావము లుద్భవించును.

నేను: మురారి పరమేశ్వరుడు!

అచల: అందులో సందేహము లేదు. నా దృష్టిలో నతడు కానిదేమియు లేదు.

నేను: ఇంటిలో నందరు నీకు మురారి పిచ్చి యెక్కినదనుకొనుచున్నారు.

అచల నవ్వినది. ఆమె కన్నులా నవ్వులో చిత్రముగ మెఱసినవి.

నాకు నిదురపట్టలేదు. కొంతసేపటికామెకు నిదురపట్టినది. ఆమె రొమ్ముమీద నా నవలయున్నది. నేను నెమ్మదిగా లేచి ఆమె రొమ్మమీది పుస్తకమును తీసితిని. ఆమెకు వెంటనే మెలకువ వచ్చెను. ఆమె నావంక నొక చురుకుచూపు చూచినది. నేనా చూపునకు బెదరిపోయి పండుకొంటిని.

ఇద్దరకు నిదురలేదు. తూరుపు పసుపుకొట్టి వస్త్రగాళితము చేయుచున్నది.

మా పల్లెటూరిలో కొందరు యువకులు గ్రంథాలయము నొకదానిని నిర్మాణముచేసి దాని ప్రారంభోత్సవమునకు మురారిని పిలుతురని మాకు తెలియవచ్చెను. ఆవార్త మాయింట వ్యాపించెను. ఆనందమను పదార్థమంతయు ముద్దకట్టిన సజీవమూర్తి మాయక్క ఆమెలో అంతటి యానందము నా కంతకు ముం దెన్నడు చూడరానిది. అక్క మనస్సు నింతగ నాకర్షించిన యాయన యాకృతిని దర్శింపవలెనను నుత్కంఠ నాకును లేకపోలేదు కాని ఆమె యానందమునకు నా యుత్కంఠకు నేమి సంబంధము! ఆమె మురారి మనస్సు నెరుగును. ఆయన మనోగత భావనల నెరుగును. ఆయన సర్వవిద్యావైభవము, రచనావైదగ్ధ్యము, రససమంచిత వాక్యవిన్యాసము నెరుగును. ఆయన యాత్మ నెరుగును. ఆయన శరీరమును చూడవలెనని యామె యుత్కంఠ. ఆమె తన యెన్ని యకుప్రశ్నలకు ఆయన గ్రంథములయందు సమాధానమునందినది! ఆమె, కావ్యములయొక్క యర్థ మెరుగుటకు తపస్సు చేసినది.

లేతకనకాంబరపు టులిపిరి పట్టుచీర, నల్ల పట్టు రెకలో నచల నాకన్న నందకత్తియ ఆమె యందము పటరానిదిగ నున్నది. ఈనా డామె సామాన్య మానవ స్త్రీవలె లేదు. ఒక్క యచ్చర నేలకు దిగ్గి వచ్చినట్లున్నది. ఆమె కన్నులు చిన్నవి. అవి వెన్నెలలు కురియుచున్నవి. ఆ కన్నుల మిలమిలలు చిఱుగాలికి కదలాడు చిఱుతరగలు గల సరోవరముమీది సంధ్యారుణకాంతులు.

మురారి యాజానుబాహువు. తేజస్సు లుమియుచున్న కన్నులు. విశాలమైన ఫాలభాగము. ఎత్తైన నాసిక. ఆయన అతిసుందరముగ నవ్వును. ఆయన ఫాలమున నొకానొక నిర్ణయింపరాని వెలుగురేక కనిపించును. ఆయన వయస్సు సుమా రరువది సంవత్సరములు. కాని అంతవృద్ధుడుగ కనిపించడు.

ఆయన ఉపన్యసించినంతసేపు సభయంతయు నిశ్శబ్దము. ఉపన్యసించినయంతసేపాయన యొక చక్రవర్తి. సభయంతయు మోహనాస్త్రబద్ధమైన ట్లున్నది. ఆయనకంఠమున వేయికోయిలలు కూసినట్లుండెను.

సభలో కూర్చున్నప్పటినుండి అక్క మొగమును నేనొకకంట కనిపెట్టుచునే యున్నాను. ఆమె మొగము క్షణక్షణము వర్షాసంధ్యవలె రంగులు మార్చుకొనుచున్నది. ఆశ్చర్యము, నైరాశ్యము, తన్మయత్వము, పరధ్యానము. హృదయమున కేదో తీవ్రఘాతమైన ట్లున్నది. తనువెల్ల కంపనము పొందినది. కనులనుండి బాష్పములు ముత్యములవలె రాలుచున్నవి. ఒరవడి

గల యొక ప్రవాహము గండశిల కెదురుకొట్టుకొని గిలగిల లాడుచున్నట్లున్న దామె స్థితి.

సభ యైపోయినది. అచల సభకు పోవునప్పుడు వసంతలక్ష్మి. ఇంటికి వచ్చునప్పుడు గ్రీష్మకాలపు వడగాడ్పులకు వడలిపోయిన లేత మల్లెతీవియ.

రాత్రియెల్ల అచలకు జ్వరము కాచినది. మరునాడు మురారి వెళ్ళిపోయెనన్నారు. వారము దినములలో అక్క మరల తిరుగ నారంభించినది. ఇప్పటి యచలలో పూర్వపు చురుకుదనము లేదు. తర్కవైచిత్రి లేదు. ఆమె చిక్కి సగమైనది. నే నామె నుండి యేమియు తెలిసికొనలేకపోయితిని. ఒడ్డెరుగని మహాసముద్రమధ్యమున మునుగుచు తేలుచున్న జీవివలె నున్నది యామె స్థితి.

ఏడాది తిరిగినది. ఆనోట నానోట మా అక్క కథ యూరిలో వ్యాపించెను. గ్రంథాలయ వార్షికోత్సవమునకు మరల మురారిని పిలిచిరి. మా నాయనగారాయనను మా యింటికి విందునకు పిలిచిరి. ఇప్పుడాయన యెక్కువ యారోగ్యము కలవాడుగ నున్నాడు.

మా నాయనగారొక విచిత్రమైన మనిసి. మురారి కచలను చూపించి యామె సంగతి యంతయు చెప్పెను. నాన్నగారి కచల గొప్ప రచయిత్రి కావలెనని యాశ. మురారి అచల రచనలను చూచెను. మెచ్చుకొనెను. తన కామె భక్తురాలని తెలిసికొనెను. ఆ స్థితి యేజీవి కిష్టము కాదు!

మురారి మా యింట మూడురోజులున్నాడు. ఈ మూన్నాళ్ళలో అచల పూర్వపు టచలయైనది. నాల్గవ నాడాయన బయలుదేరెను. మా నాయనగారును మురారియు నేమి మాటాడిరో! అచల చదువు నిమిత్త మాయనతో వారి యూరికి పంపించుట జరిగెను. అప్పుడచలను చూడవలయును! అచల కాకాశయానము చేయుచున్నట్లున్నది.

మురారి కెవ్వరును లేరు. భార్య బిడ్డను కని చనిపోయినది. ఆ బిడ్డయు రెండురోజులుండి చనిపోయినది. ఇరువదియేండ్లుగ సన్యాసివలె గడుపుచున్నాడు. హోటలు భోజనము. అతని పుస్తకములమీది రాబడి చేత జీవనము. అతని యింటికి సాయంకాలముల యందు ప్రతిదినమును కొందరు స్నేహితులు వత్తురు. వారితో కలసి లోకాభిరామాయణము.

ఆ స్నేహితులలో కుమార్ ముఖ్యుడు. అతడు స్ఫురద్రూపి. చాల తెలివిగలవాడు. మురారియు నచలయు నింటిదగ్గర మొదట కలిసికొన్నది కుమారును. కుమార్ అచలను చూచి చకితుడయ్యెను.

కుమార్: ఏమండీ! అదృష్టదేవతను వెంటతెచ్చినట్లున్నారే!

మురారి: నాకు బంధువులనెడివారు లేరు. నేటికి బంధువు వచ్చినది.

కుమార్ చిత్రముగా నవ్వెను.

మురారి మరల నవ్వెను. మురారి నవ్వులో కుమారునం దొక నిరాదరణ, కుమారునవ్వులోని యర్థమునం దొక తిరస్కారము చుట్టుపట్లనున్న గాలితో కూడ నొక సంబంధము లేని లక్షణము భాసించెను.

మురారి మరల నిట్లనెను. “నాకు బిడ్డలు లేరు. బిడ్డలు లేని ముసలితనము గడుపుట కష్టము. ఈమెకు సాహిత్యమున మంచి ప్రవేశముకలదు. ఈమె కెంతటి మహార్థమునైన నందించిన చాలును అంటుకొనిపోవును. నా శిల్పము యీమెయందు ప్రతిబింబించగా నేను చూతును. ఈమె నా బిడ్డ.”

మురారి అచల బుజముమీద చేయివైచి దగ్గఱకు తీసుకొనెను. అచల పసిబిడ్డవలె మురారి నత్తుకొనెను. అదియే మొదటిసారి మురారి యచలను తాకుట. సముద్రాభిముఖముగ ఒరవడితో నురుగులు గ్రక్కుచు ప్రవహించు నొక సెలయేరు దారి మరలి కొండప్రక్కకు తిరిగి తల్లికాళ్లకు చుట్టుకొన్న పసిపిలవలె కదలినటు కనిపించిన దచల.

మురారికి చాలయేండ్లుగ గర్భగతవ్యాధి యొకటుండెను. అది యేండ్లతరబడి పూటకూటి యింటి తిండి తినుటవలన వచ్చినది. మురారి కా వ్యాధి యంతరించెను. మనిషి నున్నపడినాడు. ఆయన బుగ్గల నెరుపుగీరలు తొంగిచూచుచున్నవి. అచల వంట నద్భుతముగ చేయును. ఇల్లంతయు నతి శుభ్రముగ నుండును. ఆమెకు మురారి మనసులో నెప్పు డేది కావలయునో తెలియును.

కాలము గడచినకొలది కుమారుకు మురారి తండ్రియనియు అచల కూతురనియు తెలిసినది. కుమారు మురారితో మునుపటివలె లోకాభిరామాయణము మాట్లాడడు. సారస్వతచర్చ చేయడు. అచల చదువునుగూర్చియే మాట్లాడును. కుమారుకన్నులామెనే వెదకును. అతని చెవు లామె గాజుల గలగలనే వినును. కుమారుకు మురారియందు మిక్కిలి చనవు. మరల భయము. అచలకు, మురారియందు

తన కెట్టిభావమో కుమారున కట్టిభావమే కలదని నమ్మకము. అచలయు కుమారును రెండేండ్లకే కాంతముగ నున్న గడియలేదు. కాని మురారి వారి యిద్దరను తన మనసులో జత కలిపెను. ఆయన మనస్సులో వారిద్దర నాశీర్వదించెను. కుమా రీ సంగతి యెత్తడు. అచల అంతకుముందే యెత్తదు. మురారి యెదురు చూచు చుండును.

అచలకు మురారి చదువు చెప్పిన పాపమున పోలేదు. మా నాయనగారు మురారివద్ద అచల చదువు కొనుచుండెనని యనుకొందురు.

మా యక్క కింటివద్ద పెండ్లిసంబంధములు వచ్చు చున్నవి. మురారి పంపడు. అచల రాదు. ఇరువదేండ్లు సన్యాసియైయున్న మురారి కచలపై నీ మమకార మేమి! తాను జడభరతునివలె నగుచున్నాడు.

ఒకనాడు మా నాయనగారు మురారి యింటికి వెళ్లెను. అచలను తీసుకొనిపోదునన్నాడు. ఆమె రానన్నది. తా నింకను చదువుకొనవలెనన్నది. మా నాయనగారు విధిలేక యింటికి తిరిగి వచ్చినాడు. నన్నుకూడ మురారి యింటికి పంపినాడు. నేను మురారిని వదలి యచల యెందుకురాదో తెలిసికొనవలయును. నేనక్క దగ్గరకు పోయితిని. మొదట నేనామెను గుర్తుపట్టలేకపోయితిని. ఆమె మిక్కిలి చిక్కిపోయినది. శరీర మెంత చిక్కిపోయినదో మొగమున నంత యానందమున్నది. ఆ రెంటికిని నాకు సంబంధము కుదురలేదు. నాతో మిక్కిలి యుత్సాహముగ మాటాడుచున్నది. ... ఆమెది పిట్ట తిండి. అందులో నిప్పుడు ప్రతిపూట రెండు మెతుకులు గతుకుటయే తప్ప అన్నము తినుటయే లేదు. ఆమె ప్రవర్తన నాకు మిక్కిలి చపలముగా కనిపించెను. కాని యామె కన్నులు చూచినచో నేదో యొక స్థిరమైన సంకల్పముతో నున్నట్లు తోచెను. ఆమె యొక యగ్నిపర్వత మనిపించెను. పూర్వ మామె కన్నులలో చంచలత్వ ముండెడిది. ఇప్పు డా చంచలత్వము లేదు. పూర్వ మామె యెక్కువ నవ్వెడిది కాదు. ఇప్పు డామె ప్రతిమాటకు నవ్వును. పూర్వ మామె నెమ్మదిగా నడచెడిది. ఇప్పు డామె మిక్కిలి విసురుగా నడచుచున్నది. పూర్వ మామె కనుబొమలు ముడివడుట నే నెరుగను. ఆ బొమముడి లేశముకూడ లేదనుటకు తగిన నిముస మిప్పు డొక్కటియు కనుపించదు. ఆమెలో నేదియో యొక యావేదన కలదు. ఆ యావేదనకు కారణము నా కంతుపట్టలేదు.

కుమారు నాతో చనవుగా మాటాడనారంభించెను. మాకు పరిచయమైనది. అతడు నాతో తన కచలమీద గల యచంచలప్రేమను చెప్పెను. అచలకు తనమీద ప్రేమ యున్నదని చెప్పెను ఆ ప్రేమయొక్క స్వరూప మేమో కుమారుకు తెలియదు. ఒక చిరునవ్వు, తన కన్నులలో కన్నులు పెట్టి చూచుట, తన ప్రేమ మాపుల కామెయాగుట వీనికి మించి యామె ప్రేమకు వ్యక్తీకరణ లేదట. నా కచలమీద కోపము వచ్చినది. అచలతో నీసంగతి మాటాడవలెననుకొంటిని.

ఒకనాడు మురారి తన గదిలో నిదుర పోవుచున్నాడు. అచల ప్రక్కగదిలో పండుకొన్నది ఆమె యెప్పుడు నచ్చటనే నిద్రించును. ఎప్పుడు నేదియో చదువుచుండును రాత్రిలో నొకగంట నిద్రించునో రెండుగంటలు నిద్రించునో. నాకొక్క టే భేదము తోచినది. పూర్వ మెప్పుడు మురారి కావ్యములే చదువుచుండెడిది. ఇప్పు డేది చదివినను పరుల కావ్యములే చదువుచున్నది

ఆమె యొకనా డొకకథ చదివెను ఆ కథను చదువుమని నాకిచ్చెను దానిని నేనుకూడ చదివితిని. చదివినతరువాత నచల యిట్లనెను. "ఈ కథలోని నాయిక నాయకుని గ్రుడ్డిగ ప్రేమించినది. అతని నెరుంగకుండ వానియందు ప్రేమభావమును వృద్ధి పొందించుకొనినది. అతడు కనిపించువరకు తా నాతని వివాహము చేసుకొనుటకు వీలులేదని తెలిసినది."

నేను: ఆమె తాను చూడని మనిసిని ప్రే... చుటయే తప్పు. ప్రేమయనునది వ్యక్తియొక్క రూపాదులు తెలిసినతరువాత జనించెడు భావము. దానికే ప్రేమయని పేరు. తక్కిన దాని పేరు వట్టి యూహ. ఆ యూహలకు ప్రేమత్వము లేదు.

అచల: కమలా! వ్యక్తిని చూచి ప్రేమించుట శరీరమును ప్రేమించుట. గుణములు విని ప్రేమించుట యాత్మను ప్రేమించుట.

నేను: అయినచో పెండ్లియక్కరలేదు.

అచల: అక్కరలేదు!

అంతటితో నచల మాటాడలేదు. అచల కన్నులలో నొక తృప్తి వెలికి వచ్చుచున్నది. అప్పటి యామె తీరు నాకు విచిత్రముగ నున్నది. ఇందలి పరమార్థ మేమి? తరువాత కొంతసేపటికి యచల నాతో నిట్లన్నది. "నీ విక్కడి కెందుకు వచ్చితివి?"

నేను: నీకు పెండ్లిచేయుటకు నాన్నగారు తొందరపడుచున్నారు.

అచల: నేను పెండ్లిచేసికోను. నాయనగారితో చెప్పితినే.

నేను: నీ వాయనతో చెప్పినట్లాయన చెప్ప లేదు.

అచల: నా కిష్టము లేనివానిని నేను చేసికోను.

నేను: కుమారన్నచో నీ కిష్టమే కదా? అతనిని చేసికోవచ్చును.

అచల మాటాడలేదు. మరునాడు అచల ప్రక్క నున్న నదికి స్నానమునకు పోయెను. ఆమె నదికి స్నానమునకు వెళ్ళినచో రెండు మూడు గంటలవరకు రాదు. నేను మురారి గదిలోనికి వెళ్ళితిని.

మురారి: అచల లేదా?

నేను: నదికి వెళ్లినది అక్కకు సంబంధములు వచ్చుచున్నవి. నాన్నగా రామెను పంపించు మన్నారు.

మురారి: నేను వెళ్లుమందును. ఆమె పోనను. నే నేమి చేయుదును?

నేను: ఎందుకు రాదు? కుమారును ప్రేమించినదా?

మురారి: నీ వడిగితివా?

నేను: నన్నీ పుస్తకమును చదువుమన్నది

అని అక్క నన్ను చదువుమని యిచ్చిన పుస్తకమును మురారి కిచ్చితిని. ఆయన చదివెను.

తరువాత నాల్గుదినములకు మరల నచల నదికి వెళ్లినది. నేను మురారి గదిలోనికి పోయితిని.

మురారి: మరల నచల నదికి వెళ్లినదా?

నేను: ఆమె యెప్పుడును నదిలోననే యున్నది.

మురారి: ఎందుకు కోపముగా మాటాడుచున్నావు?

నేను: మీ మూలమున నచల చెడిపోయినది.

మురారి: కమలా! నా భార్య యాడపిల్లను కని చనిపోయినది. ఆ పసిపిల్ల రెన్నాళ్లుండి చనిపోయినది. అది చనిపోలేదు! ఇరువదియేండ్లుండి మరల నా దగ్గరకు వచ్చినది.

నేను: అది మీ యూహ. ఆమె యూహ యిట్లులేదు.

మురారి: ఎట్లున్నది?

నేను: ఆమె యొకనిని ప్రేమించినది. కనిపించునప్పటికి వృద్ధుడు, పెండ్లికాకుండ భర్త చనిపోయినదానివలె నున్నది.

మురారి లేచి కూర్చుండెను. నావంక తీవ్రముగా చూచెను. నేను నతనివంక నిశ్చలముగా నట్లే చూచుచుంటిని. కొంతసేపటి కా వృద్ధుని కన్నుల వెంట ధారగా నీరు ప్రవహింపజొచ్చెను. ఆయన పసివానివలె వెక్కివెక్కి యేడ్చుచు మంచముమీద పడిపోయెను. చాలసేపటికి మురారి నాతో నిట్లనెను. "కమలా! కుమారు అచలను చాల ప్రేమించుచున్నాడు. ఆమె నతని కిచ్చి పెండ్లిచేసెదను. ఆమె నామాట కాదనదు. కమలా! నే నెంతటి మూఢుడను. నా కావ్యములనిండ మానవస్వభావము యొక్క లోతులు త్రవ్వి పెట్టితినన్న నా యహంకార మెంత యర్థరహితమైనది!"

నేను: మీ రూరకే చెప్పిన చాలదు. మీ శాసనముగా చెప్పవలయును.

మురారి: కమలా! ఆమెను నే నెట్లు శాసించగలను?

నేను: ఆమెను మీరు శాసించగల యధికార మామెయే మీకిచ్చినది.

ఆమరునాడు మురారి కుమారుని పిలిచి అచల వివాహమువిషయము ప్రస్తావించెను. అచలకు కుమారుమీద మిక్కిలి ప్రేమయున్నదని చెప్పెను. కుమారుకు బ్రహ్మానందమయ్యెను. ఇన్నాళ్లును కుమారు తానచలవిషయములో మురారికి భయపడి సాహసము ప్రకటింపలేదు. కుమారిట్లనెను. "మీకు అచల కూతురు. కడుపునపుట్టిన బిడ్డకాదు. కడుపున పుట్టిన కూతునకు పెంపుడు కూతునకు చాలభేద ముండును. అసలు కుమార్తెకు తండ్రివద్ద పెంపుడుకుమార్తెకున్నంత చనవుండదు. పెంపుడు కుమార్తె పెంపుడు తండ్రితో మోహపుటిల్లాలివలె ప్రవర్తించును అతడు నామెయం దట్లే ప్రవర్తించును. వారి బాహిరమైన ప్రవర్తనకు నాంతరమైన భావనకు లోకదృష్టిగా పొసగదు.

పెంపుడు కూతురు లోభి దాచుకున్న ధనమువంటిది. మహాకవీ! అచలను మీరు మరొకనికిచ్చి వివాహము చేయుదురని నేననుకొనలేదు.

మురారి : నీవు మరొకడవు కాదుగదా!

ఆనాటి సాయంకాలమునుండి యచలయు కుమారు నేకాంతముగ నుండునట్లు మురారి తటస్థింప జేసెను. సాయంకాలముల నెన్నడు బయటికి పోని మురారియారోగ్యవాహ్యాళులకు పోనారంభించెను.

నేను వారి యిద్దరి కలయికకు నభ్యంతరమువలె తోచెను. నేనును మురారివెంట సాయంకాల వాహ్యాళికి పోనారంభించితిని. అచలా కుమారుల ప్రవర్తనలో క్రమక్రమముగ మార్పు కనిపించెను. వారిద్దరొకరివంక నొకరు చూచుచు కూర్చుందురు. అచల కుమారుతో పరాచికములాడును. వారి చనవు విచిత్రముగా కనిపించెను. వారి యిరువురి మధ్య ప్రేమయున్నది. చనవున్నది. కుమారుదృష్టిలో కామభావన యున్నది అచల దృష్టిలో లేదు. అచల తొలినాటి మురారి గ్రంథములమీదనున్న యభిమానమును సగము కుమారుకు పంచియిచ్చిన ట్లున్నది. అప్పుడు పుస్తకమును వదలిపెట్టలేదు. ఇపుడు కుమారును వదలి పెట్టలేదు.

మురారి యొకనాడు వారిద్దరు పరస్పరాలోకనములు చేసికొనుచుండగా నావంక చూచి నవ్వెను. నేను నవ్వలేదు.

మరునాడు కుమారు రాలేదు. అచల నదికి పోయినది. నేను మురారి గదిలోనికి పోయితిని.

మురారి : కమలా! అచలా కుమారులకు వివాహ మెప్పుడు చేయవలయును?

నేను : ఒకబాలికను ఒకపుస్తకమునకిచ్చి పెండ్లి చేయుదుమా ?

మురారి : నీవన్నది నా కర్థము కాలేదు.

నేను : కుమారు మీరు వ్రాసిన ఒక గ్రంథము వంటివాడైనాడు. వానిని మీరు రచించితిరి. అతనియందలి యచలయొక్క భావమంతే.

మురారి యాలోచనానిమగ్నుడయ్యెను. తాను లేకుండ పోవలయును. అచలకు తాను విముక్తి నీయవలయును. తరువాత నాల్గుదినములు మురారి తనలో తాను లేడు. ఒకనాడచల నేకాంతముగా పిలచి యిట్లనెను. "అచలా! నీవు వివాహము చేసికొనవలయును."

అచల: నా కిదివరకే యైనది.

మురారి: ఆ వివాహముకాదు. నిజముగా వివాహము చేసికొనవలయును.

అచల నవ్వెను. చీరకొంగు కనుల కడ్డము పెట్టుకొని యేడ్చెను.

మురారి: అచలా! నేను వృద్ధుడను. నిన్ను నా బిడ్డను చేసికొంటిని.

అచల దుఃఖము మాని మురారివంక నిశ్చలములైన కన్నులతో చూడ నారంభించెను.

మురారి: కుమారు నిన్ను మిక్కిలిగా ప్రేమించుచున్నాడు. నీ వతనిని పెండ్లియాడుట నా యభిమతము.

అచల నిలుచున్నది నిలుచున్నట్లు నఖశిఖపర్యంతము కంపించెను.

మురారి: ఇది నా యాజ్ఞ. నా యాజ్ఞయు నేనును ఒకటే. నన్నెట్లు మన్నింతువో నా యాజ్ఞనట్లు మన్నింపుము.

అచలమొగములో నుదయరాగము పోయి సంధ్యారాగ ముదయించెను. పూర్వమారి పడమరయైనట్లుండెను.

ఒకనాడు వాహ్యాళినుండి నేనును మురారియు తిరిగివచ్చితిమి. అచ్చట నచల లేదు. కుమారు విషణ్ణవదనుడై కూర్చుండెను. నేనతనివంక చూచితిని. అతడు నావంక చూచి, "కమలా! కమలా! నావలన నేమియు తప్పులేదు. ఇంక నీ మొగము చూడనని యచల లేచిపోయినది. నన్నిచ్చటికి రావద్దన్నది. నేను వచ్చుట మానివేయనిచో తానిచటినుండి వెడలిపోయెద నన్నది."

నేను: నీవేమన్నావు?

కుమార్ : నే నేమియు ననలేదు. మురారియొక్కయొక కావ్యము నాకు బాగుగాలేదన్నాను. అందులో నౌచిత్య పరిపోషణ చక్కగా చేయబడలేదన్నాను.

నేను నవ్వితిని. ఇట్లంటిని. ఆమె నిన్ను ఒక అద్దముగా చూచినది. ప్రతిబింబ భావము సరిగా లేనిచో అద్దము నుపయోగించుకొనరు.

మరునాటినుంచి కుమారు మురారి యింటికి వచ్చుటలేదు. మురారి యచల నడిగెను. అచల యిట్లనెను. "నీకు నే నెటువంటిదాననో కుమారుడటువంటివాడా?"

మురారి : నీవు నాబిడ్డవు. అతడు నాకు స్నేహితుడు.

అచల : మాయిద్దరి కదియే భేదము. బిడ్డ తండ్రి ముక్కున నూడిపడును. స్నేహితుడు తన శరీరమునకు వెలివాడు.

తరువాత పదిదినములు గడచెను. అచల యనుదినము నదికి పోవుచునే యుండెను. ప్రొద్దున వెళ్ళినచో ప్రొద్దు తిరిగి వచ్చును. మధ్యాహ్నము వెళ్ళినచో ప్రొద్దుపోయి వచ్చును. ఒకనాడు నదికి వెళ్ళి రానేలేదు. మురారియు నేనును తహతహలాడితిమి. మానాయనగారి కుత్తరము వ్రాసితిమి ఆయనగారు వచ్చిరి అచల నదికి వెళ్ళి యారుదినములైనది. ఒకనాడు మురారి చిరునామా కొక యుత్తరము వచ్చెను. దస్తూరి అచలది. ఉత్తరము విప్పుచున్న మురారి చేతులు కంపించెను. ఉత్తర మిట్లున్నది.

మహాకవి మురారి గారికి,

మీ యచల నమస్కారములు. నేను పరానీనురాలనైనాను. నదినుండి సముద్రమునకు తేలితిని. ఓడలో నేనును శిరీషుడును ఎలెక్జాండ్రియా చేరినాము. శిరీషుడు మీ శిల్పమువంటివాడు. అమెరికాకు పోవుచున్నాము. అచ్చటినుండి మరల వ్రాసెదను. కమలకు ఆశీస్సులు.

మీయందు

అచల.

క్రింద శిరీషుడు వ్రాసిన రెండుపంక్తు లున్నవి.

"నన్ను మీరెరుగరు. నాలుగైదేండ్లక్రింద అచలనుకూడ నెఱుగరు. మే మిద్దరము మీ కవితావాహినిలో కలిసికొన్నాము. జీవనసాగరములో నుందినాము."

# అభిజ్ఞానశాకుంతలము

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి

శ్రవ్యకావ్యరచనకు వాల్మీకి మహర్షివలె దృశ్యకావ్య నిర్మితికి భాసు డాద్యుడన జాలడు గాని తత్పూర్వరూపకము లదృశ్యము లగుటచే నట్టి యశస్సతనికి దక్కినది. కాళిదాస మహాకవి మాలవికాగ్నిమిత్ర ప్రస్తావనలో "ప్రథిత యశసాం భాస సౌమిల్ల కవిపుత్త్రాదీనామ్" అనుచు గావించిన ప్రశంసకూడా దానిని స్థిరపఱచినది.

భాసాదులకును కాళిదాసునకును సుమారొక శతాబ్ది యంతరమున్నది. ఇతనినాడు వారి రూపకములు ప్రదర్శన రమ్యములై మెప్పుగాంచినవి అయితే నేమి? దైవానుకూల్యమున భాసరూపకములు, కొన్నియైనా మిగిలినవి గాని, తక్కినవారివి పేరైనా లేకుండబోయినవి. ఆ భాసుని రూపకములైనను సుమారు వెయ్యేండ్లు వ్యాప్తిగాంచి తరువాత మొన్న మొన్నటివఱకు రమారమి వేయేం డ్లజ్ఞాతవాసమున లీనములైనవి. అందుచే నీతని యీ నాటకరాజము జన్మించిన యుత్తరక్షణమునుండియు స్వప్నవాసవదత్తముమాడ్కి నాట్యరంగముల నలంకరించుచు వచ్చి, దుర్దైవమున నది ప్రచ్ఛన్నమయినంత, దానే విద్వల్లోకమున నగ్రగణ్యమైనది. ఆనాటి యీ రెంటి ప్రశంసలివి :

"భాషాసు రమ్యా గీర్వాణీ
తస్యాం కావ్యం మనోహరమ్,
తత్రాపి రూపకం రమ్యం
తత్ర భాసకవేః కృతిః"

కావ్యేషు నాటకం రమ్యం
నాటకేషు శకుంతలా"

అట్టి ఖ్యాతిగన్న దీని ఘనత నీ చిన్న వ్యాసమున నెంతని చూతుము? అయినా యొకింత

ఇతివృత్తము:— ఇది మహాభారతాది పర్వమున నిట్లున్నది. "దుష్యంతుడు వేటకై యడవికేగి క్రమముగా కణ్వాశ్రమము సమీపించి, ఆ మహర్షికి నమస్కరించి వచ్చుటకై తా నొక్కఁడ యాశ్రమములోనికి పోయెను. కణ్వుడు కుటీరమున లేడు. శకుంతల యతని కర్ఘ్యపాద్యాదు లిచ్చి సత్కరించినంత రాజా కన్యక యుదంతమంతయు నడిగి తెలిసికొని, తన్ను గాంధర్వమున పెండ్లియాడుమని కోరెను. తన కుదయించిన నందనుని యువరాజును జేయునట్లు వరము పుచ్చుకొని యామె యతని కోరిక నెఱవేర్చెను. పురమున కేగిన రాజు శకుంతలకై ప్రధానుల నంపలేదు. మూడేండ్లు గర్భము మోసి యామె కుమారుని గనెను. ఆ పిల్లవాడాఱు సంవత్సరములవాడైనంత మునీంద్రుడు శిష్యులను తోడిచ్చి తల్లిని పిల్లవానిని రాజుచెంత కంపెను. అతండు శకుంతల నెఱింగియు నెఱుగనట్లు నటించి, "వీరు నీ భార్యాపుత్త్రులే, స్వీకరింపు"మని యాకాశవాణి పలికినంత భార్య నాదరించి పుత్త్రునికి భరతుడను పేరు పెట్టి యువరాజును జేసెను."

ఇట్లతిసంగ్రహముగానున్న యీ ప్రఖ్యాత వృత్తము ప్రదర్శనోచితములును సామాజిక మనోరంజకములు నగు మార్పులతోను నూతన పాత్రములతోను నవ్యకల్పనలతోను వికసించి మిశ్రవృత్తమైనవిధ మొకింత కనుగొందము.

వస్తుసంగ్రహము:— రథారూఢుడై విల్లెక్కిడి లేడిని తఱుముచువచ్చిన దుష్యంతుని కణ్వాశ్రమమందలి తాపసులు విచారించిరి. రాజు రథము దిగి వారితో సంభాషించి, అతిథిసత్కారార్థము కూతురి నింటనుంచి కులపతి సోమతీర్థమున కేగెనని తెలిసియు, తనరాక మహర్షి కామెయే తెలుపు గాకయని, తా నొక్కడాశ్రమముజొచ్చి, యొకవంక పూలమొక్కలకు నీళ్లు పోయుచున్న మునికన్యలను చూచి, చెట్టుచాటుననుండి వారి మాటలు విని వారి పేళ్లెఱింగి,

శకుంతలను కష్టకృత్యమునకు నియోగించిన కణ్వుని చర్యకు వగచి యీ కన్నె చక్కదనమున కచ్చెరు వడుచు, ఆమె తాను పరిగ్రహింపదగిన కన్యయని భావించుచు, భ్రమరచేష్టావశమున వారికి ప్రత్యక్షుడై మాటలధోరణిని తాను పౌరవవంశరాజయిన దుష్యంతుడనని చెప్పి యనసూయవలన శకుంతలా జన్మవృత్తాంతము విని, తన మనోరథమున కవకాశము కలదని నిశ్చయించుకొనెను. నాయికానాయకులు పరస్పర మనురక్తులైరి.

తరువాత మావంశమున కీ వసుంధర యొట్టిదో మీ చెలికత్తె యట్టిదని యనసూయా ప్రియంవదలకు నచ్చజెప్పి గాంధర్వవిధికి శకుంతల నంగీకరింపజేసి సిద్ధమనోరథుడై తన్ను స్మరించుచుండుటకై స్వనామాంకితమైన యంగుళీయకమును ప్రియురాలి వ్రేలందొడిగి, రాజు తన రాజధానికి వేంచేసెను—మఱి, యానాడో లేక మఱునాడో దుర్వాసుడు కణ్వునింటివాకిటి కతిథియైవచ్చి పతిధ్యానపరవశయై తనవైపు చూడకున్న శకుంతలను "నీవు ధ్యానించుచున్నవాడు నిన్ను మఱచిపోవు"నని శపించి, యంతలో వచ్చుటకైవచ్చిన యనసూయ ప్రార్థింపగా, "అభిజ్ఞానమైన యాభరణము కంటబడినచో శాపము తొలగిపోవు"నని విఱుగుడు చెప్పి వెళ్ళిపోయెను. అట్టిది సిద్ధముగా తమ సఖివ్రేల నుండుటచే గండము తప్పినదని యీ చెలికత్తెలు సంతోషించిరి గాని శాపము మాట శకుంతలకు చెప్పలేదు సరిగదా, ఎవ్వరికీ నీమాట చెప్పరాదనుకొన్నారు. తరువాత-

"శకుంతల గర్భము ధరించియున్నది. దుష్యంతుడు చెప్పినట్లుగా శకుంతలను దీసికొని వెళ్లుటకై సేవకుల నంపలేదు. లేఖయైన వ్రాసి యంపలేదు ఇందుకు దుర్వాసశ్శాపము హేతువు కాదుగదా? తాతపాదులతో నేమి మనవిచేయుదును?" అనుచు ననసూయ విచారించుచుండగా ప్రియంవద వచ్చి, "చెలీ! శకుంతల నత్తవారింటికి పంపుటకు తగినసన్నాహము చేయుము. తాతపాదులు వచ్చి శకుంతలను జూచి కుమారీ! నీకు తగినభర్త లభించెను. నిన్నిపుడు పతిగృహమునకు పంపింతునని సెలవిచ్చినారు" అని చెప్పెను.

ఆశ్రమవాసులందఱు శకుంతల నభినందించిరి. కణ్వుడు, గౌతమిని శార్ఙ్గరవ శారద్వతులను తోడిచ్చి కూతురు నత్తవారింటికంపెను—వారందఱు దుష్యంతునికి చెప్పవలసినమాటలు చెప్పిరి. ఎవరెన్ని చెప్పినా, శకుంతలను దానాశ్రమములో పరిగ్రహించిన మాట యతడు స్మరింపకుండెను. అయితే, నీ కానవాలుచూపి నీ సంశయము తీర్చెదనని శకుంతల తన వ్రేలు తడవికొని, అయ్యో! ఉంగరము లేదని విచారించెను. శచీతీర్థమున జాఱి పడి యుండునని గౌతమి యనెను. ఇక లాభములేదని యీ తాపసులు వెడలిపోయిరి ప్రసవించునంత వఱకు మాయింట నుంచెదనని పురోహితుడు శకుంతలను గొనిపోవుచుండ, అప్సరస్తీర్థముచెంత నొక తేజస్సామె నెత్తుకొనిపోవును—శకుంతల తల్లియైన మేనక తేజోరూపమున వచ్చి కూతురి నెత్తుకొనిపోయి మారీచాశ్రమములో దాక్షాయణి కప్పగించెను—

రాజనామాంకితమైన యీ యుంగరము శచీతీర్థమున చేపలు పట్టువానికి లభించినది. అది రాజుగారి దృష్టికి వచ్చినది. శకుంతలను స్మరింపజేసి విప్రలంభావస్థ తెచ్చి పెట్టినది. అతని విరహబాధ చూచి శకుంతల శ్రేయస్సుగోరు సానుమతి సంతోషించినది.

తరువాత నసుర సంహారమునకై యింద్రుని రథమెక్కి నాకలోకమునకేగిన దుష్యంతుడు తిరిగి వచ్చుచు తపస్వి క్షేత్రమైన హేమకూట పర్వతమందలి మారీచాశ్రమమున దిగి సర్వదమనుడను పేర నందు క్రీడించు తన పుత్రుని శకుంతలను గాంచును. మారీచానుగ్రహమున భార్యాపుత్రులను స్వీకరించి సుఖముగా పురము చేరును. ఈ సందర్భమున రెండు మాటలు:

అనసూయ సానుమతి విదూషకుడు నను పాత్రములు కనరావుగాని, యీ నాటకమందలి కథ యంతయు కొంచె మెచ్చు తక్కువగా పద్మపురాణ స్వర్గఖండమున గనవచ్చును. ఆ పురాణముకూడా వ్యాసప్రోక్తమే యన్న విశ్వాసము వ్యాపించియున్నది గావున దానినుండి కాళిదాసీ యితివృత్తము గ్రహించి యుండునని యెవరేని తలంప వచ్చును. ఈ విషయము నా సంస్కృత వాఙ్మయ చరిత్ర ద్వితీయ సంపుటమున చర్చింపబడినది అందలి సారమిది:—"కాళిదాసు శాకుంతల నాటకము చదివి యానందించిన యీనాటి పండితు డొకడు ప్రదర్శనోచిత క్రమమున నున్న యిందలి కథను స్వీకరించి చిన్న మార్పులతో ననుష్టుప్ఛందోబద్ధము గావించెను. అది పద్మపురాణమున "కెక్కెను" భారతము నందే ప్రక్షిప్తము లుండగా నిక దక్కిన వానిమాట చెప్పనేల? దీనినిబట్టి యీ దృశ్యకావ్య కథ చిర

కాలము క్రిందట శ్రవ్యకావ్య కథగా గూడ మాఱిన దని సంతసింపవచ్చును.

మఱియొక్క విశేషము—అల్హాబాదు నగరము దగఱనున్న 'భీత' గ్రామమున మార్షలు పండితుడు సంపాదించిన గుండ్రని రాగిరేకులలో శాకుంతల ప్రథమాంక కథ రేఖా చిత్రరూపము దాల్చియున్న దట! శాకుంతల ఘనత కిది వేఱొక నిదర్శనము.

పూర్వోక్తరీతినున్న యిందలి కథా సంవిధానమునకంతకు నభిజ్ఞానకల్పనము కీలకము. అది, అంగ రసములకు మూలము. నాయికా నాయకుల శీలములకు శాణము. నాటకముపేరే దానితో నుండ నిక దాని వర్ణనమేల? తరువాతిది శాపకల్పనము. ఈ రెంటికి గల సంబంధమందుమా, అతి విచిత్రము కాళిదాస ప్రతిభా జ్ఞాపకము.

మూడు నాలుగు దినములు తన్ను స్మరించుచు కాలము గడపుటకై రాజు ప్రియురాలికిచ్చిన యుంగరము నతఁడా ప్రేయసిని పెండ్లాడినట్లు నమ్మకమై యభిజ్ఞానముగా మార్చినది శాప మేకదా! అదేపురము చేరిన దానికి సతీస్మృతిని పోగొట్టినది. శచీతీర్థమున నయ్యంగుళీయకమును పడఁగొట్టినది. తన చెంతజేరి విలపించు సాధ్విని నిందమూలాలిని రాజుచే నిల్లు వెడల గొట్టించినది. తుదకు శాంత్యుపాయమును గూడ నామ మాత్రము గావించినది శాప మంగుళీయక దర్శనావసానము — అన్నమాట పోయిన యుంగరము మరల గంటబడినపుడు "నేను పరిత్యజించిన మునిపుత్రి నేను పెండ్లాడిన శకుంతలయేయని రాజు స్మరించుటతో సరి. మఱి దాని ప్రభావమో! తిరువాత రమారమి మఱి యైదు సంవత్సరములింట దుష్యంతుని, హేమకూటాద్రిపై పారు గింట శకుంతలను వియోగదుఃఖానలమున వేపి విడిచి పెట్టినది ఇక శాంత్యుపాయ మా పుణ్యదంపతులను సుఖపెట్టిన దేమున్నదో యూహింపుడు!

సప్తమాంకమున మారీచ మహర్షి వినిపించునందాక శాపము మాటగాని శాంత్యుపాయము మాటగాని యా సతీపతుల చెవిని బడదు. అపుడుగదా "నేను లోకనిందావిముక్తుడనైతి" నని దుష్యంతుడును, "ఆర్యపుత్రుడు నన్ను నిష్కారణము పరిత్యజింపలే" దని శకుంతలయు నూఱడిల్లగల్గిరి? అదిగదా కథా నిర్మాణ చాతురి! అది యట్టిది గాకున్న దీనికింత ఘనత యేలవచ్చును? ఇట్లు వస్తు కల్పనౌచితి నొకింత పరామర్శించితిమి. ఇక—

పాత్రౌచిత్యము:—పౌరవోత్తముడైన రాజర్షి కథానాయకుడు. అతడు ధీరోదాత్తుడు దక్షిణనాయకుడు. మేనకా విశ్వామిత్రుల కూతురును కణ్వ మహర్షి పాలితయు దివ్యాదివ్యయునైన శకుంతల నాయిక. బ్రహ్మర్షి పుత్రికలైన యనసూయా ప్రియంవదలు నాయికా సఖులు. ఆపత్కాలమందు నాయికకు సహాయపడిన సానుమతి మేనకవలెనే యప్సరస. ఆ నాయికను రక్షించినవారు దివ్యులైన దాక్షాయణీ మారీచులు, దేవదానవ మానవవంద్యులు. వారిచే దుష్యంతుని కర్పింపబడిన దౌష్యంతి జంబూ ద్వీపములోని ప్రాగ్భాగమునకు తన పేర భరత వర్షమను పేరుదెచ్చినతడు.

రాజు శకుంతల రూపలావణ్యములకు ముగ్ధుడై, యా సుందరి తప్పక క్షత్రియుడు పరిగ్రహింప దగిన కన్యారత్నమని తన యుదార హృదయము దానిని కోరుటయే తెల్పుచున్న దనుటలో స్వార్థపరాయణత్వ మహంభావము కామత్వరయు గనవచ్చుచున్న వని కొందఱయిన భావింపకపోరు. సత్యమే. కాని, యా భావ మా పాత్రకౌసమయమందు సముచితమే—రాజు మొట్టమొదట ముగ్గురి నేక కాలముందే చూచి, అహో వీరి దర్శన మెంత మధురము? ఈ రూపసంపద యంతఃపురాంగనలకుగూడా దుర్లభమే యనుకొన్నాడు. చాటున నుండి యాట్లె చూచుచు వారిమాటలు వినుచుండ నతనిదృష్టి యెక్కువగా శకుంతలపై వాలినది. హృదయము సంశయగ్రస్తమైనది. ఈ కన్య కణ్వుని కూతురా?—ఒకవేళ క్షత్రియాంగనయందు కణ్వ మహర్షి కుదయించినదేమో?అని తర్కించుకొన్నాడు, బ్రాహ్మణ మునికన్యలైన యనసూయా ప్రియంవదల సౌందర్యమును మించిన దివ్యలావణ్య రూప రేఖా విలాసములు శకుంతలయందుండుట కనిపెట్టినాడు. అపుడు మనసు పట్టజాలక "నా యుదార హృదయము కోరుచున్నది గావున నీ సుందరి తప్పక క్షత్రియుడు పరిగ్రహింపదగిన కన్యారత్నమే యని నిశ్చయించుకొన్నాడు. నిజముగా నతడెన్నడు నధర్మచింతన మెఱుగడు. కావుననే "యదార్యమస్యా మభిలాషి మే మనః" అనుచు ధైర్యముతో నట్లు పలుకగలిగెను.

అతడు కామియైన మాట నిజమేకాని, అనసూయ నడిగి యా శకుంతల జన్మవృత్తాంతము తెలియునందాక మనోవికారమును పైకుబుక నీయలేదు. తత్త్వము తెలిసినపిదప, మహర్షిసమ్మతి కెదురుచూడ

నక్కఅలేదని యా కన్నెను గాంధర్వవిధి కంగీకరింప జేయుట శృంగారనాయక లక్షణమే కదా!

నిజముగా నతఁడు ధర్మభీరువు. శకుంతల తన సభలోనికి వచ్చుటకుముందే "అనిర్వర్ణనీయం పరకళత్రమ్" అని యామెను జూచి శంకించెను. అంతటి మాటలు వినునపుడేదో సత్యాంశము మనస్సును పొడుచుచున్నను శాపవశమున నామె తన భార్యయని స్మరింపలేక, తన్ను నమ్మింప గౌతమి శకుంతల మేలిముసుగు తొలగింప నా సుందరిం జూచిచూచి, తనలో "స్వీకరించినచో పరకళత్రపరిగ్రహమగునేమో! విడిచినచో స్వకళత్ర పరిత్యాగమగునేమో! 'ఉభయథా మహాపాపమే' యన్న పాపచింతతో మంచుతోడి మల్లెపువ్వుపై వాలలేక దానిని విడిచిపోలేక యుండు తుమ్మెదవలె నున్నాననుచు నిట్లు చింతించెను:

ఇద ముపనత మేవం
రూప మక్లిష్టకాంతి
ప్రథమ పరిగృహీతం
స్యాన్న వేత్యవ్యవస్యన్,
భ్రమర ఇవ విభాతే
కుంద మంతస్తుషారం
న చ ఖలు పరిభోక్తుం
నైవ శక్నోమి హాతుమ్.

శాపము బలవత్తరమైనపుడు తొల్లిటి సుఖానుభూతి నెట్టిదైన నేమి? తుదకు పోపొమ్మని శకుంతలను వదల్చుకొని నాయకుడు తనలో ననుకొన్న మాటలివి:

కామం ప్రత్యాదిష్టాం స్మరామి
న పరిగ్రహం మునే స్తనయామ్,
బలవత్తు దూయమానం
ప్రత్యాయయతీవ మాం హృదయమ్.

"నేను విడిచిన మునిపుత్రిని నేను పెండ్లాడిన ట్లింతమాత్రము తలంపనుగాని, అదేమో కుతకుతలాడు నా హృదయము మాత్రము నన్ను నమ్మింప జేయుచున్నట్లున్నది" అనగా, ఏ హృదయము తొలుత శకుంతల నభిలషించినదో, ఆ హృదయమే నీవు విడిచినది నీ భార్యయే సుమీ యని పరితపించుచున్నదని భావము. అయితే నేమి? శాపోపహతము.

అంగుళీయకదర్శనానంతరము శకుంతలను స్మరించిన యతని పరితాపమున విప్రలంభ శృంగారము పొడచూపక పోదుగాని, అకటా! అధర్మ మాచరించితినిగదా యన్న యనుతాపమే యందు హెచ్చు. అతఁడు దయాహృదయుఁడు ధర్మమూర్తి— అనపత్యుడై మృతుడైన ధనమిత్రుని యాస్తి రాజునకు సంక్రమించు నన్న మంత్రిలేఖ చూచి, అయ్యో పాపము! అతని భార్యలలో నొకతె యేని గర్భవతి యేమో కనుగొనుడన్న జాలిగుండెవాడు, ఛీ! అంతర్వత్నియైన ధర్మపత్నిని పరిత్యజించిన పాపిని. నా గతికూడ నట్టిదే కదా! పౌరవవంశము నాతో సరి! యని ధర్మచ్యుతికి పరితపించిన పశ్చాత్తాప మూర్తి. ఇక నాయికాపాత్రమును గూర్చి యొకింత

భ్రమర పీడాకల్పనము నాయికా నాయకుల ప్రత్యక్ష దర్శనమునకు మూలము. అంతిదనుక చాటుననుండి వచ్చిన ఱేనికి మున్నే యభిలాష మంకురించినది. ఇపు డామెకు వికార మంకురించినది. అనంగదశలలో నిది దృగవస్థ. మనోహరరూపము నుదాత్తవేషమును సందర్శించినపు "డితఁ డెవరో! ఎవరీకన్య!" యనెడి కుతూహలముతోడి వికార మంకురించుట స్త్రీ పురుష సాధారణము. స్వభావసిద్ధమైన యీ మనోధర్మము ననుచితమనుట పొరపాటు. తాత్కాలికమైన యట్టి వికారము తరువాత గుణవిచారణచే నిలచిన నిలచును, లేకున్న నంతరించును. అంతేకాని యంకురింపక మానదు. లోకజ్ఞుడైన కాళిదాసు శకుంతలచే ననిపించిన మాటయే మనకీవిషయమున ప్రమాణము.

కిం ను ఖలు ఇమం ప్రేక్ష్య
తపోవనవిరోధినో వికారస్య
గమనీయాస్మి సంవృత్తా

"ఇతనిని చూచి తపోవన విరుద్ధమైన వికారము పాలయితి నేమి?" అనుకొన్నది. సహజధర్మ మనివార్యమనుట కీమాట చాలును—ఇక నది మొదలామె చూపిన హావభావములా? మృదుతరములు; కులముగ కన్యకోచితములు. వరునిమాటలతో కలుపని మాటలి

తీరందుమా, సౌశీల్యజ్ఞాపకములు. అతనిమీది యనురాగమూ గాఢము విమలము. తండ్రిమీది భక్తియూ, అసదృశము—నాటక శకుంతల భారత శకుంతలకంటె వేఱు. నీకు నాయం దుదయించినవానిని యువరాజును గావింపవలెనని వరమడుగలేదు. మహారాజు మాట కాదనుటకు సాహసింపలేక యెట్టకేలకు గాంధర్వమున కోడబడినదిగాని, తాతపాదులు తెలిసి యేమందురో, ఏమనుకొందురో యని భయపడుచునే యున్నది సిగ్గుపడుచునే యున్నది—సభలో శారద్వతాదుల మాటలు విని రాజు విస్మితుడై "నే నీమెను పెండ్లాడితినా?" అన్నపుడును—

పరిగ్రహ బహుత్వేఽపి
ద్వే ప్రతిష్ఠే కులస్యమే
సముద్రరశనా చోర్వీ
సఖీచ యువయో రియమ్.

"నాకు భార్యలు పెక్కండ్రున్నను, నా వంశము పేరు నిలుపునవి రెండే. ఈ చతురబ్ధిపరీత వసుంధరయు మీ చెలికత్తెయును" అని నా సఖులకు నచ్చజెప్పి, నా తండ్రి పరోక్షమున నన్ను గాంధర్వమున బెండ్లాడి, యిపు డిట్లనుట యుక్తమేనా? యన్న తనమాట ధిక్కరించినపుడును, తన దుర్దైవమును నిందించుకొన్నదిగాని పెద్ద కోపముతో భర్తనేమియు తూలనాడలేదు. ఇందలి నాయిక సాత్త్విక భావముతోడి సతీ తిలక మనుటకంటె హెచ్చుగా విశదీకరింప బనిలేదు.

వర్ణాశ్రమాచారములను యథోక్తముగా ప్రవరింపజేయ దక్షతగలవాడే ప్రజాపాలకుడు కాదగును. అరకామములు ధర్మావలంబనములు కావలెను గాని, తద్వ్యతిరిక్తములు కారాదు. శ్రేయస్సులు విఘ్నాంతరితములు. సుఖదుఃఖములు పర్యాయసిద్ధములు. దైవము దురతిక్రమము. ఇత్యాదిగా ప్రేక్షకులకు ధర్మము హితము నుపదేశింప నవతరించిన యీ రూపకమందలి పాత్రము లిట్లే తీర్చిదిద్దినవి గాక వేఱేమి?

రసౌచితి:—రసములలో శృంగార మెట్లాద్యమో దానిని వివిధగతుల సముచితముగా వర్ణించిన నాటకకవులలో కాళిదాసు నట్లే యాద్యుడనదగును. ఇతని కావ్యము లన్నిటిలో నితర రసవర్ణన లెన్నో యున్నను, వానిలో నెల్ల శృంగారవర్ణనలే యెక్కువ ప్రశస్తి గాంచియున్నవి. అందును పావ్యకావ్యములలోని శృంగార పద్ధతి వేఱు, దృశ్యకావ్యములలోని దాని స్థితి వేఱు. అందు తామస రాజసావస్థల కడ జూచినది. ఇందు సాత్త్వికమార్గము త్రొక్కినది. ఇంక శాకుంతలములోని శృంగార మందుమా, దీని కిదే సాటి. "రసో వై సః రసగ్ హ్యేవాయం లబ్ధ్వాఽనందీ భవతి" అను శ్రుతివాక్యమును లౌకికముగా సమన్వయింతుమేని, అందుకు శాకుంతల శృంగార మాద్యోదాహరణమగును. ఇందుకొకటి—

చెలీ! నీవు చెంతనుండుటచే నీ పొన్నగున్న తీగతో కూడియున్నట్లు తేజరిలుచున్నది సుమీ యని ప్రియంవద యన్నమాట, నిజమనుచు ఆ భావము నొకింత వివరించుటకె నాయకుడు—

"అధరః కిసలయరాగః కోమలవిటపానుకారిణౌ బాహూ" అని ప్రారంభించి, ఈ పేరు పేరువరుస నీవర్ణన యేమిటిరా? అనుకొని కాబోలు!—

కుసుమమివ లోభనీయం
యౌవన మఙ్గేషు సన్నద్ధమ్

అనుచు నొక్కమాటతో శకుంతల తారుణ్య తారళ్యములను ప్రేక్షకుల భావనలో ప్రతి నాడు. ఇదిగదా శృంగారవర్ణన సౌందర్యము! మఱొక్కటి:—

యౌవనకృతములయిన శోభా కాంతి మాధుర్యములను వెళ్లియెత్తినట్లు వర్ణించినవా రెందఱో కలరుగాని, ప్రకృతి సౌందర్యవర్ణనమున భావము వికసింపజేసినవా రెందఱున్నారు?

శకుంతల చక్కదన మవలోకించి, యీ సుందరి దేహకాంతికి వల్కలము తగదుగాని, యిది యలంకారశోభను సంతరింపకపోలేదనుచు నాయకు డన్న మాటలివి:

సరసిజ మనువిద్ధం
శైవలేనాపి రమ్యం
మలినమపి హిమాంశో
ర్లక్ష్మ లక్ష్మీం తనోతి
ఇయ మధికమనోజ్ఞా
వల్కలేనాపి తన్వీ

కిమివ హి మధురాణాం
మండనం నాకృతీనామ్?

గెటే మొదలగు పాశ్చాత్యపండితులు గూడా వహవా యని మెచ్చుకొన్న వర్ణనమిది. ఇందలి కడపటి పాదము భాసుని ప్రతిమా నాటకములో నారచీరగట్టిన సీతనుజూచి శ్రీరాముడన్న "సర్వ శోభనీయం సురూపం నామ" అను వాక్యము ననుకరణమనుటకంటె, ఆ సూత్రమునకిది దుష్యంతుని భాష్యమనుట యుక్తము, దీని భావము తెలుగున చూతము:

కమలము నాచుతీఁగ పయిఁ
గ్రమ్మినయేనియు సొంపులొల్కు, నా
హిమకరు శోభ యిమ్మడిగ హెచ్చును
నల్లని మచ్చఁజేసి, యీ
కమలదళాక్షియందమధికం
బొనరించెను నారచీర, ర
మ్యములగునట్టి రూపముల
కారయ భూషణ మేది కాదిలన్?

రసపిపాసువుల నాకర్షించు చాతుర్య మలగనితని స్త్రీవర్ణన మెట్లు వికసించుచు వచ్చినదో తత్స్వరూప మొకింత యిచ్చట గనుగొందము.

తన్వీశ్యామా శిఖరిదశనా
పక్వబింబాధరోష్ఠీ
మధ్యేక్షామా చకితహరిణీ
ప్రేక్షణా నిమ్ననాభిః,
శ్రోణీభారా దలసగమనా
స్తోకనమ్రా స్తనాభ్యాం
యా తత్రాస్తే యువతివిషయే
సృష్టి రాద్యేవ ధాతుః

అస్యాస్సర్గవిధౌ ప్రజాపతి రభూ
చ్చంద్రోనుకాంతిప్రదః
శృంగారైకనిధిః కథంను మదనో
మాసోను పుష్పాకరః,
వేదాభ్యాస జడః కథంను విషయ
వ్యావృత్త కౌతూహలో
నిర్మాతుం ప్రభవే న్మనోహర మిదం
రూపం పురాణో మునిః,

చిత్రే నివేశ్య పరికల్పితసత్త్వయోగా
రూపోచ్చయేన విధినా మనసా కృతాను
స్త్రీరత్నసృష్టి రపరా ప్రతిభాతి సా మే
ధాతుర్విభుత్వ మనుచింత్య వపుశ్చ తస్యాః

ఆ పరమేష్ఠి యువతి నిర్మాణవిషయమున గావించిన ప్రథమ శిల్పముగా సర్వాంగ సౌష్ఠవముతోడి యక్షపత్ని మొదటిశ్లోకమున ప్రత్యక్షమగుచున్నది.

ఈ సుందరి సుధానిధియగు చంద్రుడో శృంగారనిధియైన కంతుడో కుసుమాకరుడైన వసంతుడో సృజియించినదిగాని, అందము చందము నెఱుగని యా ఛాందసుడు ముసలితాత బ్రహ్మయ్య నిర్మించినది మాత్రము కాదనునట్లూర్వశి రెండవశ్లోకమున గనువిందగుచున్నది.

మహామహిమాన్వితుడైన యాస్రష్ట ముందు చిత్తరువున సర్వాంగ సౌష్ఠవముతో నీ యువతిని లిఖించి తరువాత ప్రాణముపోసెనో, లేక, సర్వావయవ సౌందర్య మట్టిపడు నీ సుందరిని మనసా నిర్మించెనో కాని, లోకములోని యందఱు స్త్రీలను సృజించినట్లే రమణీమణిని సృజింపలేదు. ఈ తరుణీ సృష్టియే వేఱు, అనునట్లు శకుంతల మూడవశ్లోకమున దర్శనమిచ్చుచున్నది. ఇక నీ విషయమున వివరణమేల? ఒక ప్రాచీన విద్వాంసుని స్తుతివాక్యము స్మరింతము చాలును.

సాకూత మధురకోమల
విలాసినీ కంఠకూజిత ప్రాయే,
శిక్షాసమయేఽపి ముదే
రతలీలా కాళిదాసోక్తిః

ఇంక రూపవర్ణనమందుమా, అపురూపము — రత్నకాంచనాభరణములు లేకయే యావయవములు దేనిచే రమ్యములై ప్రకాశించునో, అది రూపము — సౌందర్యము లేక చక్కదన మనబడునది. కన్నారజూచి మనసార ననుభవింపదగినదే కాని మాటలతో

చెల్పనగినదికాదు. అట్టిదానిని పోలికలతో నిరూపింపబూనిన వచనమిది:

“అనాఘ్రాతం పుష్పం
కిసలయమలూనం కరరుహై
రనావిద్ధం రత్నం
మధు నవ మనాస్వాదితరసమ్,
అఖండం పుణ్యానాం
ఫల మివచ తద్రూపమనఘం
నజానే భోక్తారం
కమిహ సముపస్థాస్యతి విధిః”

శకుంతల సౌందర్యము, ఆఘ్రాణింపని పువ్వువలె నున్నది, గిల్లని లేజిగురువలె నున్నది, తొలువబడని మణివలెనున్నది, రుచిచూడని తేనెవలె నున్నదనుచు, కంటికి గోచరించు వస్తువులతో పోల్చియు, తనివితీఱక, పూర్వపుణ్యముల సమగ్రఫలమువలె నున్నదనుచు నదృశ్యపదార్థము నుపమానముగా గూ యా సౌందర్యము వర్ణనాతీతమన్న భావము వెల్లడించినట్లున్నదీ వర్ణనము. ఇంక —

“తత్రాపిచ చతుర్థోఽఙ్క-
స్తత్ర శ్లోక చతుష్టయమ్.”

అనుచు రసజ్ఞుల ప్రత్యేక ప్రశంసకెక్కిన కథాభాగ మొకింత పరామర్శింతము — దీనికి సంబంధించిన ప్రదేశము, తపోవనము. ఇందలి పాత్రములా, కులపతి కణ్వుడు శిష్యులు గౌతమ్యాది తపస్వినులు తాపసకన్యలు, మృగలతాపాదపములు — అయితేనేమి? శకుంతల నత్తవారింటికి పంపుటయను విషయమును పురస్కరించుకొని యీ రంగమును రక్తికట్టించినది కణ్వపాత్రము. ఆ యారణ్యకవ్రతుడౌ బ్రహ్మనిష్ఠుడింక దివ్యదృష్టితోడి యోగీంద్రుడై మహిమలు చూపు సిద్ధుడై పౌరుడైన గృహమేధియై పిల్లలతండ్రియై కూతురికి బుద్ధులు నేర్పిన తల్లియై పృథ్వీశాసకుని శాసించు ధర్మశాసనుడై నటియించిన చంద మపూర్వము. తన యాశ్రమములో పెరిగినందున శకుంతలపై జనియించిన మమకార మతనికంట నీరు పెట్టించినది. మాపిల్ల మగనియింటికి కరుగుచున్నదమ్మాయని చెట్లతో చెప్పించినది. మాకెవ్వరికి తెలియకుండ నీమాటల కంగీకారము చూపిన యనూయకురాలుసుమీ యీపిల్ల! నన్ను స్మరించియైనా, నీ భార్యలు నలుగురితో సమానముగా నీమె నాదరింపుము. తరువాత దాని యదృష్టమని యల్లునికి కబురు పంపించినది. ఆహా! సర్వజనహృదయాకర్షకముగా స్వభావ ముట్టిపడునట్లు పుత్రికావాత్సల్యము నిట్లు ప్రదర్శింపజేసిన యీ లోకజ్ఞత, ఆ చాతుర్య మా కవీంద్రుని సొమ్ముగదా! వనదేవతావనస్పతులచే శకుంతలకై బంగారు నగలు పట్టుచీరలు లాక్షారసము నిప్పించినది కవీంద్రుని వాగ్వైచిత్రియో లేక ఋషీంద్రుని మానసిక సిద్ధియో! ఇంతయేల? కావ్యరస జిజ్ఞాసతో నీయంకము చదువు పాఠకుడా సమయమందా యాశ్రమమున నున్నట్లు తన్మయుడై హర్షవిషాదపరవశుడగు నన్నచో సరిపోవునుగదా! ఇంక, శాపప్రభావముతోడి తరువాతి కథ: —

దుష్యంతుడు స్వపక్షమున ధర్మబద్ధుడు; గౌతమీ శారద్వతాదులపక్షమున ధర్మచ్యుతుడు. కణ్వమహర్షి సందేశము నే పెడచెవిని బెట్టిన యతని మఱపు తాపసుల మాటలను దగికి జేరనిచ్చునా? మేలిముసుగు తొలగించినా, ఆనవాలు పట్టనీయని దాశకుంతల నర్మాలాపములను నమ్మనిచ్చునా?

అదివఱకే లేదు కాదనుచు రాజు తన మాటలను త్రోసివేయుటచే నందటికిని ప్రాణము విసిగినది. ఆడవాళ్ళందఱు కపట స్వభావులే యనుటతో శకుంతల కోపముండినది. దానితో “సధర్మమైన నా ప్రార్థన మంగీకరింపవేని నీతల వెయ్యి చక్కలగును” అనుచు భారత శకుంతలవలె గట్టిగా తిట్టకపోయినా “ధర్మమనే చొక్కాలో దూఱియున్నావు, గడ్డిమూసిన నుయ్యివంటివాడవు, నీవలెనే యందఱును వంచనామతులనుకొనుచున్నావు” అనుచు మృదువుగా నిందింపకపోలేదు, ఆ నిందతో “ఈ తరుణికోపము నిష్కపటముగా గనవచ్చుచున్న” దనుచు రాజుబుద్ధి సందిగ్ధావస్థలో పడకపోలేదు. అయితేనేమి? అభిజ్ఞానము కంటబడలేదు గదా!

అంగుళీయకదర్శనమైనది. శాపమంతరించినది. రాజునకు విరహవేదన యారంభమైనది. శకుంతల కా యుంగరమిచ్చిన సందర్భమును స్మరించి, ఆడినమాట తప్పిన క్రూరుడనని పశ్చాత్తాపపడుచు, నామె చిత్తరువు చూచి సత్యశకుంతల ప్రత్యక్షమైనట్లు మురి

యుచు, చిత్తరువని తెలిసినంతనే మరల విచారించు నాయకుని విరహము, "పూర్వాపరవిరోధీ అపూర్వ ఏష విరహమార్గః" అని సానుమతి యన్నట్లు విజృంభించినది. తుదకు నాయకుడన్నమాట లివి:

ప్రజాగరా త్ఖిలీభూత
స్తస్యాస్స్వప్నే సమాగమః,
బాష్పస్తు నదదాత్యేనాం
ద్రష్టుం చిత్రగతామపి

ప్రియురాలిని కలలో గాంచి సుఖింతునంటే కంటికి కునుకు రాకున్నది. పోనీ! చిత్తరువులో చూచి యానందింతునంటే కన్నీరు చూడనీయకున్నది.

ఇట్లనురక్తురాలైన ధర్మపత్నిని వదలుకొన్నందుకును, అంతర్వత్నియైన యా సాధ్విని విడిచి వంశప్రతిష్ఠకపరోగము కలిగించుకొన్నందుకును పరితపించు నాయకుని హృదయము మాతలిచర్యచే వీరరసాక్రాంతమైనది. తరువాత దుష్యంతునికి శకుంతలా భరతలాభమున నాటకము శుభాంతముగా ముగిసినది. ఈ విషయమున మారీచమహర్షివాక్యము స్మరణీయము.

దిష్ట్యా శకున్తలా సాధ్వీ
సదపత్య మిదం భవాన్
శ్రద్ధా విత్తం విధిశ్చేతి
త్రితయం తత్ సమాగతమ్

కథానిక

# * తప్పు

శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు

అర్ధరాత్రి పన్నెండు గంటలు దాటుతుంది.

అమావాశ్య చీకటి. అక్కడక్కడా వున్న వీధి దీపాలు మాత్రం కొంచంగా వెలుగును ప్రసాదిస్తున్నాయి. కీచురాళ్ల చప్పుడు, గోదురు కప్పలు అరిచే సవ్వడితప్ప మరే శబ్దమూ వినిపించటల్లేదు.

ఆ కటికచీకటిలో, ఆ నిశ్శబ్ద వాతావరణంలో నడుస్తున్నది ఒకే ఒక వ్యక్తి హెడ్ కాన్‌సేబులు నాయుడు.

టక్ టక్ మని బూటుచప్పుడు చేసుకుంటూ నడుస్తున్న నాయుడు, చేతిలో లాఠీని ఠీవిగా పట్టుకుని నడుస్తున్న నాయుడు, ఆ నిశీథంలో నీడలా కదిలిపోతున్న నాయుడు ఏదో ఆలోచిస్తున్నాడు పరధ్యాసగా.

నలభయి అయిదేళ్ళ వయస్సు నాయుడిది. ఈ నలభయి అయిదేళ్ళ వయస్సులోనూ భయం ఎరుగని జీవితం నాయుడిది. పోలీసుగా అడుగుపెట్టి నప్పట్నుంచీ ఎంతమందో దొంగల్ని పట్టుకుని, అధిక శ్రమలకోర్చి గట్టిపడిన శరీరం నాయుడిది. ఒక్క లాఠీ కర్రతో పదిమంది శత్రువుల్ని గడగడలాడించిన మనసైర్థ్యం నాయుడిది.

అర్ధరాత్రివరకూ ఊరంతా తిరిగి, ప్రతివీధి గాలించిగాని యింటికిపోడు నాయుడు. అలా జరిగితేగాని అతనికి తృప్తిగా వుండదు. తను జీతం పుచ్చుకుంటున్నాడు కాబట్టి ఏదో వృత్తిధర్మంగా తన విధి నిర్వర్తించుకోవటం నాయుడి అభిమతం కాదు. తనకు యిష్టం అని తోచింది చేయటం అతని అభిమతం.

తన సిబ్బందిలోకల్లా ఉద్యోగధర్మం తెలిసిన వాడు, నమ్మకస్థుడు అని పేరుపడినవాడు నాయుడు. పోలీసు కాన్‌స్టేబులుగా ప్రవేశించిన యీ పాతికేళ్ల కాలంలోను హెడ్డుకావటం తప్పితే అంతకంటే పైకి పోలేకపోయాడు. దానికి కారణం అతని ఉద్యోగ నిర్వహణా, పనితనమూ ఏమాత్రం కాదు. పోతే వ్యక్తిగతంగా అనేక కారణాలు వుండవచ్చు.

నేరస్థుల్ని పట్టుకోవటంలో అతను ప్రాణానికి భయపడకుండా ధైర్యంగా నిల్చున్న సందర్భాలు, కత్తిపోట్లుతిన్న సమయాలు, తన్ను చూసిందే శత్రువులు గడగడలాడిన పరిస్థితులూ అతని గడచిన జీవితంలో అనేకం.

నడుస్తున్నాడు నాయుడు. ఆలోచించుకుంటూ నడుస్తున్నాడు. వెలుగుతున్న దీపాలక్రిందకి వచ్చేసరికి అతని నడకలోని ఠీవి, ముఖంలోని అప్రమత్తతా అంత స్పష్టంగా కాకపోయినా అస్పష్టంగానైనా కనిపిస్తున్నాయి.

నడుస్తున్న నాయుడు హఠాత్తుగా నిలబడిపోయాడు. దూరంగా గందరగోళం, కేకలూ వినిపిస్తున్నాయి. ఆ గోలవినే కాబోలు రోడ్డు కిరుప్రక్కలా ఉన్న యిళ్ళలోనూ, మేడల్లోనూ కూడా కొంచెం కొంచెంగా సంచలనం ప్రారంభమైంది. నాయుడు నిలబడి తన దృష్టి అందినంతదూరం చూశాడు. దూరంగా వెలిగిన దీపాలూ ఆ కాంతిలో పరిగెత్తుతున్న మనుషులూ అస్పష్టంగా కనిపిస్తున్నారు. నాయుడిలో ఉత్సాహం పొంగిపొర్లింది. చేతిలోని లాఠీని ఒకసారి గట్టిగా ఝూడించాడు. ఇటువంటిసమయాల్లో అతనికి వినిపించేది సాధారణంగా ఒకేకేక.—"దొంగ—"

పరిగెత్తుకు ముందుకు పోదామా అనుకున్నాడు నాయుడు. గందరగోళమూ, అరుపులూ తననే సమీపిస్తున్నాయి. నాయుడు ఉత్సాహంగా నిల్చుని నిటారుగా చూశాడు. సమీపంలో అడుగుల చప్పుడు జోరుగా వినిపిస్తున్నది. నాయుడు చప్పున ఒక

మూలకు ఒదిగి నిల్చున్నాడు. పరిగెత్తుతున్న అడుగుల చప్పుడు అంతకంతకూ సమీపిస్తున్నది. నాయుడికి ఆచీకటిలో పరిగెత్తుకువస్తున్న ఒక నీడమాత్రం కనిపించింది. సమయంచూసి మీద పడటానికి సిద్ధపడుతున్నాడు నాయుడు. వెనక అరుపులు దగ్గరగా వినిపిస్తూనే వున్నాయి. మేడలమీద వెలుగుతున్న దీపాల వల్ల వీధికూడా చాలావరకూ కాంతివంతం అవుతూంది.

"దొంగ...దొంగా...పట్టుకో"

తనదగ్గరగా వచ్చిన సమయం చూసి ఒక్క ఉదుటున మీద పడ్డాడు నాయుడు. ఆ ఊపుకి యిద్దరూ క్రింద పడ్డారు. బలమైన నాయుడి ం క్రింద ఒక మానవ శరీరం గిజగిజ కొట్టుకుంటున్నది. నాయుడు అట్టహాసంచేస్తూ క్రిందపడిన వ్యక్తిని కదలనీయకుండా ఉండేందుకు ప్రయత్నం చేస్తున్నాడు.

"నన్నొదులు. ఎందుకు పట్టుకుంటావు?" ఒణుకు, పౌరుషం కూడుకున్న గొంతుతో క్రింద పడిన మనిషి అంటూ యింకా వదిలించుకునేందుకు ప్రయత్నిస్తూనే వున్నాడు.

"హుఁ! నిన్నే నావదిలేది. దొంగవి." నాయుడు ఆ మనిషిని కదలనియ్యటంలేదు. ఆ మనిషి చేతిలోని మూట ప్రక్కకు ఎప్పుడో పడిపోయింది. పరిగెత్తుకొస్తున్న జనం చాలావరకూ సమీపించారు. ఇంకో నిమిషంలో...

"అబ్బా" అని క్రిందకు తూలాడు నాయుడు. చేతిపట్టు ఎలాగో వదిలించుకున్న దొంగ తనకత్తిని నాయుడిగుండెకే గురిచేశాడు. కాని చీకట్లో అది అతనిబుజాన్నిమాత్రం గాయపరిచింది. నాయుడు వెంటనే సర్దుకున్నాడు. కోపంతో బుసలు కొడూ "ఫుండాఖోర్. నన్నే" అంటూ బలంకొద్దీ వ దవడమీద యిష్టం వచ్చినట్లు కొట్టాడు. వాడు ఒళ్ళు కదిలేందుకుకూడా సందియ్యలేదు. వాడు ఎలాగో సర్దుకునేలోపలే జనంవచ్చి మీద పడ్డారు.

నాయుడు నిల్చున్నాడు రొప్పుతూ. అతని ఎడంభుజంమీద చొక్కా రక్తంతో తడిసిపోయింది. బాధతో ఆ గాయంమీద కుడిచెయ్యి పెట్టుకుని గట్టిగా హత్తుకున్నాడు.

ఆజనంలో ఒక్కడూ నాయుడ్నిగాని, అతనికి పట్టిన అవస్థగాని చూసే స్థితిలో లేరు. వాళ్ళంతా దొంగని చితగ్గొట్టటంలోనూ, పోయినసొమ్మును తీసుకుని చూసుకోవటంలోనూ నిమగ్నులయిపోయారు.

ఇష్టమైనవాళ్లు నోటికొచ్చినట్లు బండబూతులు తిడుతున్నారు దొంగని. మరి కొంచం సాహసం గలవాళ్లు శక్తికొద్దీ అతడిమీద తమ ప్రతాపం చూపిస్తున్నారు. ఇన్ని చేస్తున్నా వాడు నోరువిప్పి 'అమ్మా' అనిగాని, బూతులు తిట్టటంగాని చేయలేదు. వాడి నోట్లోంచి, ముక్కుల్లోంచి రక్తం ప్రవాహంగా కారిపోతుంది.

నాయుడు కొంచం తేరుకున్నాడు యీలోపల. దొంగ వాడ్ని యిలా బాధపెడుతున్నందుకు కష్టం కలిగింది. వారిద్దామని జనాన్ని తోసుకుని ముందుకుపోయి వాడి కెదురుగుండా నిల్చున్నాడు. అతని నోట్లోంచి ఏదో మాట బయటపడే పూర్వమే ఎవరో ఫోకస్ చేసిన టార్చిలైటు కాంతి యించుమించుగా యిద్దరి ముఖంమీదా పడింది.

ఆ కాస్త కాంతిలో వాడి ముఖంచూసి చూడటంతోనే [illegible]పడ్డాడు నాయుడు. అతని తలమీద పిడుగు పడ్డట్లయింది. తన వంకే తెల్లబోయి ఆశ్చర్యంగా చూస్తున్న వాడి చూపుల్ని తప్పించుకుని గిరుక్కున వెనక్కి తిరిగాడు. అతని తల తిరుగుతోంది. ఆ గడబిడ వాతావరణంలో ఒక్క నిమిషం ఉండలేకపోయాడు. భారంగా అడుగులు వేసుకుంటూ ఒకచేత్తో బుజాన్ని పట్టుకుని నడవసాగాడు.

నాయుడి గుండె దడదడ కొట్టుకోసాగింది. ఏమిటి చేయట మిప్పుడు? ఏం జరిగిపోయింది? ఈ పరిస్థితిని ఎలా తప్పించుకోవటం?

ఇంటికిచేరి తలుపు తట్టేలోపున అంతకంటే ఆలోచించుకునేందుకు అతనికి శక్తిలేకపోయింది. అతనిభార్య అలివేలు వచ్చి తలుపుతీసింది. తీస్తూనే రక్తం చూసి "అమ్మో అమ్మో, ఏమిటది?" అన్నది కంగారుపడుతూ. "ఏం లేదులేవే" అంటూ మెల్లిగా లోపలకువచ్చి, గోడకు చారగిలబడి కూలబడ్డాడు నాయుడు.

అలివేలు కంగారుపడినా, గుండె బాదుకుని ఏడవవలసిన పరిస్థితి ఏర్పడలేదు. కాపురంలో కాలు పెట్టినప్పట్నుంచి యిటువంటి అనుభవాలు అప్పుడప్పుడూ ఎదురవుతూనే వచ్చాయి ఆమెకు. "ముత్యాలూ. వసేయ్ ముత్యాలూ" అని పిల్చింది.

లోపల పడుకున్న ముత్యాలు బద్ధకంగా కళ్లు నులుపుకుంటూ వచ్చి "ఏమిటే?" అని అడిగింది.

గోడకి జారగిలబడ్డ నాయుడు ముత్యాలువంక జాలిగా చూశాడు. అతను ఏదో మాట్లాడబోయే లోపతే అలివేలు "చెంబుతో నీళ్ళు తీసుకురామ్మా" ఈయనగారు ఎక్కడో కత్తిదెబ్బ తినివచ్చారు" అన్నది. ముత్యాలు కంగారుగా నీళ్లు తేవటానికి లోపలకు వెళ్లింది.

తన భుజం చన్నీళ్ళతో కడిగి కట్టు కట్టించుకుంటున్నంత వరకూ నాయుడు ఏమీ మాట్లాడలేక పోయాడు. అసలు విషయం ఎలా చెప్పటమో అతనికి అంతుపట్టలేదు.

బుజానికి కట్టుగట్టి ముడివేస్తూ "ఎంత దెబ్బ? ఇంతకీ ఆ వెధవ దొరికాడా? దొంగ చచ్చినాడు ఎంతపని చేశాడు? వాణ్ణేం చెయ్యకుండానే వూరుకున్నావా?" అనడిగింది అలివేలు.

"ఊఁ" అని మూలిగాడు నాయుడు. దొంగ చచ్చినోడు ఎవడో తెలిస్తే తనభార్యకి తనమీద యీ మమకారం వుంటుందా?

ఒకమూలగా నిలబడి వున్న ముత్యాలు నిద్ర మత్తుతో ఆవలించింది ఒకసారి. అదిచూసి అలివేలు "నువ్వుపోయి పడుకోవే" అన్నది.

"ఇంకా రాలేదే?"

ముత్యాలన్న యీ మాటను నాయుడి భార్య అర్థం చేసుకుని "తమ్ముడేనా? వస్తాడులే. వాడికీమధ్య తిరగటం బాగా అలవాటయింది" అంది. ముత్యాలు లోపలకు పోబోయింది.

నాయుడు ఒక్కసారిగా ఉలిక్కిపడినట్లయిపోయి "ముత్యం. ఆగు" అన్నాడు. అతని భార్య, ముత్యాలు ఒక్కసారి తెల్లబోయి అతనివంక చూశారు.

"నన్ను ఇంతదెబ్బకొట్టినవాడెవడో తెలుసా?" నాయుడికంఠం హీనస్వరంతో గొణిగింది. ఆడవాళ్లు యిద్దరూ చూడటం తప్పితే మరేం మాట్లాడలేదు.

"ఆదొంగ ఎవరో తెలుసా?"

ఇతనిధోరణి వాళ్ళలో ఎవరికీ అర్థమయి వుండదు. నాయుడి భార్య ఏదో అడగబోయి ఆగిపోయింది.

నాయుడు మెల్లిగా మూలిగాడు. "రాఘవులు ...నీ తమ్ముడు". అలివేలు కుప్పగా కూలిపోయింది. "నా తమ్ముడు. రాఘవులు. దొంగా?" ముత్యాలు ముఖం లవెలబోయింది. చూస్తుండగానే క్రింద వాలిపోయి పెద్దపెట్టున ఏడవసాగింది.

"ఏడ్చేం లాభం? వాడిలా తయారవుతాడని కల్లోకూడా అనుకోలేదు. చెయ్యిదాటిపోయింది. అన్నాడు నాయుడు బాగా వెనక్కి వాలిపోయి. అలివేలు ముఖం కప్పుకుంది. "అయితే...అయితే వాణ్ణేంచేశావు?" అనడిగింది గీరకంఠంతో.

నాయుడు నిట్టూర్చాడు. "ఏంచేస్తాను! ఈపాటికి స్టేషన్‌కు తీసుకుపోయివుంటారు" అన్నాడు.

రెండు నిమిషాలవరకూ ఎవరూ మాట్లాడలేదు. తర్వాత నాయుడే "వాడికీ పాడుబుద్ధి ఎలా పుట్టిందో అర్థంకాలేదు. ఇన్నాళ్లనుంచి బలాదూరు తిరుగుతూంటే యిలాగని ఎప్పుడూ అనుకోలేదు" అన్నాడు విషాదపూరితంగా.

నేలను బడి ఏడుస్తున్న ముత్యాల్ని ఓదార్చేందుకు ఎవరూ ప్రయత్నించలేదు. అకస్మాత్తుగా నాయుడు ఊహించని ప్రశ్న ఎదురయింది "వాణ్ణెందుకు పట్టించావు? నా తమ్ముడిమీద నీకామాత్రం తీపిలేకపోయిందా?" అనడిగింది చటుక్కున అలివేలు చురచుర నాయుడివంక చూస్తూ.

నాయుడు ఉలిక్కిపడ్డాడు. "అదికాదు..." అంటూ యింకేవో చెప్పబోయాడు.

"ఏది కాదు? నీ ఉద్యోగధర్మం అంతా మా తమ్ముడిమీదే వెలగబెట్టేవా? నీకింతకంటే మంచి మార్గం దొరకలేదూ? బావమరిదిని వదిలేస్తే నీ న్యాయమంతా నల్లబొగ్గలై పోతుందనుకున్నావా?" అని అరిచింది అలివేలు.

"నాకు మొదట్లో తెలీదే" అందామనుకున్నాడు నాయుడు. కాని భార్య అన్న మాటలకి కోపం ముంచుకువచ్చింది. వాడు పట్టె దొంగ వెధవయి ఊరుకున్నప్పుడు తను వాడిని వదిలిపెట్టి తప్పు చేయాల్సిన అవసరం ఏం పట్టింది? అయినా బావమరిది కదా అన్న మమకారంచేత దొంగతనాన్ని హరిస్తాడా?

"అవును. వాడు నీ తమ్ముడయితే ఎందుకని వొదిలిపెట్టాలి? దొంగతనం చేసింతర్వాత శిక్ష అనుభవించాల్సిందే" అన్నాడు గట్టిగా అరుస్తూ.

అలివేలుకు కూడా కోపం పెల్లుబికింది. కోపంలో యింగితజ్ఞానం కూడా మర్చిపోయింది. "వాడసలు ఎలా విరగడయిపోతాడా అనేగా యిన్నాళ్ళనుంచీ నీయావ. అమ్మా, నాన్నా చచ్చిపోయి నాదగ్గరవుంటున్నాడనేగా నీ దుగ్ధ? ఆ పగని యివాళ్టికి తీర్చుకున్నావు. వాడంటే నీ కెప్పుడు మంటే" అని తన ఆవేశాన్నంతా వెళ్ళగ్రక్కుకుంది.

నాయుడికి తల తిరిగింది. తను రాఘవులిపైన యింతవరకూ ఎటువంటి ద్వేషం పెట్టుకోలేదు. అసలు వాడింట్లో వుంటున్నందుకు ద్వేషం పెట్టుకోవాలా, యిష్టంగా వుండాలా అన్న సందేహమే రాలేదు యింతవరకూ.

"ఇంక నీకళ్లు చల్లబడ్డాయా? వాడప్పుడే యింటికిరావటం యిష్టంలేదుగా, వాడిమీద నేరాన్ని బాగామోపి అప్పుడే రాకుండా చెయ్యి. అలా చూస్తావేం? నీకేం అక్కర్లేదుగా. నీ ఉద్యోగం నీకుంటే చాలుగా"

"నోర్ముయ్" అని గదిమాడు నాయుడు.

అలివేలు పిచ్చిదైపోయింది. తల్లిదండ్రులు పోయినప్పట్నుంచీ తనే అన్నీ అయి పెంచిన తమ్ముడు మీది ప్రేమ యిప్పుడు భర్తమీద ఆవేశంగా పరిణమించింది.

"మూసుకుంటాను. నువ్వు చేసేదంతా చూస్తూ నోర్మూసుకుని ఊరుకోవాలేం? ఇంకేం? ఇన్నాళ్ళనుంచి ఎదురుచూస్తుంటివిగా పెద్ద పదవికోసం. ఇక వస్తుందిలే మా ప్రాణాల ఉసురుపోసుకుని" అని నోటికొచ్చినట్లు వదరింది.

భార్యను జుట్టుపట్టుకు యీడ్చి క్రింద పడేసి చచ్చేటట్లు కొడదామన్నంత కోపం వచ్చింది నాయుడికి. కాని పరిస్థితికి లొంగిపోయి తన కోపాన్ని దిగమ్రింగుకుని ఊరుకున్నాడు.

ఆరాత్రంతా ముత్యాలు క్రిందపడి అవమానంతోనూ, బాధతోనూ, దుఃఖంతోనూ ఏడుస్తూనే వుంది. అలివేలు తిట్లు, శాపనార్థాలు పెడుతూ మధ్యమధ్య తనూ ఏడుస్తూనేవుంది. నాయుడు కదలక మెదలక అలా శిలావిగ్రహంలాగా కూర్చునే వున్నాడు.

తెల్లవారింది.

నాయుడు యింట్లో ఎవరితోనూ మాట్లాడలేదు. ముఖం కడుక్కొని, బట్టలు వేసుకుని, ఏడయ్యేటప్పటికి డాక్టరు దగ్గరకుపోయి భుజంమీద గాయానికి డ్రెస్సింగు చేయించుకున్న తర్వాత, దారిలో కాఫీతాగి పోలీసు స్టేషన్‌కి పోయాడు. గేటుదగ్గిరే ఎదురయ్యాడు బీటు కానిస్టేబులు సూటయిరవు డు. అతనికన్నా నాయుడు హోదాలో కొంచం పెద్దే అయినా చనువునుబట్టి అతను మామూలుగానే మాట్లాడుతాడు.

"రాత్రి బలే కేసుపట్టావే. నీ దెబ్బే చెపుతుందిలే నిజాన్ని. ప్రమోషన్‌వస్తే మా మొహం చూడవు కాబోలు" అన్నాడు పరిహాసంగా.

నాయుడడిగాడు: "నేనే అని ఎవరు చెప్పారు?"

"అక్కడున్న వాళ్లెవళ్లో చూశాగంటలే, సబ్ యిన్‌స్పెక్టరు నీకోసం ఎదురుచూస్తున్నాడు. పోయిరా" అన్నాడతను.

నాయుడు కంఠస్వరం కొంచం తగ్గించి "కాజేసిన మొత్తం ఎంత ఏమిటి?" అని అడిగాడు.

అతను కొద్దిగానవ్వి. నీకేమీ తెలియదేమిటి? అవున్లే. దెబ్బతినంగానే వెళ్ళిపోయినట్టున్నావు. నగా నట్రా అంతా కలిపి అయిదు వేలు చిల్లరవుంటుందిట. సరే వెళ్లు లోపలికి" అంటూ బయటకు వెళ్ళిపోయాడు.

నాయుడు ఇన్‌స్పెక్టరుముందుకుపోయి జరిగింది జరిగినట్టు చెప్పక తప్పలేదు. అసలు ఏవిషయమైనా దాచుదామనికూడా అతని ఉద్దేశం కాదు. అతను తన బావమరిదనికూడా ఒప్పుకున్నాడు. తనకు తగిలిన కత్తిదెబ్బ సంగతి రహస్యంగా ఉంచుదామని ప్రయత్నించాడుగాని ఒప్పుకోక తప్పలేదు. అంతా విని ఇన్‌స్పెక్టరు "బలేవాడివి నాయుడూ" అని పొగడ్తపారేశాడు.

ఆతర్వాత నాయుడు జైల్లోఉన్న రాఘవుల్ని చూడటానికి పోయాడు. చేతనవుతే నాలుగు హితోపదేశాలుకూడా చేద్దామని అతని ఉద్దేశం. అతను వెళ్లేటప్పటికి రాఘవులు ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. రాత్రి తగిలిన దెబ్బల ఫలితమేమో కట్టుకున్న బట్టలు అక్కడక్కడ చిరిగిపోయి, ముఖమంతా ఉబ్బరించిపోయి వుంది.

"రాఘవులూ" అని పిలిచాడు నాయుడు.

రాఘవులు తలత్రిప్పి యితని వైపు చూశాడు. నిద్ర లేకపోవటంచేతనో, లేక కోపంచేతనో కాని అతని కళ్లు ఎర్రగా మండిపోతున్నాయి.

"ఇలా ఎందుకు చేశావు రాఘవులూ?"

"నాయిష్టం" అన్నాడు రాఘవులు కోపంగా. "నాయిష్టం వచ్చినట్లు నేను చేసుకుంటాను. అడిగేందుకు నువ్వెవడివి?"

నాయుడు కొంచంగా తెల్లబోయాడు. తనను చూసి సిగ్గుతో కుమిలిపోతాడేమో ననుకున్నాడు. పశ్చాత్తాపం అతన్ని దహించివేస్తుందేమో అనుకున్నాడు. కాని అలా ఏమీ జరగకపోగా తనమీదే కోపం చూపిస్తున్నాడు?

అతను వెంటనే కోపం తెచ్చుకోలేదు. "ఇంతగా ఎలా మారిపోయావు రాఘవులూ? నువ్వీ స్థితిలోకి వస్తావని కల్లోకూడా అనుకోకపోయానే" అన్నాడు.

రాఘవులు యితనివంక మింగేసేటట్లు చూశాడు. అతని కళ్ళలో క్రోధం ఉట్టిపడుతూంది. "నే నెలా మారిపోతే నీకేం? నీపని నువ్వు చేసుకున్నావుగా. నీ చేతుల్తో నువ్వే పట్టించావుగా! ఇంక నీ ప్రాణం సుఖంగా వుందా?" అన్నాడు.

నాయుడికి యీమాటలు వింటే కొంచం అసహ్యం కలిగింది. "ఏడిశావు. ఇంకా పైగా దబాయిస్తావేం? నీమూలాన నలుగురిలో నా పరువుకూడా పోయింది" అన్నాడు, కడుపులోంచి పెల్లుబికిన ఉద్వేగం అణుచుకోలేక.

ఇక రాఘవులి నోటికి హద్దులేకపోయింది. "నా మూలాన నీ పరువు పోయిందిగా. నేను లేకపోతే పరువు బాగా వుంటుందికదూ" అన్నాడు. "నీ చేతుల్తో నువ్వు పట్టియిచ్చావు. దీనికితగ్గ ప్రతిఫలం నా చేతుల్లోనే అనుభవిస్తావు" అంటూ బుసలు కొట్టాడు.

నాయుడు ఏదో మాట్లాడబోయాడు.

"నాముందు నోరెత్తవద్దు. నీ సంగతంతా తెలుసు నాకు. నువ్వుచేసిన పనికి బావమని వూరుకుంటా ననుకుంటున్నావు కాబోలు. నే నెప్పటికయినా విడుదలై నా చేతుల్తో నీ పీక కసితీరా పిసికి చంపుతాను. పో! నా ముందునుంచి వెళ్ళిపో" అని అరిచాడు రాఘవులు, నాయుడుమాటకి సందివ్వకుండానే.

నాయుడు అక్కడో క్షణం ఉండలేకపోయాడు. గిరుక్కున వెనక్కి తిరిగాడు. తన డ్యూటీ చేసుకునేందుకు పోతూ "ఇన్స్పెక్టరుగారికి తప్ప యింకెవరికీ వీడు నా బావమరిదని యింతవరకూ తెలీదు. ఇక కొద్ది సేపట్లో అందరికీ తెలిసిపోతుంది" అనుకున్నాడు.

తన యింటికి పోవల్సిన టైము అయినా నాయుడికి పో బుద్ధిపుట్టలేదు. అయినా తప్పదు కాబట్టి బయలుదేరాడు. దారిలో యిందాక యిన్స్పెక్టరు తనతో అన్నమాటని నెమరువేసుకుని నవ్వుకున్నాడు. నీకీ దెబ్బతో ప్రమోషన్ రావచ్చు నాయుడూ".

నాయుడిని యింట్లో ఎవ్వరూ తలెత్తి చూడలేదు. అతను మాట్లాడకుండా బట్టలు మార్చుకున్నాడు. పీటమీద కూర్చున్న తర్వాత అలివేలు మాట్లాడకుండా యింత వడ్డించిపోయింది. నాయుడు తలవంచుకుని అయిదునిమిషాల్లో తినటం ముగించాడు. తర్వాత అతను లేచివచ్చి పడకుర్చీదగ్గరకుపోతుంటే ముత్యాలు కనిపించింది ఒకమూలపడుకుని. నాయుడు ఏమనుకున్నాడో గాని ఆమె దగ్గరగాపోయి "ముత్యాలమ్మా" అని పిలిచాడు.

ముత్యాలు అతనివంక చూడలేదు.

"అన్నం తిన్నావా ముత్యాలమ్మా?"

తల అటువైపు త్రిప్పుకుంది ముత్యాలు. నాయుడు హతాశుడై నిశ్శబ్దంగాపోయి పడకుర్చీలో కూలబడ్డాడు. "నిజంగా నేను తప్పు చేశానా? లేకపోతే వీళ్ళందరూ నాతో ఎందుకని మాట్లాడరు?" అనుకున్నాడు చుట్ట ముట్టించుకుంటూ.

నాయుడు ఆ సాయంత్రం, మరునాడుకూడా తన డ్యూటీమీద పోయి వచ్చాడు. ఒక్కసారిమాత్రం తిరిగి రాఘవుల్ని పలకరించటానికి ప్రయత్నించాడు. రాఘవులు యితని మాటలు వినకుండానే అక్కడికి నుంచి కదిలేదాకా విదిలించి కొట్టాడు. అతనికి యింటికి వద్దామన్నా భయం పుట్టసాగింది. భార్య అలివేలు నోటిగుండా ఏమాట వచ్చినా తనగురించే అవుతూ వచ్చింది. "నీకు హృదయం లేదు. రాక్షసుడివి" అంది ఒకరోజు.

"నిజంగానా? నే నంత క్రూరుడనా? నాకు హృదయంలేదా?" అనుకున్నాడు నాయుడు.

ఇంట్లో యిలా వుండటంవల్ల అతనికి మనశ్శాంతి కూడా దూరమైంది. తన కుటుంబంలోని వాళ్లే తన శత్రువులు అని తలుచుకున్నప్పుడు అతని హృదయం ఝల్లుమనేది. ఇందరికీ తను విరోధి కావ

టానికి కారణం ఏమిటి? తనకు హృదయం లేక పోవటమా? తను ఘోరమైన తప్పు చేయటమా?

నాయుడికి ఎక్కడికిపోయినా, ఏంచేసినా ఒకటే ప్రశ్న ఎదురయ్యేది. తను తప్పు చేస్తున్నాడా?

ఈ ప్రశ్నకు నాయుడు మొదట్లో సమాధానం చెప్పుకున్నాడు. తప్పు చెయ్యలేదని, తన ధర్మం తను నెరవేర్చుకున్నాడని. కాని రానురానూ నికి అనుమానం పుట్టసాగింది తను తప్పుచేశాడేమోనని.

ప్రతిక్షణం అతన్ని అనుమానం వేధించసాగింది. బయటికి వెళ్తే దహించివేస్తున్న ఆలోచన్లు. ఇంట్లో నిత్యసమరం. ఒకటి రెండుసార్లు రాఘవుల్ని పలకరించబోతే తనకు జరిగిన అవమానం.

"నే నెప్పుడైనా విడుదల కానియ్యి. నిన్ను పీక పిసిగి చంపుతాను చూడు."

తనని చూస్తూ రాఘవులు పళ్లు కొరుకుతూ అనేమాట అతని తలలో గిర్రున తిరిగేది. నిజంగా తన మీద రాఘవులు అంతగా మండిపడి పోతున్నాడా?

దాదాపు తనతో పరిచయం ఉన్నవాళ్లందరికీ తెలిసింది రాఘవులు తన బావమరిదేనని. ఒక బిరుదుకూడా తగిలించారు స్నేహితులు తనికి—'పులి వంటివాడు' అని. ఆమాట విని నిర్జీవంగా నవ్వుకునేవాడు నాయుడు. "మనుషుల ప్రకృతులింత విభిన్నంగా ఎందుకుఉంటాయి? అందరూ ఒకే దృక్పథం మీద నడిస్తే ప్రపంచమే తల్లక్రిందు లవుతుందా?" అనుకునేవాడు.

ఆరోజు సాయంత్రం యింటినుంచి బయటకి పోబోతున్నాడు నాయుడు. అలివేలు ఏమనుకున్నదో వచ్చి అతన్ని అటకాయించింది.

"ఇదిగో నిన్నే. నువ్వు మనిషి వేనా?" అన్నది గట్టిగా.

"నిజమే. నేను మనిషి నేనా?" అని ప్రశ్నించుకున్నాడు నాయుడు తనని తాను.

"మాట్లాడకుండా అలా గుడ్లగూబలా చూస్తావేం?" అంది అలివేలు.

"ఏం మాట్లాడను?" అనుకున్నాడు నాయుడు.

"నీకు సిగ్గులేదూ?"

నాయుడు మాట్లాడలేదు,

"నీకు పౌరుషంలేదూ?"

నాయుడు నోరు మెదపలేదు.

నాయుడి మౌనంచూసి అలివేలుకు చి[illegible]లు వచ్చింది. "ఎన్నన్నా బదులు చెప్పవేం? మా[illegible]సం అంత లెక్కలేకుండా పోయాయా? అది పచ్చి మాపి నీళ్లు ముట్టుకోకుండా అఘోరించిపోతుంటే నీకు విప్పి లేదనుకున్నావా? అది తిండిలేక చచ్చిపోతే ఆ వుసురు ఎవరికి తగుల్తుందో తెలుసా? రేపు రక్తం మీద బనాయించిన కేసును గట్టిపరిచి శిక్ష ఎవగా వేయిద్దామనే ఆలోచనతోనే సతమతమవుపోతున్నావా?" అంతకంతకూ ఆమె కంఠ స్వరం హెచ్చుస్థాయిని అందుకుని చివరికి ఏడుపులో దిగింది.

"మాఅవస్థ చూస్తూ నీకు జాలి కలగదేం? మేమిద్దరం యిలా అరిచి అరిచి చచ్చిపోవటం నీకిష్టమేనా? నీదారిన నువ్వు యిలా తిరగటం న్యాయమేనా?" అనడిగింది ఏడుస్తూ.

నాయుడు దిగ్భ్రాంతుడై నిలబడిపోయాడు.

"ఇదిగో. నీకిదే చెప్పటం. ఏవన్నా చెయ్యి. నా తమ్ముడు ఆ యినుపకడ్డీల వెనక బ్రతకటం నేను సహించలేను. నిన్నా మొన్నా పోయి చూసొచ్చినప్పుడు వాడిస్థితి చూసి గుండె నీరయిపోయింది. నా తమ్ముడ్ని నాకు తెచ్చిపెట్టు. ఇక్కడుండటం నీకంత కష్టంగావుంటే యిక్కడ్నుంచి వెళ్ళిపోతాం. ఏమూరుమూలో బ్రతుకుతాం"

నాయుడు చలించిపోతున్నాడు.

అలివేలు తిరిగి రెట్టించింది. "చెప్పవేం? నా తమ్ముడ్ని నాకు తీసుకురావా? నీకళ్ళముందే మేము చచ్చిపోవాలని వుందా? ఇదిగో ఈ కత్తిపీట. దీంతో నామెడ తెగనరుకు. లేకపోతే నే నేనరుక్కుంటాను" అంటూ ఆమె కత్తిపీట తెచ్చి అతని కెదురుగా నిలబడ్డది. నాయుడిగుండె దడదడ లాడిపోయింది. అక్కడ ఒక క్షణం నిలబడలేకపోయాడు. గిరుక్కున తిరిగి గుమ్మం దిగి బయటకు వెళ్ళిపోయాడు.

ఆలోచనలతో అతని బుర్ర తిరిగిపోతూంది. వీధిమలుపు తిరిగేటప్పటికి కానిస్టేబులు ఒకడు ఎదురై సెల్యూటు చేశాడు.

"ఏమిటి?" అని అడిగాడు నాయుడు.

"ఇన్‌స్పెక్టరుగారు ఒకసారి మిమ్మల్ని పిల్చుకు రమ్మన్నారండి." నాయుడు ఆ కానిస్టేబులుతో

కలిసి స్టేషన్‌కి పోయాడు. ఇతను వెళ్ళేటప్పటికి ఇన్‌స్పెక్టరు ఎదురుచూస్తూ కూర్చున్నాడు.

"ఏమిటి సార్?" అనడిగాడు నాయుడు.

"జైలు వార్డన్ అకస్మాత్తుగా సెలవు పెట్టాడు. నిన్ను టెంపరరీగా వార్డెన్‌గా నియమించాలని సూపరింటెండెంట్ గారు ఫోన్‌లో చెప్పారు" అన్నాడు ఇన్‌స్పెక్టరు.

సరేనన్నాడు నాయుడు.

అతనికీవార్త ఎక్కువ ఆశ్చర్యంకూడా కల్గించలేదు. కాని తాళం చెవులగుత్తి అతని కందిస్తున్నప్పుడు చేతులు కంపించాయి.

నాయుడు ఆరోజు యింటికి పోదల్చుకోలేదు. చీకటి పడేదాకా అక్కడా యిక్కడా గడిపి తర్వాత హోటలుకుపోయి భోజనం చేశాడు. ఈ కొద్ది రోజుల్లోనూ అతని ముఖంలోకూడా తీవ్రమైన మార్పు వచ్చింది. ముఖం చాలావరకూ పీక్కుపోయి దవడలు కొంచం లోపలికి పోయాయి. మనిషి కొంచం నీరసించాడు.

నాయుడు భోజనం ముగించి చేతులు కడుక్కుంటూ అనుకున్నాడు; "రాఘవులికి శిక్ష ఏ మాత్రం తక్కువపడేందుకు అవకాశం లేదు. ఇంకో నాలుగు రోజుల్లో వాడి కేసు కోర్టులోకికూడా ప్రవేశించబోతూంది" అని.

తర్వాత స్టేషన్‌కు వచ్చాడు. ఆకాశమంతా మేఘావృత్తమై వుంది. అప్పుడప్పుడూ బ్రహ్మప్రళయంగా ఉరుములు ఉరుముతున్నై. దట్టంగా వ్యాపించిఉన్న చీకటిని ఒక్కొక్క క్షణంసేపు కాంతివంతంచేస్తూ మెరుపులు మెరుస్తున్నై.

నాయుడు ప్రకృతిని పరికించేస్థితిలో లేడు. ఒక్కొక్క సెల్ దగ్గరకుపోయి ఖైదీలని పలకరించి పోతున్నాడు. రాఘవులున్న సెల్ దగ్గరకు పోయేటప్పటికి అతని వళ్ళు జలదరించింది. ఆ చిమ్మచీకటిలో రాఘవు ఏంచేస్తున్నాడో చూడాలని ప్రయత్నించాడు. అతను వున్న కొట్లో ఏమాత్రం అలికిడి అవటంలేదు. మెరుపు మెరిసినప్పుడు చటుక్కున చూసి "నిద్రపోతున్నాడప్పుడే" అనుకున్నాడు.

పదయ్యేటప్పటికి బాగా గాలిరేగి గాలితో వానకూడా పెద్దపెట్టున కురవసాగింది. స్టేషన్ చాలావరకూ నిశ్శబ్దంగా వుంది. సెంట్రీ డ్యూటీలో ఉన్న పోలీసు గంటలు కొట్టివచ్చి వానలో ఏం చెయ్యటానికీ పాలుపోక మండువాలో దుప్పటి కప్పుకుని ఒకమూల కూచున్నాడు.

నాయుడు వానపడకుండా ఒకమూల నిల్చుని వున్నాడు. సెంట్రీ మూలకూచోవటం అతనికి తెలుసు. అయినా ఏమీ అనకుండా వూరుకున్నాడు. స్టేషన్‌లో ఖైదీలతో సహా అంతా నిద్రపోతున్నట్టుగా వున్నారు.

నాయుడు వెచ్చదనానికి చుట్ట ముట్టించి గట్టిగా పీలవసాగాడు. ఏంచేసేటట్టిప్పుడు? పడుకుని నిద్రపోవటమేనా తనపని?

తను బయల్దేరినప్పుడు యింట్లో భార్య అన్న మాటలన్నీ గుర్తుకొచ్చాయి అంటే ఆమె ఉద్దేశం వాణ్ణి...ఆ రాఘవుల్ని...విడిపించమనా:

నాయుడు కంపించాడు. గాలి విసురుకి వాన జల్లువచ్చి మీద పడుతున్నది. ప్రక్కకి తప్పుకుని నిల్చున్నాడు.

తను మంచివాడు కావాలి. భార్య దృష్టిలో, ముత్యాలు దృష్టిలో, రాఘవులు దృష్టిలో మంచి వాడు కావాలి. అంటే రాఘవుల్ని దొంగచాటుగా విడిపించాలి.

నాయుడి శరీరం గగుర్పొడిచింది. కల్లోకూడా వూహించని ఆలోచన, తన వ్యక్తిత్వాన్ని పరిహసించే ఆలోచన యిప్పుడెందుకు రావాలి? తన పాతికేళ్ళ అనుభవం యిటువంటి పని ఒకటయినా, ఒక్కరి చేతయినా వేలు పెట్టి చూపించుకునే విధంగా చేశాడా? అలా చెయ్యటం తనకు చేతవునా? ఒక్కనాడయినా తప్పుచేశాడా?

ఉలిక్కిపడ్డాడు ఒక్కసారిగా. తను యిప్పుడు చేసిందేమిటి? రాఘవుల్ని బంధించటం అనేమాటకు అర్థమేమిటి? భార్య తనను ప్రతిక్షణం ఏవగించుకుంటున్నదెందుకు? తన మనసు మనసులో లేకుండా, శాంతి లేకుండా, లోపల ఏమూలో బాధ పెకలించుకు వస్తున్నదెందుకు?

తను తప్పుచేశాడు.

అవును. రాఘవులు తనకు కావల్సినవాడు. భార్య తమ్ముడు. అతన్ని బంధించటం క్షమించకూడని తప్పు.

ఈ తప్పుకు ప్రాయశ్చిత్తం చేసుకోవాలంటే ఏంచెయ్యటం? నాయుడు తనని తాను గట్టిగా

ప్రశ్నించుకున్నాడు. ఎన్నివిధాల ఆలోచించినా, ఎన్నివిధాల కాదనుకున్నా ఒక్కటే జవాబు లభించింది. రాఘవుల్ని విడిపించటం.

అతని గుండె దడదడ కొట్టుకుంది. రాఘవుల్ని విడిపించటమా? సామాన్య కార్యమా అది? తర్వాత తానేమయి పోతాడు? తన ఉద్యోగం ఏమయి పోతుంది? తన స్థితి ఏవిధంగా మారిపోతుంది?

పెళ్లుమని వీచిన గాలికి నాయుడు నిలుచున్న గోడదగ్గిర కిటికీ తలుపులు విడిపోయి పెద్దగా శబ్దం చేశాయి.

ఒక్కక్షణం నాయుడు తెల్లబోయి తిరిగి ఊహాప్రపంచంలో పడ్డాడు. ఆ తర్వాత తను ఏమయినా అయిపోనీ! అదే తను చేసినతప్పుకు ప్రాయశ్చిత్తం. తను రాఘవుల్ని విడిపించి తీరాలి. కుటుంబం దృష్టిలో మంచివాడు అనిపించుకోవాలి

నాయుడు తేరుకుని ఒకసారి నలువైపులా చూశాడు. మెల్లగా అడుగులు వేసుకుంటూపోయి మూల నక్కి పడుకున్న సెంట్రీవద్దకుపోయి పరిశీలించాడు. అతను గాఢంగా నిద్రపోతున్నట్లు తేలింది. నాయుడిలో యుక్తాయుక్త జ్ఞానం నశించిపోయింది. నిమ్మదిగా అడుగులు వేసుకుంటూ రాఘవులున్న సెల్ వైపు నడిచాడు.

నేలమీద ప్రవహిస్తున్న నీటిలో అతను ఎంత నిమ్మదిగా నడుస్తున్నా చప్పుడు అవుతూనే వుంది. రాఘవులున్న దగ్గిరకి పోయే కొద్దిసేపట్లోనే అతను చాలావరకూ తడిసిపోయాడు.

చీకట్లో తడుముకుంటూపోయి కటకటాల తలుపుదగ్గరకుపోయి నిలిచాడు నాయుడు. రాఘవులు మెలకువగా వున్నాడేమోనని ఒక్క నిమిషం ఆగాడు. ఎటువంటి చప్పుడూ లేకపోయేటప్పటికి జేబులోంచి తాళం చెవులగుత్తి బయటకి తీశాడు. అతని చెయ్యి అపరిమితంగా వణికిపోయింది

“నేను తప్పు చేస్తున్నానా?” అనుకున్నాడు నాయుడు. అటువంటిస్థితిలోకూడా యీ ప్రశ్నకి ఒక్కసారిగా నవ్వు వచ్చింది.

తప్పు—ఏది తప్పు? రాఘవుల్ని బంధించటం తప్పా? విడిపించటంతప్పా? ఏదిచేస్తే ప్రపంచం తన్ను మెచ్చుతుంది? ఏదిచేస్తే కుటుంబం తనని మెచ్చుతుంది?

తప్పుకీ, ఒప్పుకీ మధ్య తేడాని ఆలోచించే వ్యవధి లేదు నాయుడికి. చటుక్కున తాళం తీసి వేశాడు.

ఎలా రాఘవులికి తెలియజెప్పటం? అతనిని పేరుపెట్టి పిలిచే ధైర్యం తనకు లేదు. ఏమీ తోచక తాళాన్ని యినుప కటకటాలకి వేసి గట్టిగా కొట్టాడు. రాఘవులు మేలుకొంటున్నట్లు అనుమానం కల్గగానే ఛివాలున ఒక అడుగు యివతలికి వేసి గబగబ వానలో తడుస్తూ ప్రహరీ గోడదగ్గరకు పోయి నిలబడ్డాడు. రాఘవులు తప్పించుకు పారిపోతాడు. అంతవరకూ నిశ్చయం. వాడు పారిపోయేముందు తను ఆపి ఒక్కసారి మనసారా క్షమాపణ చెప్పుకోవాలి. తర్వాత తను ఏమయినా అయిపోతాడు. రాఘవులు, తనభార్య ఒక్కసారి తనను మంచివాడు అనుకుంటే చాలు.

తన నెవరూ పరికించటం లేదుగదా అనుకున్నాడు నాయుడు. ఆ చీకట్లోనే చుట్టూ చూడటానికి ప్రయత్నించాడు. వాన పడుతున్న చప్పుడు తప్ప యింకేం వినిపించటం లేదు.

నాయుడు వానలో తడిసిపోతూ నిల్చున్నాడు. నీటిలో ఎవరో మెల్లిగా అడుగులు వేస్తున్నట్లు అతనికి అస్పష్టంగా వినిపించింది. తననితాను సంబాళించుకుని జాగ్రత్తగా వినసాగాడు. అడుగుల చప్పుడు అంతకంతకూ సమీపించసాగింది.

నాయుడు ఆ చీకట్లో నడుస్తున్న వ్యక్తిని చూడటానికి ప్రయత్నంచేశాడు.

ఒక మానవశరీరం అతన్ని యించుమించు రాసుకుంటూపోయి ప్రహరీ గోడని ఎక్కటానికి ప్రయత్నిస్తున్నది. నాయుడు తడుముకుంటూ పోయి ఆ వ్యక్తి భుజంమీద చెయ్యివేశాడు. ఆవ్యక్తి త్రుళ్ళిపడి యిటువైపు తిరిగినట్టుగా తోచింది నాయుడికి.

అదే సమయానికి కళ్ళు మిరుమిట్లు గొల్పుతూ పెద్ద మెరుపొకటి మెరిసింది నాయుడికి ఆ వ్యక్తి ముఖం బాగా కనిపించింది.

“రాఘవులూ” అన్నాడు వణుకుతున్న గొంతుతో.

“నువ్వేనా? నువ్వా? నన్ను మళ్లీ పట్టుకుందామని వచ్చావా? తిరిగి నన్ను పట్టుకుందామనే?” రాఘవులు కఠినంగా పలుకుతూ నాయుడి కంఠంమీద చెయ్యివేసి బలం కొద్దీ నొక్కి వేయసాగాడు.

నాయుడు వదిలించుకునేందుకు ప్రయత్నం చెయ్యలేదు. పీక నొక్కుకుపోతూంటేగా, ఉక్కిరి బిక్కిరి అయిపోతూంటేగా, అతి కష్టంమీద గొంతు పెగల్చుకుని "నా తప్పు...నాతప్పు..." అంటూ అస్పష్టంగా గొణిగాడు.

నాయుడి గొంతు రాఘవులి చేతుల్లో మెలికలు తిరిగిపోయింది. ఆఖరిసారిగా అన్నమాట లవే ఒక్క రక్తపుచుక్క అతని నోటిని పెల్లగించుకుని బయటికి వచ్చింది.

రాఘవులు నాయుడి శరీరాన్ని వదిలివేశాడు. దబ్బుమని క్రిందపడిపోయింది. తర్వాత ఒక గొడ్డు గాలులు మూలిగి ప్రహారీగోడ దూకి బయటి చీకట్లో కలిసిపోయాడు.

నాయుడి శరీరం ఆ చీకటి అడుగున మాయమయిపోతూ, వానకి తడుస్తూ అలానే వుండిపోయింది అతని నోట్లోంచి బయటికి చిమ్మిన ఒక్క రక్తపు బొట్టూ, కురుస్తున్న వానలో ఎప్పుడో కలిసిపోయింది.

# జలద మార్గము

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

కాంత కళికాంతర సి
తాంత భృంగీగణము
కుంతలంబును* జూడవోయీ!
భూకాంత
కుంతలోపమ దేశమోయీ!
రతికాంత
కాంతా నఖాంతర్గతాంతా హతమ్ములై—ది
గంతాల కొకనాడు కమ్మపూలు మ్రోసె!
కుంతలంబును జూడవోయీ!
భూకాంత
కుంతలోపమ దేశమోయీ!

కన్నడపు పడతుకల
గరువంపు చూపులకు
మెఱపునే మఱచిపోయ్యేవూ!
'హంపి' పాలి
మేరలే చుట్టి చుట్టేవూ!
'కొండవీ
డు'న్నదోయీ ముందు నిన్ను నాహ్వానించు
పౌరుషము రూపైన పంటరెడ్లను చూపి
మెఱపునే మఱచిపోయ్యేవూ!
'హంపి' పాలి
మేరలే చుట్టి చుట్టేవూ!—

—'మేఘదూతము' నుండి —

* విజయనగర సామ్రాజ్యమునకు నాడు 'కుంతలదేశ' మని పేరు—'విషయః కుంతలో నామ్నా, భూకాంతాకుంతలోపమః'—(బుక్కరాయలశాసనము)




# లక్స్ టాయ్‌లెట్ సబ్బు
# శరీరమంత సౌందర్యముగానుండుటకు

సౌందర్య విషయమై పెద్ద సమాచారము ఇదిగో! ఇప్పుడు స్నానమునకు వీలుగా ప్రత్యేక సైజులో శుద్ధమైనటువంటియు, తెల్లనైనటువంటియునైన లక్స్ టాయ్‌లెట్ సబ్బును మీరు కొనగలరు! సినీమా తారలు ఎల్లప్పుడు వాడే సువాసన సబ్బే అది—సిల్కువలె మెత్తని నురగతోగూడుకొన్నటువంటియు, ఆకర్షకమైన సువాసనతోగూడుకొన్నటువంటియు నైనదే అది! పెద్ద సైజులోనున్న లక్స్ టాయ్‌లెట్ సబ్బును ఇప్పుడే తెచ్చుకొనండి!

మిక్కిలి తెల్లనైనది. మిక్కిలి శుద్ధమైనది. మిక్కిలి సువాసనైనది

LTS. 424-X52 TL

# వజ్రహస్తుని అరసవల్లి శాసనము

శ్రీ మండ నరసింహము

రాగి కడియముతో గ్రుచ్చబడి రాజముద్రికతో సంధింపబడిన యైదురేకులు గల ఈ దానశాసనము కొలదిదినముల క్రిందట తన యింటికెదురుగా మన్నుకై త్రవ్వుచుండగా ఒక రైతునకు దొరికినది. దీని నాతడు బజారునకు దీసికొని అమ్ముటకు జూపుచుండగా, శ్రీకాకుళములోని కళాశాల చారిత్రకాధ్యాపకులు శ్రీ పూటకూరు భానుమూర్తి పంతులుగారి కంటబడుటచేత నిది రక్షింపబడినది. వారు దీనికి తగిన మూల్యమిచ్చి తీసుకొని విమర్శార్థము నాకు దయతో నొసంగిరి.

ఈ ప్రాంతమందలి ఆంధ్రదేశ సాంఘిక చరిత్రమును తెలుపుటలో నియ్యది ప్రాముఖ్యమును వహించుచున్నది. వేయి సంవత్సరముల క్రిందటి ఈ గ్రామచరిత్రను—తద్వారా ఆంధ్ర చరిత్రను—వెల్లడిచేయుచున్నది. శాసనమంతయు పురాతనపు నాగరిలిపిలో వ్రాయబడినది. మొదటిరేకుయొక్క ముఖభాగమందు తప్ప మిగిలిన అన్ని ప్రక్కల లిపి కలదు. సాధారణముగా మొదటి రేకుయొక్క ముఖభాగమందును ఆఖరి రేకు వెనుకప్రక్కను వ్రాయుట ఆచారముకాదు. అవి రెండును పుస్తకమున కట్టలవలె నుంచబడును. కాని ఈ శాసనమున ఆఖరి రేకు రెండవ పెడనుగూడ లిపి గలదు. లిపి చెడకుండుటకై రేకుల అంచులు కొంచె మెత్తుగా కొట్టబడినవి. అక్షరములు లోతుగా చెక్కబడినను, బహుకాలము భూమిలో పాతుకు పడియుండుటవలన రేకులందలి లిపి చాల భాగము త్రుప్పుబట్టి చెడినను ముఖ్యవిషయములన్నియు స్పష్టముగా కనబడుచున్నవి. దానకాలము, రాజచరిత్రము, గ్రామనామము మొదలగు ప్రధాన విషయములు త్రుప్పువలన చెడకుండుట అదృష్టమే!

భూగర్భమున బహుకాల ముండుటవలన రేకులన్నియు అర్ధచంద్రాకారముగ వంగినవి. వాని నన్నింటిని తిన్ననజేసి త్రుప్పు మన్ను మొదలగువానిని శుభ్రపరచి కడియమును తెగగొట్టి రేకుల ప్రతిబింబముల తీయించి వాని నీ వ్యాసముతో ప్రచురణార్థము పొందుపరచబడెను. కడియమునందలి రెండు కొనలు రాజముద్రిక చేత సంధింపబడినవి. ఆ రాజముద్రికపై నడుమను వృషభమును—అనగా నందియు—దాని కిరువైపుల చామరము, అంకుశము గలవు. నందికి దిగువ భాగమున నాళముతో గూడిన వికసించిన పద్మమును, ముందుభాగమున సూర్య చంద్రులును ఉబ్బెత్తుగా నుండునటుల పోతపోయబడినది. ఇవన్నియు త్రికళింగాధిపతుల రాజలాంఛనములు. శాసనమందు గూడ నీ రాజలాంఛనములు వివరింపబడినవి. "శంఖ భేరీ పంచమహాశబ్ద ధవలచ్ఛత్ర హేమచామర వర వృషభలాంఛన సముజ్వల సమస్త సామ్రాజ్య మహిమ్నా" మని వర్ణింపబడినవి.

ఈ రాజులు త్రికళింగాధి పతులనియు అనేక సమరసంఘట్టసముపలబ్ధ విజయలక్ష్మీ సమాలింగితోత్తుంగ భుజదండ మండితులనియు చెప్పుకొనుచుండుట యాచారము వీరిది గంగవంశము. ఆత్రేయ గోత్రము. మతమున వీరు పరమశైవులు.

కళింగ మేలిన రాజులలో 'గాంగ' వంశపు రాజులు కొందరును 'గంగ' వంశపువారు కొందరును గలరు వంశనామములో విశేష భేదము గానరాకున్నను వారి కాలములను చెప్పుకొనుటలో మిక్కిలి వ్యత్యాసము కలదు.

పురాతన కాలమునుండి కళింగమేలిన రాజులు గాంగవంశమువారని చెప్పుకొనుచుండ తరువాతివారు గంగవంశమునకు చెందినవారమని చెప్పుకొనుచున్నారు. మొదటికోవవారు వారివారి దానాదికములను వివరించుటలో "గాంగవంశ ప్రవర్ధమాన నిజరాజ్య సంవత్స"రములని గాంగశకమును వాడుచుండ వెనుకటివారు శాలివాహన శకాబ్దముల మాసపక్ష తిథి వార నక్షత్రలగ్నములతో దానాదికములను వివరించుచుండిరి. ఈ వెనుకటివారిలో మొదటివాడు గుణవర్మ లేక గుణమహార్ణవ మహారాజు. పూర్వగాంగ వంశశకము హస్తివర్మతో నారంభమైనట్లూహింప

వచ్చును కాబట్టి గాంగశకము క్రీ. వె. 390 ఆ ప్రాంతమున నారంభింపబడియుండును. ఈ వంశములో నాఖరువాడు దేవేంద్రవర్మ. అతడు క్రీ. వె 890 ప్రాంతమున నున్నట్లు చరిత్ర చెప్పుచున్నది. ఆ వెంటనే తరువాతి గంగవంశమువారు ఏలుబడి ప్రారంభించిరి. బహుశా మొదటివారును, ఆ తరువాతి వారును ఒక్క వంశమువారే అయియుండవచ్చును కాలమును వివరించుటలోను, వంశావళిని పేర్కొనుటలోను, వీరు నూతనమార్గ మవలంబించి యుండ వచ్చును. ఈ తరువాతి వంశమువారు ఇంగ్లీషువారి పరిపాలనము ఈ ప్రాంతమున ప్రబలువరకు కళింగము నేలుచుండిరి. హిందూదేశమందలి మరి యే రాజ వంశముగాని తెంపులేకుండ ఇంతకాలము పరిపాలించుట గానరాదు. దక్షిణదేశమున పల్లవులు, చోళులు, చాలుక్యులు రాష్ట్రకూటులు కేరళ పాండ్యవంశము వారు ఇంక మరెన్నెన్నియో రాజవంశములు పుట్టి గిట్టినవి కాని కళింగ గంగవంశపు రాజులవలె తెంపులేకుండ 15, 16 వందల సంవత్సరము లేలుట హిందూ దేశమందే గాదు, యావత్ప్రపంచమున కూడ గానము కళింగరాజ్యమందిది యొక విశేషము !

ఈ శాసనము అరసవల్లిలోనుండిన కాయస్థ కులజుల కనేకులకు నీయబడినది అరసవెల్లి గ్రామ మంతయు వేర్వేరు భాగములుగా జీల్చబడి ఈ కాయస్థ కులస్థులలో స్త్రీపురుషులకు పంచివేయబడినది. అరసవెల్లి గ్రామమున దరిదాపు వేయి సంవత్సరముల క్రిందట ఈ గ్రామమునిండ కాయస్థులుండగా ప్రస్తుత కాలమున నీకులమువా డొక్కడైన గానరాకుండుట వింతగానున్నది. అరసవెల్లికి సమీపమందలి ముఖలింగమను గ్రామమున ముఖలింగేశ్వరాలయములో నొక శిలాశాసనమున అరసవిల్లి కాయస్థులకు ముఖ్యస్థానమనియు నక్కడి యీ కులజులలో నొకనికి కొన్ని సత్కృతులు జరిగెననియు వ్రాయబడి యున్నది. ప్రస్తుతకాలమున కాయస్థకులమువారు బెంగాల్ బీహార్ రాజ్యముల విరివిగా నున్నారు. వీరిలో ననేకులు ప్రపంచ విఖ్యాతిగన్న పురుషులు గూడ గలరు. ఆంధ్రదేశమందలి కాయస్థులేమైరి? ఈజాతివా రందరును, నశించిరనిగాని దేశమునుండి బెంగాల్ బీహార్ ప్రాంతములకు వెడలగొట్టబడిరని భావించుట యసంగతము. వీరలే శిష్టకరణములని లేక సృష్టికరణములనిగాని వ్యవహరింపబడుచుండిరని కొందరు భావించుచున్నారు.

కాయస్థులు కాశ్యప మొదలగు బ్రాహ్మణ గోత్రములనుండి యుత్పన్నమైనట్లు ఈ శాసనము చెప్పుచున్నది. ప్రస్తుత మీ ప్రాంతమందలి శిష్టకరణ జాతివారు యజ్ఞోపవీతముల ధరించి కొన్నికొన్ని బ్రాహ్మణాచారములను చాలభాగము తదితరాచారములను అవలంబించుచున్నారు. ఈ జాతివారందరు సాధారణముగ విద్యావంతులై పల్లె గ్రామముల నుపాధ్యాయులుగనో గ్రామ కరణములుగనో లేక గ్రామాగులందు రైతుల వ్యాపారముల పరిష్కరించి దస్తావేజులు, కౌలు కవిపాలు మొదలగు వ్రాత పనులలోనో యుండి జీవనము గౌరవముగ గడుపుచుందురు. వీరి బాలురు చిన్ననాటే ఆంధ్రము, అమరము, ఆంధ్రపంచకావ్యములు చదువుకొని సంస్కృత కావ్యములు అభ్యసించి భాషలందు ప్రవేశము గడింతురు. ఈ జాతివారు బ్రహ్మక్షత్రియులకన్న దిగువగను వైశ్యులకన్న నెక్కుడుగను భావించుకొనుచుందురు ఈ శిష్టకరణ జాతివారు ప్రస్తుత శ్రీకాకుళ విశాఖజిల్లాలలో విశేషముగ నున్నారు. నాటి కాయస్థులు ఈనాడు కరణములుగా వ్యవహరింపబడుచుండుట సమంజసముగ నూహాయోగ్యముగ నున్నది. కాని వంశనామ మెందుకు మార్చుకొనవలసివచ్చినదో తెలియరాకున్నది. శాసనములందు కాయస్థులకు ముఖ్యస్థానము శ్రీకాకుళ ప్రాంతమని చెప్పబడియే యున్నది వీరి వంశోత్పత్తి కొంతవరకు ప్రస్తుత శాసనమందు చెప్పబడియే యున్నది. వీరు బ్రాహ్మణ గోత్రోత్పన్నులు. అనగా బ్రాహ్మణపురుషులకు క్షత్రియాది స్త్రీలవలన జనించిన సంతానము కావచ్చును ఈ శాసనములో 'కశ్యపగోత్రోత్పన్న' అని కొందరిని, 'శివవంశోద్భవ' అని కొందరిని పేర్కొనబడినది. ఇందు "ఉత్పన్న" "ఉద్భవ" అను పదములు వేర్వేరు అర్థముల వాడబడినట్లు కనబడుచున్నది. 'గోత్రోత్పన్న' అనగా యా గోత్రీకులచే పుట్టింపబడిన అనుటను, 'గోత్రోద్భవ' 'వంశోద్భవ' అనుటలో స్వచ్ఛమైన వంశీకులనియు దోచవచ్చును. దీనివలన కాశ్యప గోత్రోత్పన్నులగు కాయస్థులు బ్రాహ్మణులకు తదితర స్త్రీలవలన జనించినవారనియు కాశ్యప వంశోద్భవు లనగా స్వచ్ఛముగ నౌరస జాతులనియు దెలియవచ్చుచున్నది.

ఈ కాయస్థులలో నియోగముగూడ కలదు. ఈ పదమున కర్థము స్పష్టముగా తెలియదు గాని కొంత వరకు నూహించుట కవకాశమున్నది. ఈ శాసనమున (1) ఉత్తర నియోగ (2) అత్యుత్తర నియోగ (3) ఛత్ర నియోగ (4) పుండ్ర నియోగ (5) గోవడి నియోగ (6) చంద్రాదిత్య నియోగ (7) రట్టడి

నియోగ (8) పాంచాల నియోగ అని పలువిధముల నియోగములు చెల్పబడినవి. నియోగమనగా ప్రత్యేకమైన యేర్పాటు. శాసనకాలమున ఈ నియోగము లే యర్థమున వాడబడినవో తెలియబడకున్నది. వజ్రహస్త మహారాజు అరసవల్లి గ్రామమును నలువదియేబది భాగములుగా విభజించి స్త్రీ పురుషులకు పంచిపెట్టెను. ఈ కాయస్థ స్త్రీ పురుషులలో ప్రత్యేక ప్రజ్ఞావిశేషములు గాని శాస్త్రవిజ్ఞానము గాని కనబడుట లేదు. వారి జీవనముకొరకే ఈ దాన మీయబడినది. ప్రతి గ్రహీతలు బ్రాహ్మణులు మాత్రము కారు. వారందరును కాయస్థులు, శూద్రకులతుల్యులు. దానము నియోగింపబడిన స్త్రీలకుగూడ నీయబడుటచేత ఈ నియోగ స్త్రీలు బహుశ స్వైరవృత్తిని జీవించువారేమో యని యూహ కలుగుచున్నది. విద్వాంసు లింకను దీనిని విమర్శించిన గాని 'నియోగ' శబ్దమున కర్థము స్పష్టము గాదు

ఈ శాసనములో కొందరు పురుషుల నామముల చివరను గౌరవ సూచక పదములుగూడ చేర్పబడినవి. బ్రాహ్మణులలో పంతులు, శాస్త్రి, అవధాని, ఆచారి, శర్మ మొదలగు పదముల చేర్చుచున్నట్లే, ఆ కాలమున నాయక అని పురుషులకును, నాయకి యని స్త్రీలకును, మరికొందరకు రట్టడియనియు పదములు చేర్చబడినవి. నాయక, నాయకి శబ్దము లీ కాలమున, నాయుడు, నాయురాలు లేక నాయకి అని వ్యవహారము, కాని రట్టడిపదమున కర్థము స్పష్టముగా తెలదు. రాష్ట్రకూటశబ్దవికృతి రట్టడి యనియు రెడ్డియనియు కొందరి యభిప్రాయము. రట్టడి శబ్దము సైనికుడను నర్థమున వ్యవహరించబడుట గూడ కలదు. ఈ శాసనమున 1 మావిరట్టడి 2 కవిపాఖ్య రట్టడి 3 ఖిండన రట్టడి 4 మాడిరట్టడి 5 దుగ్గన రట్టడి ఇట్లు కొందరు రట్టడులకు గూడ దానమీయబడినది. వీరందరును కాయస్థులే. అందుచేత వీరు రాష్ట్రకూటస్థులనిగాని రెడ్డివంశస్థులనిగాని చెప్పుటకు వలులేదు. ఈ రట్టడి పదము గౌరవవాచక మగుటచేత సైనికుడనియు సిపాయిఅనియు అర్థము చెప్ప వచ్చును.

ఈ రాజశాసనమున దానము పొందినవారి నామములుకూడ చిత్రముగా నున్నవి. ఈ కాలపు శూద్రవంశీయుల పేర్లకు విభిన్నముగా కూడ నున్నవి. ఉదాహరణమునకు శాసనమందలి పురుషుల నామములు కొన్ని ఈ క్రింద చూపబడినవి:—

పురుషులు:— దాలము పిగ్గడ, పిండనాయక, వెజ్జిమ, మేడమ, పోత, నట్టుప, శిరిపనాయక, వజ్జ

స్త్రీలు :— మువనక, సుంకమనాయకి, పుండి, పాంచాలి.

మచ్చునకు కొన్నిమాత్రమే చూపబడినవి. దానమును పొందు స్త్రీ పురుషుల చెప్పునపుడు వారి వారి తలిదండ్రుల నామములుగూడ పేర్కొనబడుట యొక విశేషము. ప్రస్తుతకాలమున తండ్రి పేరొక్కటియే చెప్పుట ఆచారము.

ఈ శాసనమున మరియొక విశేషము కనబడుచున్నది. రాజగు వజ్రహస్తుడే కాయస్థులకు దానమొసంగుటలో తృప్తినందక వాని భార్యగూడ కొందరికి దానములిచ్చి సన్మానించెను. వజ్రహస్తుని దేవి నామము చెప్పబడినదిగాని యా భాగము త్రుప్పుచేత మిక్కిలి చెడిపోవుటచేత చదువుటకు వీలులేకపోయినది. ఆమె పేరు తెలిసికొనుటకు ఇతర చారిత్రకాధారములుగూడ లేవు. ఇంతవరకు దొరకలేదు. ఈ రాజుల దానశాసనములందు సంధివిగ్రహ అను మంత్రి పేరు, శాసనమును లిఖించినవాని పేరు, శాసన గ్రంథమును వ్రాసిన కవిపేరు కూడ చెప్పుకొనుట యొక యాచారము. ఇందవేవియు గానరావు. కార్తికశుద్ధ ద్వాదశినాడీ శాసన మొసగబడినది. ఆ దినము ఆంధ్రదేశమున క్షీరాబ్ధిద్వాదశి, చిలుకద్వాదశి అను నామముల బరగుచున్నది. ఎంతకాలము నుండియో తెలియదుకాని అరసవెల్లిలో క్షీరాబ్ధి ద్వాదశీవ్రతము ఇచ్చటి సూర్యదేవుని యాలయమున జరుపబడుచునే యున్నది. ఆదినమున దేవుని ఉత్సవ విగ్రహములను ఒక తెప్పపైనుంచి సూర్యగుండమున తెప్ప ఉత్సవము జరుగుచునేయున్నది. శాసనమందు ఈ సూర్యదేవాలయముగాని ఆ యుత్సవప్రసక్తిగాని గానరాదు. ఒక్కటిమాత్రము నిశ్చయము. సూర్యదేవాలయము ఈ రాజుకాలమునకు కొన్ని వందల సంవత్సరములకు పూర్వమే ప్రతిష్ఠింపబడియుండెను. ఆ దేవాలయ ప్రసక్తి లేకపోవుట యొక విశేషము.

శాసనమందలి రాజవంశము విపులముగా పద్య గద్యాత్మకముగా చక్కని రసవంతమగు కవితలో అలంకార సహితముగా వర్ణింపబడినది. ఆ కాలము

కళింగరాజ్యమున సంస్కృతభాషయందు చక్కని రసవంతమగు కవిత్వము చెప్పగల కవులు కలరని స్పష్టమగుచున్నది. రాజవంశము క్రీ. శ. 390 ప్రాంతము నుండి తెంపులేక వచ్చుచున్నదని యిదివరకే చెప్పబడినది. ఈ శాసనకర్త వజ్రహస్తుడు తరువాతి గంగ వంశమునకు చెందినవాడు. ఈ వంశమునకు మూల పురుషుడు గుణమహార్ణవ మహారాజు. ఈతడు త్రికళింగాధిపతి. వీనికి వజ్రహస్తుడు కొడుకు. ఈతడు 44 సం॥లు రాజ్యమేలిన తర్వాత వాని కొడుకు గుండమ రాజు మూడేండ్లు పాలించెను. ఆ తర్వాత వాని తమ్ముడు కామార్ణవుడు యిరువదియైదేండ్లును తరువాత వాని తమ్ముడు వినయాదిత్యుడు మూడేండ్లును పాలించిరి. ఆ తర్వాత కామార్ణవుని కొడుకు వజ్రహస్తుడు 35 సం॥ ఏలెను వాని పెద్దకొడుకు కామార్ణవుడు అర్ధసంవత్సరమేలినపిదప వాని తమ్ముడు గుండమరాజు మూడేండ్లును వాని సవతితల్లి కొడుకు మధుకామార్ణవుడు 19 సం॥లును ఏలిరి ఆ తర్వాత వజ్రహస్తుని పెద్దకొడుకు కామార్ణవునకును వాని భార్య వినయమహాదేవికిని జనించిన (3వ) వజ్రహస్తుడు శకాబ్దము 960 లో పట్టాభిషేకమంది రాజ్యమేలుచుండెను. అతని పాలనమున ప్రజలు సుఖముగ నుండిరి.

ఈ మూడవ వజ్రహస్తుడు కళింగనగరమున—అనగా ముఖలింగమను రాజధానిలో సమస్త మంత్రులను గ్రామాదులందలి నాయకులను సమావేశపరచి అరసవెల్లి గ్రామదానమును వారలకు వ్యక్తపరచెను. ఈ దానము శకాబ్దములు 982 వ కార్తీకశుద్ధ ద్వాదశి నాడు జరిగినది. కార్తికశుద్ధ ద్వాదశినాడు క్షీరాబ్ధి ద్వాదశీవ్రత దినము. అరసవెల్లిగ్రామమనేక భాగములుగ విభజించి కాయస్థకులజులకు పంచిపెట్టబడెను. ఈ దానములో వజ్రహస్తుని దేవికి కూడ భాగము కలదు. ఆమెకూడ కొందరకు అరసవెల్లి గ్రామములోని కొన్ని భాగముల దానముచేసెను. ఈ రాజదంపతులకు అరసవెల్లి గ్రామమందలి కాయస్థకులజులపై యిట్టి యనురాగము కలుగుటకు కారణము విశదపరచలేదు.

ఈ వజ్రహస్తదేవ మహారాజు శకాబ్దము 982 వ సం॥న కార్తీక శుద్ధ తృతీయనాడు—అనగా ఈ అరసవెల్లి దానమున కెనిమిది దినములకు పూర్వము మరియొక దానము చేసియుండెను. ఈ శాసనము చికాకోలవలసలో దొరికినది. అది 'భారతి' 2 వ సంపుటములో శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి వలన ప్రకటింపబడినది. ఇందు కుద్దమాఖ్య గ్రామము (ఉర్లాం గ్రామమునకు సమీపమున) ఒక వైశ్యునకు ఉదకపూర్వకముగా దానమీయబడినది. ఈ గ్రామము కోలువర్తనీ విషయములోనిది. అదే సంవత్సరమున నదే విషయములో బొద్దుపాడు గ్రామమున దొరికిన శాసనమున అవలింగి అను గ్రామమును జలేశ్వర స్వామికి దానము చేయబడినది. అది విశ్వబ్రాహ్మణులకు దానము చేయబడినది. ఈ దానము ఉత్తరాయణ పుణ్యకాలమున నీయబడినది ఈ యరసవెల్లి దానము ఈ రెండు దానములకు నడిమిది. ఈ మూడు దానములుగూడ బ్రాహ్మణేతరులకే నీయబడినవి. ప్రస్తుతపు శాసనముతో కలిపి మూడు తామ్రశాసనములే ఈ వజ్రహస్తునివి యింతవరకు బయలుపడినవి. ఈ మూడు శాసనములబట్టి చూడగ నీ వజ్రహస్తుడు బ్రాహ్మణాధిక్యము నంగీకరించక సర్వమానవుల నొకే విధముగ జూచు నుదారస్వభావము గలవాడని స్పష్టపడుచున్నది.

ఈ శాసన మైదురాగిరేకులపై చెక్కబడినది. మొత్తము 75 పంక్తులు కలవు. భాషయంతయు సంస్కృతము. లేఖకదోషము లరుదు. గ్రంథమంతయు పురాతనపు నాగరలిపిని వ్రాయబడినది. 'న' 'ల' 'ప' అక్షరములు వ్రాయుటలో రెండు విధములగు లిపులు వాడబడినవి. కవిత్వము నిర్దుష్టమై రసవంతమై వ్యాకరణసమన్వితమై పురాతన సంస్కృత కవుల పోకడను నడచుచున్నది.

గంగవంశపు రాజులలో వజ్రహస్త నామధారులలో నీతడు మూడవవాడగుటచేత చరిత్రకారులీతని మూడవ వజ్రహస్తుడని చెప్పవచ్చును. ఈతడు తన యేలుబడి 22 వ సం॥ న 'కర, వసు, నిధి' సంజ్ఞవలన తెలియబడు శకాబ్దమున—అనగా 982 ల సం॥ న కార్తిక శుద్ధ ద్వాదశినాడు అరసవెల్లి గ్రామమును కొంతమంది కాయస్థ స్త్రీ పురుషులకు దానము చేసెను. ఈ గ్రామము శాసనమున 'హరిసవిల్లి' అని వ్రాయబడినది. ఇది వరాహవర్తని విషయములోనిది. పూర్వకాలమున శ్రీకాకుళ ప్రాంతము వరాహవర్తని యని చెప్పబడుచుండెను. ఈ గ్రామ మిప్పుడు 'అరసవెల్లి' అని పిలువబడుచున్నది. ఈ తామ్రశాసన మీ గ్రామముననే లభించుట యొక విశేషము.

# రాజవంశము

గుణమహార్ణవ మహారాజు. క్రీ. శ. 895.

|

వజ్రహస్తుడు 44 సం.

గుండమరాజు 3 సం. కామార్ణవుడు 35 సం. వినయాదిత్యుడు 3 సం.

|

వజ్రహస్తుడు 35

కామార్ణవుడు ½ సం. గుండమరాజు 3 సం. మధు కామార్ణవుడు 19 సం.
ఒ వినయమహాదేవి (వైదుంబాన్వయము)

స్తు. శా॥శక 960 లో పట్టాభిషేకము. = క్రీ. శ 1038
మే నెల 3 వ తేది రాత్రి 8-27 గం.లకు.
[వీని దానకాలము శా. శక 982 కార్తిక శుద్ధద్వాదశి సోమవారం= క్రీ. శ. 1060]

## శాసనము

## 1 వ రేకు - 2 వ



పం_క్తి

1. ఓం...స్వస్తిశ్రీమతా మఖిలభువన వినుత నయ (వినయ దయాదాన దాక్షిణ్య
2. సత్య) శౌచస్థైర్య్యాది గుణరత్న పవిత్రకాణామాత్రే (య)గోత్రాణాం విమలవిచారాచారపు
3. ణ్య సలిలప్రక్షాలిత కలికాల కల్మషమషీణా(మ్మహే) మహేన్ద్రాచల శిఖరప్రతి
4. ష్ఠితస్య సచరాచరగురోః సకల(భు)వన నిమ్మాణైక సూత్రధారస్య శశా

ప.రా. కుండలీకరణములలోని భాగములు పూరింపబడినవి.

5. జ్జ చూడామణేర్భగవతో గోకర్ణ్ణస్వామినః ప్రసాదాత్సమాసాదితైక శ(ంఖ)శ్శేరీ
6. పఞ్చమహాశబ్ద ధవలచ్ఛత్ర హేమచామరవర వృషభలాఞ్ఛన సముజ్వల సము
7. స్త సామ్రాజ్య మహిమ్నా మనేక సమరసఙ్ఘట్ట సముపలబ్ధ విజయలక్ష్మీ సమా
8. లిఙ్గితోత్తుఙ్గ భుజదణ్డమణ్డితానాం త్రికలిఙ్గ మహీభుజాం గఙ్గానా

## 2 వ రేకు - 1 వ పెడ



1. మన్వయ మలఙ్కరిష్ణోర్విష్ణోరివ స్వవిక్రమాక్రాన్త ధరామణ్డలస్యగుణ
2. మహార్ణ్ణవ మహారాజస్యపుత్రః॥ పూర్వ్వేషాం భూపతిభి ర్వ్విభజ్య వసుధా
3. యాపఞ్చభిః పఞ్చధా భుక్త్వా భూరి పరాక్రమో భుజబలాత్తామేక ఏవ స్వ
4. యం ఏకీకృత్య విజిత్యశత్రునివహాన్ శ్రీవజ్రహస్త శ్చతుశ్చత్వారి
5. మత మత్యుదారచరితః సర్వ్వాన్ సమరక్షుత్సమాః॥ తస్య తనయో గు
6. ణ్డమ రాజావర్షత్రయ మపాలయత్ మహీం॥ తదనుజః కామార్ణ్ణవ దే
7. వః పఞ్చత్రింశతమబ్దకాన్॥ తస్యానుజో వినయాదిత్య స్సమాస్త్రిసః॥ త
8. తః కామార్ణ్ణవాజ్జాతో జగతీ కల్పభూరుహః యోరాజ ద్రాజితః శ్రామో
9. వజ్రహస్తోవనీపతిః॥ ప్రశ్నోద్దన్యవగర్వ లుబ్ధమధుప వ్యాలీఢగణ్డా

## 2 వ రేకు - 2 వ పెడ



1. గ్గజాన్నర్థిభ్యః సమదాత్సహస్రముఖులోయస్త్యాగి నామగ్రణీః సః శ్రీమానని
2. యఙ్కభీమ నృపతిర్గఙ్గాన్వయోత్తంసకః పఞ్చత్రింశతమబ్దకాన్సమభున
3. క్ప్రృథ్వీంస్తుతః పార్థివైః॥ తదగ్రసూనుః సురరాజసూనునా సమస్తమస్త్రాంశే
4. మితారిమణ్డలః స్వపాతి కామార్ణవ భూపతిర్బ్బభూవం సమృద్ధిమాన
5. ర్ద్ధ సమాంసముజ్వలః॥ తదను తదనుజన్మోచిత్త జన్మోపమానో గుణ
6. నిధి రనవద్యో గుణ్డమాఖ్యోమహీశః సకలమిదమరక్షత్త్రీణివర్షా
7. ణి ధాత్రీ వలయమలఘుతేజోనిర్జితారాతిచక్రః॥ తతో ద్వైమాతురస్తస్య మధు
8. కామార్ణవో నృపః అవతి స్మావనీమేతా మబ్దానేకోనవింశతిం॥ అ
9. స వజ్రహస్తనృపతే రగ్రసుతావఖిలగుణి జనాగ్రణి కామార్ణవాత్కవి

## 3 వ రేకు - 1 వ పెడ



1. ద్వి ప్రగీయమానావదాత శుభకీర్త్తేః॥ శ్రియ ఇవ వైదుమ్బాన్వయపయః పయోనిధి
2. సముద్భవాయాశ్చయః సమజని వినయమహాదేవ్యాః శ్రీవజ్రహస్త ఇతితనయః
3. వియద్వసునిధి సంఖ్యాంయాతిశాకాబ్ద స్జైదినకృతి వృషభస్థే రోహిణీభేసు
4. లగ్నే ధనుషిచసితపక్షే సూర్య్యాత్మ వారే తృతీయాంయుజి సకల ధరిత్రీం
5. రక్షితుంమోభిషిక్తః॥ న్యాయేనయత్ర సమనూచరితుంత్రివర్గమార్గే
6. ణ రక్షతిమహీం మహిత ప్రతాపే నిర్వ్యాధయశ్చ నిరపాయశ్చ నిరాపద
7. శ్చ శశ్వత్ప్రజాభువిభవన్తి విభూతిమత్యాః॥ వ్యాప్తేగఙ్గ కులోత్తమస్య యశ
8. సా దిక్చక్రవాలేశశి ప్రద్యోతామలినేన యస్యభువనః ప్రహ్లాద సమ్పాదినః
9. సిన్ధూరై రతిసాన్ద్రపఙ్కపటలైః కుమ్భస్థలీపట్టకేశ్వాలిమ్పన్తి పునః పు

## 3 వ రేకు - 2 వ పెడ



1. నశ్చహరితామాధారణావారణాః॥ అనురాగేణ గుణినో యస్య వక్షోముఖాబ్జ
2. యోః ఆశీ నేత్రీ సరస్వత్యావానుకూలేవిరాజితః॥ కళిఙ్గనగరాత్పరమ మాహేశ్వర
3. పరమభట్టారక మహారాజాధిరాజ త్రికళిఙ్గాధిపతి శ్రీమద్వజ్రహస్త దేవపసలీ
4. సమస్తామాత్య ప్రముఖ జనపదాన్సమాహూయ సమాజ్ఞాపయతి విదితమస్తు భవతాః
5. వరాహవర్తిన్యాం హరిసవిల్లిగ్రామః చతుఃశీమావచ్ఛిన్నః సజలస్థ
6. లః సర్వపీడావివర్జిత మాచన్ద్రార్కక్షితిసమకాలం యావ న్మాతాపిత్రోరాత్మ
7. నః పుణ్యయశోభివృద్ధయే కరవసునిధిశాకాబ్దే కార్తికమాస ప్రథమపక్షద్వాద

## 4 వ రేకు - 1 వ పెడ



1. స్యాం సోమవారే కాశ్యపగోత్రోత్పన్నః కాయస్థవరేష్ఠః మహాప్రదా
2. నేః దాలమపెగ్గడ స్తస్యభార్యాః మవనకనామా తయోః పుత్రోః మం
3. డపనాయకః విద్దామమేడమ పోతమాఖ్యాస్తే స్యోదుహిత రశ్యా తే
4. షాం చతన్నాం ముత్తరనియోగ యమ్ముత్తరనియోగ సమ్మానేకాత్యా
5. మేతద్గ్రామస్య చతుర్భాగాకృతస్యభాగాం న్నామ్మధ్యే ఏ

6. కో భాగః । కాశ్యపగోత్రోత్పన్న కాయస్థః నడుపనాయకః
7. తస్యభార్య్యా పితపా తయోః పుత్రేభ్యః శిరిపయనాయక వజ్జినాయక గ
8. ణ్ణిమనాయక సుంకమనాయకేభ్యః । పుణ్డినియోగ పాంచాలినియోగ
9. ంచ అయంభాగాః ఏకోనవింశతిర్భాగాః కృత్యా తేషభాగేషాంమ

## 4 వ రేకు - 2 వ పెడ



1. ధ్యే వజ్జినాయక గుణ్ణమనాయక సుంకమనాయకేభ్య స్త్రిభ్యః అష్టాదశభా
2. గాః శిరిపయనాయకస్య పుత్రాయ నడుపనాయక ఏకభాగః పువః శూ
3. ద్ర వంశోద్భవ మానిరట్టడిః తస్యభార్య్యా విద్దమ తయోః పుత్రాభ్యాంగణ్ణన ఆ
4. పితనాభ్యాం ఏకభాగః । కవిపయరట్టడిః తస్యభార్య్యా సాయపా త
5. యోః పుత్రాయ చన్దినాప ఏకభాగః విద్దునరట్టడి తస్యభార్య్యా సత్య
6. పాతయోః పుత్రాయ చామినాయ ఏకభాగః మాదిరట్టడి తస్యభా
7. ర్య్యా కిన్దపాతయోః పుత్రాభ్యం మాంకనదుగ్గనాభ్యాం ఏకభాగః దు
8. గ్గనరట్టడిః తస్యభార్య్యా గోవకా తయోః పుత్రాభ్యాం క

## 5 వ రేకు - 1 వ పెడ



1. ట్టనవిద్దనాభ్యాం ఏకభాగః ఏతేభాగాయం నాప్యేకభాగ ఏవ। అయంభాగోపి చోవ
2. డనియోగం చత్వారిదిత్యనియోగించ॥ ఏతేభ్యః ఇతగామ చతుర్భాగాశ్చ సమానమేవ
3. ॥ పునరప్యయంగ్రామః సప్తారహభాగ...భాగేషు మధ్యే॥ కాశ్యపగోత్రోత్ప
4. న్న కాయస్థః చణ్డినాయకః త...పా। తయోర్జాతేభ్యః దామర
5. నాగయక। వేణరాయినాయకౌవజ్జిని...భాగః॥ ఇద్దనారపమతేభ్య
6. ః ప్రదత్తమస్యాభిర్భావి భూమిపాల...మమనమ్త్ర చోరవత్పరిపాలనీయ
7. మితి॥...భిః...మోజస్యసూను నుంకమో నాయక...రీచమనవత్రి కౌ స్తేన ః గ్రామప్ర
8. దానే...తి శ్రీవజ్రహస్తదేవి నామా...మః। అరిసవిల్లిగ్రామః ప్ర
9. తేస్య ప్రదత్తః చతుర్ధభాగమష్టధాకృత్వా ఏతేద్వభాగే కాయస్థనింకపాఖ్య.

## 5 వ రేకు - 2 వ పెఠ



1. స్యపుత్రత్రేకభాగః కాయస్థ వరేశ్వరం సోమనాథాఖ్యస్యపునరేకభా
2. గం కాయస్థ దామరాఖ్యస్య పునరేకభాగం శిలస్థ వంశోద్భ
3. వ చీడనాఖ్యస్య ఏతేషాంరట్టడ వంచాఖ్యే ద్వౌనియోగోభవతి
4. ః। పుణ్డినియోగ పాంచాలి నియోగవతో భద్రినాయకస్య భాగస్య స్వా
5. మినో చిరిపయనాయకో చీడపోతనాయకో అపితమనాయకపుత్రేభ్యం
6. పిన్నమనాయక మావురనాయకాభ్యాం తత్ర భద్రిమనాయక భాగోఅర్ధం ద
7. త్తవంతే॥

కథానిక

# ఆఖరు గుణపాఠం

శ్రీ కొనకళ్ళ వెంకటరత్నం

కెప్టెన్ చంద్రం కెప్టెన్ సూర్యం ఇద్దరూ 'ఛమ్స్'. ఆవేళ కెప్టెన్ చంద్రం మాంచి ఉత్సాహంగా వున్నాడు. 'బేరక్సు'లో కోలాహలంగా వున్నది. స్వదేశంలో అనుసపెట్టిన రాజసమూ, కొన్ని సంవత్సరాల తరవాత ఆగాలి మళ్ళీ కొత్తగా పీల్చుకుంటున్న జైత్రానందమూ, సిపాయిలనందర్నీ కుదిపేస్తోంది. ఇళ్ళకి ఉత్తరాలు తెగగిలికి పారేస్తున్నారు; కవాతుగీతాలు, సైనికపదాలు, గవాయిపాటలు పేలిపోతున్నాయి; కూలిపోతున్నారంతా.

3 వ బెటాలియన్ మెడ్రాసులో 'రెడ్ హిల్స్'కి వచ్చి నాలుగురోజు లయింది.

ఎత్తులు వెయ్యడంలో కెప్టెన్ చంద్రం అందె వేసిన చెయ్యి; ఎంత అసాధ్యమైన కార్యక్రమమైనా సరే అతియుక్తిగా రూపొందించి, ఒడుదుడుకులు లేని దారిని, తప్పిపోడానికి చింతాకైనా సందుదొరకని పంథాలో నడుపుతాడు బండీ; దాని కనువైన అనుచరుల్ని ఎన్నుకుంటాడు కూడా.

సూర్యమూ అంతటివాడే; కాని రవంత స్తబ్ధు. ఏపనీ తానుగా సొంతహా చెయిజేసుకోలేడు. కాని, అంటించి వొదిలిపెడితే మటుకు తారాజువ్వలా తారాపథమందుకుంటాడు. నాలిముచ్చు మన అనుచరుడుగా ఉపక్రమించి, చక్రాన్ని క్రమక్రమేణా చేతుల్లోకి తెచ్చుకుని డైరక్టరయి చక్కా వూరుకుంటాడు—"అమ్మయ్యో అంత పనే?" అని ఎనక్కి లాగుతోనే దిగుతాడు; దిగుతోనే నలుగుర్నీ దింపుతాడు; చివరకి, "ఇంకొంచెం లోతుగా పడితేమటు కేమిటే?" అన్న సాహసాలకి మొగ్గుతాడు.

ఇటీవల కాలేజీ విద్యార్థినులు హావేలీ తోటలో 'పిక్నిక్' చేసుకొంటూవుండగా చెదరగొట్టినప్పుడూ, మొన్నవెన్నెట్లో 'మెరీనా బీచి' వొడ్డున 'బేదింగ్ బ్యూటీ'లమీద సాగించిన దండయాత్రలోనూ ప్రముఖపాత్ర వహించినవాడు కెప్టెన్ సూర్యం. కాని ఎత్తుగడా, నిర్వహణా, ఉపసంహారమూ కెప్టెన్ చంద్రం చేతిలో రూపొందినై.

'కలనల్'కీ 'బ్రిగడియరు'కీ వొకటి తరవాత వొకటి 'కంప్లెయింట్లు' వచ్చినై. ఆఫీసర్లు బెదిరించారు; వార్నింగు లిచ్చారు; కాని కెప్టెన్ చంద్రం లొంగలేదు.

మధ్యాన్నం పనిగట్టుకుని కూచున్నాడు కెప్టెన్ చంద్రం; 'బస్రా'లో 'ఇంఫాల్'లో 'మెసపటోమియా'లో తన కొచ్చిన ఉత్తరాలన్నీ చెత్తకింద పోగుచేశాడు గలీజు ఖాళీచేదామని. తండ్రి వ్రాసిన ఉత్తరం చదివాడు. తండ్రి శతవృద్ధు. తను మూటగడుతున్న పాపాలకీ, తన అత్యాచారాలకీ ఆ ముసలిహృదయం కంపించిపోతోందని అతని కవగాహనయింది. తల పంకించాడు. ఇంకొకటి—భార్య తులసి వ్రాసిన ఉత్తరం. తను చేస్తున్న దారుణాలూ, దురంతాలూ కర్ణాకర్ణిగానూ, మిలిటరీనించి 'డిస్చార్జి' అయిన సిపాయీల ముఖతానూ విని వుంటుంది బహుశా. అంచాతనే ఉత్తరంలో ఆ చల్లని మందలింపు, తన భవిష్యత్తునుగూర్చిన చెప్పలేని ఆవేదన...తరవాత అక్కాయి అనసూయ వ్రాసిన ఉత్తరం...ఆమె కింకా తనమీద అధికారమున్నదనే అనుకొంటోంది. ఇంతమంది అలజడికి కారణమైన తన గాథలు ఉదాత్తమైన అంతస్తులో చూచుకుని మురిశాడు లోలోపల.

వీళ్ళందరూ తన ప్రవర్తనకి ఇంకా అలవాటు పడలేదు పాపం. కొంటెగా లోపల నవ్వుకుని పూరుకున్నాడు. నిజమే మరి—ఎట్లా అర్థమవుతుందీ ఎవరికైనా? మిలిటరీలో చేరని క్రితం తానెంత అదుపులో వుండేవాడో, పరస్త్రీలంటే ఎంత లజ్జించేవాడో, ఈ ప్రపంచంలోవున్న మకిలికి ఎంత దూరంగా, అతీతంగా నడిచేవాడో స్మృతికి తెచ్చుకొన్నాడొక్కసారి. ఆరోజులలో తన ప్రవర్తన దిద్దితీర్చిన హస్తమేదో అతనికి లీలగా గోచరించింది కూడా.

ఇక విసుగు తలకెక్కింది. కట్టకట్టంతా చెత్త కుండీలోకి విసిరిపారేసి పంకా వొదిలి హాయిగా పడుకున్నాడు. ఆనాడు తను పన్నిన వ్యూహానికి చివరి ఘట్టం ఎట్లా నడవాలో ఆలోచన ముగింపుకొచ్చేసరికి గాఢంగా నిద్రపట్టింది.

కెప్టెన్ చంద్రానికి మొరాయించే అందాలంటే మక్కువ ఎక్కువ. పారిపోయే అందాలు, దొరికినా కవుగిట్లో ఇమడని అందాలు, ఇమిడీ గిజగిజ తన్నుకొనే అందాలు, విలవిలలాడి నలుగుడుపడే అందాలు, నలుగుడుపడి తిప్పలుపెట్టే అందాలు, ఎంత లాలించినా, ఎంత బుజ్జగించినా శక్యంకాని అందాలు, ఎంత బెదిరించినా ఎంత వొత్తిడిచేసినా ఎదురుతిరిగే అందాలు, ధిక్కరించే అందాలు, తన బలం కల్పించే అగ్ని శిఖలమీదగాని అలివికిరాని అందాలు, అనుభవానికి తెచ్చుకోవడంలో పదును దేరింది అతని కామదాహం.

అతనికి బాగా గుర్తు. ఏడాదిక్రితం దక్షిణాఫ్రికాలో సైనికస్థావరానికి అల్లంత దూరానవున్న టేకుమాను అడివిలోకి 'జీప్' కారు వేసుకుని వొంటరిగా షికారు వెళ్ళాడొకనాడు. ఆ మొత్తైన పచ్చని కొండలూ, కొండల నంటిపెట్టుకున్న చిక్కని నీడలూ, ఆ నీడలలో అభిసారికలల్లే కిలకిల సాగిపోయే కొండయేళ్లూ, అతని రక్తంలో విపరీతమైన దాహం పుట్టించినయ్. కొండలోయలోనించీ చిన్న సరస్సొకటి తెరచుకుంది. ఆమూల నీటిపక్షుల కోలాహలంమధ్యనించీ బుడబుడమని శబ్దం వినవచ్చింది. కారాపి దిగాడు. దిగి నలువేపులా పరకాయించి చూచాడు. వొడ్డున వొక నల్లరాతిబండమీద నిల్చుని నీళ్లు ముంచుతోంది మిసమిసలు చిమ్మే వొక అందాల రాశి. గులాబీలు చిందిన నీలపురాతి పలకలల్లే సునుపులుదేరిన ఆమె బుగ్గలూ,—బుగ్గలనంటిన బండిగురివెందపువు కేసరాలూ—వయస్సు పొంగులుచిమ్మే వొత్తైన జడా,—జడలో ఎర్రని అడివి 'చెర్రీ బ్లోసం' గుత్తులూ...అతని రక్తంలో వేయికొరడాలొక్కసారి ఛెళ్ళుమన్నాయి. చూడగానే ఎట్లా పసికట్టిందో, కడవ నీళ్లలో వొదిలి, జారే కొండరాళ్ల మీదనించీ తుర్రుమంది. ఆమె 'పీటన్' అనే వొక కొండజాతికన్య. పారిపోతున్న ఆ మొరటు సౌందర్యం బలిసిన టర్కీకోడి వొంపులూ సొంపులూ వొలకబోస్తోంది...రివ్వున కూడాబడ్డాడు. పంతంగా వెంటాడి, వేటాడి కొసకి ఎట్లాగయితేనేం చిక్కని చీకట్లు ముసురుకున్న వేళకి చేజిక్కించుకోగలిగాడామెని. తెచ్చుకుని తన డేరాలో ఆకాళరాత్రి వేళ, కొండవాగుల హోరులో, గింగురుమనే మన్యపు గాలివిసుళ్ళలో ఆ యవ్వనపునిగ్గుని ఆహారంగా కూర్చుకున్నాడు.

ఆ సంఘటన మొదలు అతనిలో వొక విపరీతమైన రాక్షసప్రకృతి ఆవతరించింది.

తరవాత మళ్ళీ 'ఇరాన్' దేశంలో దొరికిం దతనికి అట్లాంటి వేట. 'బస్రా'లో అతని 'రెజిమెంటు' మకాంవేసింది కొన్నాళ్లు. ఒకనాటి షికారులో కాటుకనీడ లలుముకొన్న వొక చక్కని ఖర్జూరపు తోటల గుబురులోనించీ తొంగిచూచాడు. పక్కని, 'టైగ్రిస్' నదిరేవులో వొంటరిగా ఈలపాట పాడుతో సాయంకాలపు నీరెండలో నీళ్లు ముంచుతోందొక చక్కని 'ఇరానీ' కన్యక. అతని రక్తంలో పెద్దపులి అడుగుపెట్టింది. సివంగిలా కలియబడిందామె. ఆ పెనుగులాటలో పడ్డ గాయాలమచ్చలింకా అతని మొహాన్ని అక్కడక్కడా గుర్తుగా నిలిచిపోయాయి కూడా.

నాటినించీ అల్లరిసహించని 'హాలీవుడ్' అందాలంటే, అవినీతికి జడిసి ప్రాణాలకైనా తెగించి ఎదిరించే ఆటవిక శృంగారమంటే, భర్తల కవుగిళ్ళలో నాగరికంగా, ఘోషాగా, అస్తారుబతంగా అన్యాక్రాంతం కాకుండా శరీరాలు దాచుకునే

సుందరాంగులంటే అతనికి ప్రత్యేక ఆకర్షణ. బొంబాయి సఫేదు గల్లీలోనించీ కొనితెచ్చుకొన్న సౌందర్యాలు, ప్యారిస్ హోటళ్లలో ఎట్లానొక్కితే అట్లా చొట్టలుపడే తెల్ల మైనపుముద్దలు, కాశ్మీరంలో 'దాల్' సరస్సుమీద 'టూరిస్టు కాలనీల'లో నించి రాత్రిళ్లు రహస్యంగా కావాలని వొచ్చి కవుగిళ్లలో వాలే గున్నపిట్టలూ, అతనికి పరమ అసహ్యంగా మారిపోయి కనిపించసాగాయి. అతని రక్తం దేశదేశాలలో రకరకాల దురాక్రమణలలో, బలాత్కారాలలో విపరీతమైన అలవాట్లని సృష్టించుకుని విజృంభిస్తోంది.

టక్కుటక్కుమన్న బూటుచప్పుడుతో మెలకువ వచ్చింది కెప్టెన్ చంద్రానికి. 'హల్లో' అంటూ హాజరయ్యాడు కెప్టెన్ సూర్యం. 'టాయిలెట్' చరచర ముగించాడు కెప్టెన్ చంద్రం. అప్పుడే తయారైన 'బుల్స్ ఐ', అడవిబాతు సూప్, గరం గరం 'ఆస్ట్రియన్ స్ట్యూ', 'బ్రాత్', 'డ్రైజిన్' వొక్కటొక్కటే మేజామీద వుంచాడు 'బోయ్'. 'కేరట్ స్లైసు'లతో మొదలుపెట్టి, 'శకపారా' బిస్కట్లతో రుచులందుకుని 'బ్లాక్ కాఫీ', 'స్కాచ్ విస్కీ'తో ముగించి ప్లేట్లన్నీ 'వుఫ్ఫ్'న వూదేశారిద్దరూ.

సాయంత్రమయింది; చురుక్కుమనే వేసవి ఎండ గోరువెచ్చని నీరెండగా మారింది... 'నేవీ బ్లూ కోట్లూ', 'హవానా సూట్లూ', 'సెయిలర్ క్యాప్పు'లూ బనాయించి, 'వుడ్ బైన్' సిగరెట్లు వెలిగించి, సినిమా హాలుకు బయలుదేరారు, కెప్టెన్ చంద్రం, కెప్టెన్ సూర్యం.

సూర్యబింబం రాత్రి కోరలలో చిక్కుకుని నెత్తుటి ధారలు కడుతోంది. సముద్రం హోరుమని ఘోషిస్తోంది.

వెనకాల కుర్చీవరసలో కూచున్నారిద్దరూ. 'ఇంటర్వ్యాల్' వచ్చింది. సోడావాళ్ల కేకలు గింగురుమన్నాయి. అప్పుడే 'సెలక్షన్' అయిపోయింది కూడా. ఎదట మొదటి 'రిజర్వు' కుర్చీల వరసలో పంకాలక్రిందుగా కూచున్న ఆ యిద్దరు సుందరాంగులలోనూ ఇవతల పిట్ట చంద్రానిది, అవతలపిట్ట సూర్యానిది. మసక వెలుగులో ఏ అందం ఎక్కువనో నిర్ణయించడం కష్టంగానే వుంది. పక్కవాటుగ ఆ చంపల నునుపు మాత్రమే కళ్ళబడుతోంది. కాని, ఇవతల పిట్ట తనదని నిర్ణయమైపోగానే అవతల పిట్టమీద మోజుగావుంది చంద్రానికి. తీరా చెప్పేసి అన్యోన్యమూ మార్చుకుంటే మళ్ళీ ఇవతలపిట్టమీదకే వ్యామోహం తిరుగుతుందేమో—దిక్కుమాలిన గోల—డోలాయమానంగా వున్నది అతని మనస్సు.

మెయిన్‌స్విచ్చిదగ్గర నియామకమయిన ఘనున్న 'ఎలర్ట్'గానే వున్నాడు; గప్పున లైట్లన్నీ ఆరిపోయాయి. అవతలవేపు పిట్టమీద, అంటే సూర్యానికని నిర్ణయమైన పిట్టమీద, డేగలా వాలాడు కెప్టెన్ చంద్రం.

అన్నివేపులనించీ సిపాయిలు సిపాయిలని కోలాహలం బయలుదేరింది. గేటు ఎక్కడున్నదో, గోడ ఎక్కడున్నదో ఎవ్వరికీ గుర్తులేదు. గొల్లున గోలా... ఈలలు... కేకలు... సీత్కారాలు... హాలంతా అల్లకల్లోలమయింది... వొకవేపు రణగొణధ్వని, వొకవేపు తొడతొక్కిడి... జనమంతా చెల్లాచెదరై పరుగులు తీస్తున్నారు; గేటుకీపర్లు, ఆపరేటర్లు ఎక్కడివక్కడ వొదిలి వుడాయించారు... కుర్చీలు విరుగుతున్నాయి; ...బెంచీలు పడిపోతున్నాయి; బల్బులు బద్దలవుతున్నాయి. కెప్టెన్ చంద్రం తన పంజాకి దొరికిన ఎరని జరజర కొండగుహలాంటి ఆపరేటర్ రూమ్‌లోకి ఈడ్చుకొనిపోయాడు. గాలానికి గుచ్చుకొన్న గండుచేపలా గిజగిజ తన్నుకున్నదామె. గిల్లింది; ...రక్కింది;... పెడబొబ్బలు పెట్టింది; అంతా ఆ సముద్రపుహోరులో కలిసిపోయింది. చంద్రం పటకారులో బిగించినట్టు ఆమెని తన బాహువులలో ఇరికించి నిశ్చలంగా ఆమె చేస్తున్న హంగామా అంతా సహించాడంతే. అతనికి తెలుసును; ఇట్లాంటి అందాలెన్ని జీర్ణంకాలేదు తన కవుగిట్లో! ఆమె నిశ్శబ్దంగా వున్నది... అలిసిపోయి నిర్జీవంగా తన వక్షస్సుకి హత్తుకుపోయిన ఆ మాంసపుఖండాన్ని ఇక ఆక్రమించుకున్నాడు చంద్రం. అతని రక్తం అణువణువునా వేయినాలుకలు సృష్టించుకుని ఆనందాన్ని తోడుకుంటోంది. తన చేతులకింద పడివున్న తిర

స్కారం ఇష్టంగా మారుతున్న సూచనలు వూహించుకుని కొసకి తృప్తిపడ్డాడు చంద్రం.

బైట 'జీప్' సిద్ధంగావుంది. ఆమె నందులోకి జేర్చి, ఆ గోలలోనించీ, అలజడిలోనించీ తన 'క్వార్టర్స్'కి తిన్నగా పోనిచ్చాడు కారు. మాటిమాటికీ నెత్తురు రెచ్చగొడుతోంది—వొడలంతా నరనరానా నిప్పుసెగలు!...

తెల్లవారవచ్చింది. ఆమె నాగదిలో నే వుంచేసి బైట గొళ్ళెం పెట్టి పక్కన తన పడకగదిలోకి వెళ్ళిపోయాడు చంద్రం. గాఢంగా నిద్రపట్టింది.

లేచేసరికి చాలా ఆలస్యమయింది. స్నానం చేసి, కూనిరాగాలుతీస్తూ, బొంబాయినించీ 'కలనల్' కర్జా తీసుకొచ్చిన 'మధుబిందు' బొప్పాసికాయని 'స్లైసిస్'గా కోస్తూ ఖుషీగా 'రాకింగ్ చెయిర్'లో వూగిసలాడుతున్నాడు కెప్టెన్ చంద్రం.

ఇక సూర్యం వొచ్చిపడతాడు. ఒచ్చి వుగ్రుడై పోతాడు. వాడికని నిర్ణయించిన వేట తను చేజిక్కించుకున్నాడాయెను. వాడికి దుగ్ధగా వుండదూ పాపం. వాడి కెట్లాగో సర్దిచెప్పాలి. వాడితో ఎప్పటికప్పుడు రాజీపడుతుండాలి; లేకపోతే ముందు ముందు కార్యకలాపాలలో తను వొంటరివాడై పోతాడు. పాపాన్ని వొకళ్ళతో పంచుకుంటేనే గాని తీరదు వొప్పట్లాన్ని. ఒక వుల్లాసమూ తృప్తీ అతని కళ్ళల్లో తొణికిసలాడినై. ఆ అంగన వాడిదని నిర్ణయం గాకపోతే తన కామెమీద మోజేలేదు. అది వాడికి తెలీదు. ఇట్లాంటి ఘట్టం వొచ్చిందంటే వాడితో నెగ్గడం కష్టమే...ఆలోంచాడు...ఆఖరికి పక్షిని పంజరంలోనించీ వొదిలేముందు వొకసారి వాడిచేతులో వుంచితే సరిపోతుంది!...నవ్వుకున్నాడు. వాడు రాకక్రితమే కడసారి వొక్కసారి ఆ అందాన్ని కబళించి పారేసి ఇహ విడుదలచెయ్యాలి—లేకపోతే గగ్గోలు బయలుదేరుతుంది బేరక్సులో—

విసవిస నడిచివెళ్ళాడు పక్కగదిలోకి. గొళ్ళెం తీసి లోపల అడుగుపెట్టగానే కళ్ళు జిగ్గుమన్నాయి. గుమ్మంవగ్గర నేలమీద వొక మాంసంముద్ద పడివుంది. వక్షస్సు కెరువని పిడివరకూ దింపుకొనిపోయిన వొక కైజారు! చుట్టూ అంతా నెత్తురుమడుగు!!

అతనికి భయం పుట్టింది. ఆత్మహత్య చేసుకుంది గావును దుర్మార్గురాలు! ఆ కైజారు తనదే... రాత్రి తన మొలలోనించీ తెలియకుండా ఎప్పుడు తీసి దాచుకొన్నదో రాకాసి! చాలా కోపమొచ్చింది. ఏమిచెయ్యాలిప్పుడు?

ఇట్లాంటి సాహసాలకి నిగిన సౌందర్యం తారసిల్లలేదింతవరకూ తనకి. ఈ వంకని సూర్యం తన మీద తప్పకుండా కసితీర్చుకుంటాడీసారి.

పరకాయించి చూచాడు.. ప్రాణాన్ని మించిన విలువ శీలానికిచ్చిన స్త్రీమూర్తి! చంద్రబింబంలా వున్నదామె ముఖం చిరుచెమటలో తడిసిన ఆమె శిరోజాలు కంపించే వేళ్ళతో తొలిగించి చూశాడు కెప్టెన్ చంద్రం.

ఆమె తులసి!

అతని భార్య తులసి!!

ఒక దుర్మార్గుడి చేతిలో తనకి మానభంగమయిందనుకొని అవమానం పొంది ఆత్మహత్య చేసుకున్న తులసి! తన పాపాన్ని తనకి వేలుపెట్టి చూపి పోదామని వొచ్చిన తులసి!!

తన బెటాలియన్ 'రెడ్ హిల్స్'కి వొచ్చిందని తెలియబరిచాడు మొన్ననే. తనకి హితబోధచేదామని పనిగట్టుకుని వొచ్చిఉంటుంది బహుశా, అని తట్టిందతనికి.

ఆ పవిత్రపు ముద్దమీద అట్లాగే కుప్పకూలిపోయాడు చంద్రం. ఆమెరక్తంలో అతని కన్నీళ్ళు కలిసి ప్రవహించినై.

# పాలకురికి సోమనాథుని కాలము

## శ్రీ బండారు తమ్మయ్య

ఏము విషయమును గూర్చిన చర్చ పాఠకలోకమునకు, ప్రాత పురాణమే గాని క్రొత్తది గాదు. ఇందుగూర్చి యభిప్రాయభేదములు వెలయుటకు గల ముఖ్య కారణము సోమనాథుని ద్విపద బసవపురాణము నాతని యనంతరము మూడు వందల సంవత్సరములకు పద్య కావ్యముగా ననువదించిన యాతని శిష్య ప్రశిష్యుడు పిడుపర్తి సోమనాథకవి యా గ్రంథావతారికలో పాలకురికి సోమనాథుని గూర్చి చెప్పిన కొన్ని చారిత్రికాంశముల ననుసరించి చేయు కాల నిర్ణయమునకు, స్వయముగా పాలకురికి సోమనాథుడు తన గ్రంథములలో జెప్పిన యంతస్సాక్ష్యమునుబట్టి యేర్పడు కాలనిర్ణయమునకు సమన్వయ సామరస్యములు కుదురకుండుటయే. పద్య బసవపురాణావతారికా విషయముల ననుసరించి పాలకురికి సోముడు రెండవ ప్రతాపరుద్రుని కాలమువాడయి యుండునని తొలుదొలుత నాంధ్రకవుల చరిత్ర యాంధ్రుల చరిత్రాదికములలో నిర్ణయించిన శ్రీ వీరేశలింగ, వీరభద్రరావు ప్రభృతులు తరువాత వెలువడిన కర్ణాటకకవి చరిత్రలో శ్రీ నరసింహాచార్యులుగారు గావించిన నిర్ణయాదికములనుబట్టి తమ పూర్వాభిప్రాయములను మార్చికొని సోమనాథుడు మొదటి ప్రతాపరుద్ర, గణపతిదేవ చక్రవర్తుల కాలములం దుండియుండునని తమ గ్రంథ పునర్ముద్రణములలో యున్నారు. ఈనిర్ణయమునకు సోమనాథుని గ్రంథములందలి యంతస్సాక్ష్యము [illegible]డు తెలుగు నిరూపించుచు నేనుగూడ నా పూర్వ వ్యాసాదికములలో నాతని కాలము క్రీ. శ. 1160—1240 గా నిర్ణయించుట సర్వవిధముల సమంజసముగా నుండునని వ్రాసియుంటిని. శ్రీ ప్రభాకరశాస్త్రి మున్నగువారు గూడ దీని ననుగమించిరి. ఇట్టి స్థితిలో 1945 ఫిబ్రవరి "భారతి"లో మల్లంపల్లి సోమశేఖర శర్మగారు కాకతీయుల సామంతుడు, అంబయదేవుడు క్రీ॥ శ॥ 1290 లో త్రిపురాంతక వాస్తవ్యుడు రెండ్రదేవుల మల్లినాథయ్యయను, శైవునకు మొల్లకల్లూరు గ్రామమును దానముచేయుచు వెలయించిన నీలగంగవరము శిలాశాసనమునుబట్టి యా మల్లినాథయ్యయు, శాసన భాగమంతయు బూర్తియైన పిదప శాసన విషయముల కెట్టి ప్రసక్తియు లేకుండ దిగువ నా శాసనశిలపయి నెప్పుడో యెవరిచేతనో చెక్కబడిన మఱొక యసంగత శ్లోకమం దుదాహృతయైన దోచయ్య యను నొక స్త్రీ వ్యక్తియు, సోమనాథుని ద్విపద బసవపురాణావతారికలో నాతని సమకాలీనులుగా జేర్కొనబడిన రెంటాల మల్లినాథుడు, దోచమాంబ యను వారలే కాదగునని యభిప్రాయమును వ్యక్తీకరించుచు, సోమనాథుడు రెండవ ప్రతాపరుద్రుని కాలము వాడు కాదగునని పిడుపర్తి సోమనాథుని పద్య బసవపురాణావతారికనుబట్టి గావింపబడిన తొల్లింటి నిర్ణయమునే సమర్థింప గడంగిరి. కాని యా సందర్భమున వారు సోమనాథుడు ప్రథమ ప్రతాపరుద్ర, గణపతిదేవుల కాలమున నుండెనని తిరువాతి నిర్ణయమునకు సాధకములయిన యితర ప్రమాణముల గొడవ నించుకయినను దడవి యందు గూర్చి చర్చింపరయిరి. "రెండ్రదేవుల" యను రూపమే క్రమపరిణామమున "రెండ్రదేల" "రెండదేల" "రెండాల" "రెంటాల" యను రూపముల నొందియుండునని వారి ప్రధాన సమాధానము. కాని ఛందోబద్ధమయిన సోమనాథుని ద్విపద బసవపురాణములో నాతని సమకాలీనుడు మల్లినాథయ్య యింటిపేరు "రెంటాల" యని యానాడే లిఖింపబడియున్నప్పుడు, నేడుగూడ "రెంటాల" యను గ్రామ మా పేరితోడనే పల్నాడు తాలూకాలో గానవచ్చుచున్నప్పుడు, రెంటాలయను గృహనామము గల శైవబ్రాహ్మణ కుటుంబము లనేకము లిప్పుడుగూడ నున్నప్పుడు నిట్టి పరిణామవాదమునకెట్టి యాస్కారము లేదని చెప్పనక్కఱలేదు. పయిగా సోమనాథుడు రెంటాల మల్లినాథునిగూర్చి చెప్పిన విశేషము లొక్కటియు శాసనోదాహృతుడయిన రెండ్రదేవుల మల్లినాథయ్య విషయమున శాసనమున గానరావు. చివరి శ్లోకములో జేర్కొనబడిన దోచయ్యావర్ణనా విషయమునగూడ నైక్యము లేదు.

మఱియు నా శ్లోకమందలి భూతకాలిక క్రియారూపములబట్టి యామె యంతకు బూర్వ మేనాడో గతించిన వ్యక్తిగా గోచరింపగలదు. కావున శ్రీ సోమశేఖర శర్మగారు చూపిన యీ శాసనము వారు చెప్పిన ప్రకారము సోమనాథుని కాలవిషయకమైన తొలింటి నిర్ణయమును సమర్థించుటకు సమర్థము కాజాలని విధమును, అతడు క్రీ॥ శ॥ 1160—1240 ప్రాంతము వాడే కావలెననుటకు సాధకములగు నుపపత్తులను నివేదించుచు వారికి సమాధాన పూర్వకముగ 1945 ఆగస్టు భారతిలో నొక వ్యాసమును ప్రకటించి వారి నిర్ణయమును నిర్బాధకముగ సమర్థింపగల శాసనాంతరములకయి పరిశోధన మొనర్తురు గాక యని ప్రార్థించియుంటిని. అందుపయి వారింతవఱకు నట్టి శాసనాంతరముల వెలువరించుటగాని, నా వ్యాసాంశములకు తగు సమాధానముల జెప్పుటగాని జరిగించి యుండలేదు. కాని నా మిత్రులు శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు 1953 జనవరి భారతిలో పయి శీర్షికతో నొక విమర్శవ్యాసమును ప్రకటించియున్నారు. అందులో 1945 ఆగస్టు భారతిలోని నా వ్యాసమందలి యంశములతోపాటు, ఆ తరువాత 1948 సంవత్సరములో శివధర్మ గ్రంథమాలికలో ప్రకటితమయిన "పాలకురికి సోమనాథకవి" అను మద్విరచిత గ్రంథమున "సోమనాథుని కాలము" అను పదియవ ప్రకరణ మందలి విషయముల గూడ గొంత పరామర్శించియున్నారు

మరల నీనడుమనే తమ పూర్వోక్త భారతి వ్యాసమునకే యించుమించుగ ననువాదరూపకమగు ఇంగ్లీషు వ్యాస మొకటి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకాలయ పక్షమున ప్రభుత్వమువారు ప్రకటించు పత్రికలో గూడ ప్రకటించియున్నారు. శ్రీ రామకృష్ణశాస్త్రిగారింతకుమున్ను ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు 1947 సంవత్సరములో 'సర్ ఆర్. వెంకటరత్నం నాయుడు రీసెర్చి మెడల్' ప్రదానమునకయి "వీరశైవాంధ్ర వాఙ్మయము" గూర్చి నిబంధించిన వ్యాసమునకు పోటీ చేసిన అభ్యర్థులలో నొకరు. అప్పుడు తాము పంపిన వ్యాసమునే కొన్ని మార్పులు, చేర్పులు గావించి వీరు గ్రంథరూపముగా శ్రీ పతి వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధకమండలివారి గ్రంథమాలికలో ప్రకటించియున్నారు. అందులో సోమనాథుని కాలనిర్ణయ విషయమున పిడుపర్తి సోమనాథుని పద్య బసవపురాణావతారికనే వీరాలంబనముగా గైకొనియున్నారు. అందుచే శ్రీసోమశేఖరశర్మగారి వ్యాసమును సమర్థించు నభిప్రాయముకన్న, తమ గ్రంథమందలి నిర్ణయమును నిలువబెట్టుకొనవలెననెడి కుతూహలమే శ్రీ రామకృష్ణశాస్త్రిగారి ప్రస్తుతోద్యమమునకు ప్రోత్సాహజనకమయి యుండునని తలంతును. ఏది యేమైనను సత్యనిర్ణయమే యందఱకు నభిలషణీయము నాదరణీయము నగుటచే శాస్త్రిగారి యుద్యమ మభినందింపదగినదే. వారి ప్రస్తుతి వ్యాసము లిందు గూర్చి సత్యనిర్ణయమునకయి యుపకరించు నిర్బాధకములు, బలవత్తరములు నగు నూత్న ప్రమాణములతోడను, సోమనాథుడు స్వయముగా రచించిన కృతులందలి యాంతరంగిక సాక్ష్యమును సహజ, సరళ, సక్రమ మార్గముల దమ నిర్ణయానుకూలముగ సమన్వయించు సత్యసమ్మత పద్ధతులతోడను గూడి యున్న యెడల నందువలన నేర్పడు నిర్ణయ మస్మదాదులకు లోకమునకుగూడ శిరోధార్యమే కాగలుగును. కాని యట్టి వేవియు నందు గానరామిచే నవి యాకాశ సంకాశములయి నా కాశాభంగమే కలిగించినవి. పయిగా సత్యదూరములగు వాక్యములు గొన్ని నా విషయమున వీరు లిఖించియున్నారు.

"పై ప్రమాణమునుబట్టి తెలుగు విమర్శకులందఱు పాల్కురికి సోమనాథుని కాలమునుగూర్చి తమ యభిప్రాయమును వెనుకాడక మార్చికొని యా ప్రాంతమున క్రీ. శ. 1132—1198 వరకు, కాకతీయరాజ్య మేలిన రుద్రదేవుడను రాజే యోరుగల్లున స్వయంభూదేవాలయమును జూపబోయినవాడనియు నాతడు (ప్రథమ) ప్రతాపరుద్రుడని గూడ పిలువబడెనని యనుగుణముగ వాదించిరి. అట్టివారిలో మిత్రులు శ్రీ బండారు తమ్మయ్యగారు మొదటివారు"

"పై ప్రమాణముల నందఱు నంగీకరించి సంతృప్తి చెంది మళ్ళ బయలుదేరిన ప్రథమ ప్రతాపరుద్రుని కాలమువాడను నభిప్రాయమును మార్చికొనిరి కాని యీ వాదమును మొట్టమొదట నాంధ్రమునకు దెచ్చిపెట్టిన శ్రీ బండారు తమ్మయ్యగారుమాత్రము దీని కంగీకరింపరయిరి"

అను వాక్యముల జిత్తగించునది. క్రీ॥ శే॥ శ్రీ చిలుకూరి నారాయణరావుగారు సోమనాథుని స్థలనిర్ణయవిషయమున దాము నూత్నముగ దెచ్చిపెట్టిన "హాలకురికి" వాదమును నిలువరించు ప్రయత్నములతో భారతి (సం. 20 సం. 7) లో క్రీ॥ శే॥ శ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మగారికి నివేదన పూర్వకముగ ప్రకటించిన లేఖలో "పాలకుర్తియే పాలకురికి యను నిశ్చితవాదమును దెచ్చిపెట్టినది నా మిత్రులు బండారు

తమ్మయ్యగారు" అని వ్రాసిన వాక్యములో నెంత సత్యమున్నదో, శ్రీ రామకృష్ణశాస్త్రిగారి వాక్యములలోగూడ నంతేయున్నదని చదువరులకు నివేదించుచున్నాను. నారాయణరావుగారి "పాలకురికి" వాదము నొక్క విద్వాంసుడును గూడ బరిగ్రహింపని సంగతి తెల్లమేగదా! సోమనాథునిగూర్చి నేను ప్రకటించిన వ్యాసములలో 1922 (దుందుభి) ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికావ్యాసమే మొట్టమొదటిది. శ్రీ నరసింహాచార్యులుగారి కర్ణాటకకవిచరిత్ర మొదటి భాగము ప్రథమ ముద్రణము 1907 లో వెలువడినది. దానినిబట్టి శ్రీ వీరేశలింగముగారు తమ పూర్వ నిర్ణయమును మార్చికొన్న ఆంధ్రకవుల చరిత్ర ప్రథమభాగ పునర్ముద్రణము 1917 లో ప్రకటితమైనది. వారి ననుసరించి శ్రీ శేషాద్రి రమణకవులు మున్నగువారు గూడ నాకన్న మున్నే కొన్ని వ్యాసముల ప్రకటించి యున్నారు. నేను కావించినది, కావించుచున్నది బయటిప్రమాణము లన్నిటికన్న బలవత్తరములు, సహృదయ పరిగ్రాహ్యములు నగు సోమనాథుని కృతులందలి యాతని సొంతవాక్యము లీ తరువాతి నిర్ణయమునకే యెట్టితీరున నుపకరించుచున్నవో, సంప్రదాయబద్ధములగు సహజ సక్రమ పద్ధతులతో విశదీకరించుటతప్ప మఱేమియు లేదు. కావున తమ వ్రాతలందలి యసత్యమును శ్రీ రామకృష్ణశాస్త్రిగారిప్పుడైన గ్రహింతురుగాక యని ప్రార్థింతును.

"రెంద్రేవుల" "రెంటాల" ల విషయమున శ్రీ సోమశేఖరశర్మగారి పరిణామవాదమునందలి యసంగతిని గుర్తించియే కాబోలు, శ్రీ రామకృష్ణశాస్త్రిగారు తత్సమర్థనమునకయి యిప్పుడు మఱొక్క క్రొత్తదారి త్రొక్కి యున్నారు. "సోమనాథు డసలు రెంద్రేవ్ల" యనురూపము ("మహిజను రెంటాల మల్లినాథుడును" అను పాదములో) నుపయోగించి యుండవచ్చునని భావించినచో నుపద్రవమేమియు నుండదు. అది క్రమముగా రెంటాలయని మారి యుండుటయు భాషాశాస్త్ర సంప్రదాయము రీత్యా సంభావ్యమే. ఇది ఛందస్సునకును సరిపోయినది. పదరూపముగూడ స్పష్టముగ నున్నది" అని వీరి సమర్థనము. సోమనాథుని ద్విపద బసవపురాణమునకు దేశము నలుదిశల పెక్కు తాళపత్రప్రతులు వెలసినవి. ఆంధ్రగ్రంథమాలలో దానిని బరిష్కరించి ముద్రించునపుడు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు పెక్కు ప్రతుల బరిశోధించి పాఠాంతరములున్న తావులను బెక్కింటిని పుటల యడుగున జూపియే యున్నారు. కాని పూర్వోక్తమయిన "రెంటాల" శబ్ద విషయమున నట్టి పాఠాంతర మేదియు వారు చూపనేలేదు. సోమనాథుని యనంతరము 300 సంవత్సరములకు కన్నడభాషలో తోంటద సిద్ధలింగకవి రచించిన పాల్కురికి సోమేశ్వర పురాణములో సోమనాథుని సమకాలిక మిత్రుల ప్రశంసలలో "రెంటాల మల్లినాథ" అనియే యున్న—

"సల్లలిత కరవీర పుష్పదిదరిపూజె। సల్లియొందల రల్లదిరెనోడి రెంటాల మల్లినాథం తన్న నేత్రమంకి త్తర్చిసిదను నిజనిష్ఠయిందె" అను పద్యమును 1945 ఆగస్టు భారతి వ్యాసములో నుదాహరించియే యున్నాను. రెంద్రేవుల, రెంటాల యనునవి భిన్న గ్రామ నామములు. అందులో రెండవది యిప్పటికి నారూపముతోడనే పల్నాడుతాలూకాలో నున్నది. అట్లె మొదటిదిగూడ నే తెలంగాణా ప్రాంతముల లోనో యారూపముతోడనే యుండిన నుండవచ్చును. రేవుల, రేగుల, అను నామాంతరములు గల, ఆరికరేవుల, కొంద్రేగుల మున్నగు గ్రామములు గోదావరిజిల్లాలో నేడుగూడ నున్నవి. ఇట్టి పరిస్థితులలో అంబయదేవుని శాసనమందలి రెంద్రేవుల మల్లినాథయ్యయు, ద్విపద బసవపురాణములో నుదాహృతుడైన రెంటాల మల్లినాథుడు నేకవ్యక్తియే యని యూహించి, సోమనాథుడు "రెంద్రేవ్ల" అని గ్రంథములో వ్రాయగా నదియే తరువాతి వ్రాతలలో "రెంటాల" అని మాఱి యుండునని శాస్త్రిగారు సమర్థింప బూనుట సక్రమపద్ధతియగునేమో సహృదయు లాలోచింతురుగాక:

ఇక నీ మల్లినాథయ్య, దోచయ్యలగూర్చిన వివరములవిషయమున నా విమర్శనములోనే జెప్పిన సంగతులను బాగుగా గుర్తింపకయే, శాస్త్రిగారిచ్చు వచ్చినట్లు సమాధాన వాక్యములు వ్రాయుట మఱింత శోచనీయము. శాసనవిషయముల కెట్టి ప్రసక్తియు లేనిరీతిగా శాసనభాగమంతయు బూర్తియైనతరువాత నడుమున చెక్కబడిన దోచయవిషయక శ్లోకము యొక్క యసంగతత్వముగూర్చి, యామె భూతకాలిక ద్యోతకత్వముగూర్చి నేను వ్రాసినదాని కేమియు బదులు చెప్పనేలేదు. ఈశాసనమును మొదట '*Epigraphica Indica*'లో ప్రకటించిన శ్రీ పంచముఖిగారీ శ్లోకమునుగూర్చి "*Lines 61-66 also contain a verse in corrupt Sanscrit the sense of which*

*is not quite clear.*" అని లిఖించిన వాక్యములు నా పూర్వవ్యాసమున నుదాహరించియే యుంటిని. దోచయ్యగూర్చి యీ శ్లోకమందున్న వివరములు.

(1) ఆమె త్రిపురాంతకేశ్వరునకు నేత్ర మర్పించి పూజించి యంతకన్న మిన్నయైన కన్ను పడసెనట (2) స్వర్గమధిరోహించుటకు ప్రతిన చేసెనో యన్నట్లు కుమారాద్రిపయి త్రిపురాంతక దేవుని యెట్టయెదుట మెట్లుగట్టించి విరాజిల్లెనట.

సోమనాథుడు బసవపురాణములో దోచమాంబ గుఱించి చెప్పిన విషయము, ప్రతిదినము శివుని నైదు కరవీరపుష్పములతో నర్చించు వ్రతము నెఱపు చుండ నొకనాడందొక పుష్పము తక్కువ గాగ దాని బదులు నిజనేత్ర మర్పించి శివునిచే నసదృశాంబకమును బడసెనట. శాసన శ్లోకమందు మొదటి విషయమున సోమనాథుడు చెప్పినదానితో గొంత సామ్యమున్నను, రెండవది పూర్తిగా గ్రొత్త సంగతియే యని చెప్పనక్కఱలేదు. ఇక రెంటాల మల్లినాథుని విషయమున సోమనాథు డతడు జంగమార్చనలకయి తను మనోధనముల నర్పించుచు సీమోల్లంఘన వ్రతశీలము నెఱపువాడని, కుమారాద్రికి తూర్పువైపున సోపానపంక్తిని దీర్చినవాడని వ్రాసియున్నాడు. శాసనమందలి రెండ్రేవుల మల్లినాథయ్య విషయమున నీ ప్రశస్తులేమియు నందు పేర్కొనబడలేదు. దానమును గూర్చిన శ్లోకము స్రగ్ధరావృత్తములో నున్నది. అసలాతని పేరు నింటిపేరు నందిముడ్చుటకే శ్లోకకర్తకు కుదురలేదు. చూడుడు.

"శాకే భాన్వర్క సంఖ్యావిలసిత వికృ
తే వత్సరే భాద్రమాసే ।
దర్శే భౌమస్యవారే సుకృతి ని
సమయే ద్వాదశార్ధోపరాగే ।
ప్రాదాదంబక్షితీంద్రః ప్రథిత శివపురం
మొల్లకల్లూరు నామ ।
గ్రామం మాహేశ్వరాయ ప్రకటితమ

ఇందు నాల్గవపాదములో జివరి తొమ్మిది యక్కరములు గల శిలాభాగము పగిలిపోయినది. ఆ యక్షరములు "హాసే మల్లినాథా హ్వయాయ" అనియై యుండునని మన మూహించినను, ప్రతిగ్రహీత పేరు మాత్ర మెట్లో యిముడ్చ గల్గినను నాతని యింటిపేరు నందు చెప్పుటకు శ్లోకకర్తకు వీలుపడలేదనుట స్పష్టమేగదా! ఇందుచేతనే శాసన మంతయు సంస్కృతశ్లోకములతో నున్నను చిట్టచివరనయినను ప్రతిగ్రహీత పేరు నింటిపేరు స్పష్టముగ జెప్పుటకయి దానవిషయము మరల నీ క్రింది వాక్యములో దెలుగులో వచనమున జెక్కబడినది.

"స్వస్తి శ్రీమతు గండపెండార అంబదేవ మహారాజులు శ్రీ త్రిపురాంతకం క్షేత్రవాసులైన రెండ్రేవుల మల్లినాథయ్యంగారికి మొల్లకల్లూరు సర్వధా పరిహారము ఆచంద్రార్కస్థాయిగాను ఇచ్చిన శివపురము మంగళ మహాశ్రీ శ్రీ శ్రీ"

కావున నీ మల్లినాథయ్య యొక్క శైవుడని మాత్రమే యీ శాసనమునుబట్టి యేర్పడును గాని సోమనాథుడు రెంటాల మల్లినాథునిగూర్చి చెప్పిన విశేషము లొక్కటియు నాతనియెడ గానరానందున నిరువురు నేకవ్యక్తి కానేరరని విజ్ఞులకు జెప్పనక్కఱలేదు. సోమనాథుని రెంటాల మల్లినాథుడు శ్రీశైలమునకు దూర్పు ద్వారమయిన కుమారాచలమునకు దూర్పువైపున సోపానములు గట్టించినవాడు. దోచయ్య సోపానములు కుమారాద్రిపయిని త్రిపురాంతకేశ్వరాలయముగొఱకు మండపముముందఱ గట్టించినది. కావున నీ రెంటికి సంబంధము లేనేలేదు. ఈ పరిస్థితుల నెల్ల నాలోచించియే నేను శాసన శ్లోకమందలి దోచయ్య సోమనాథుడు పేర్కొన్న దోచమాంబయే యైయుండునని తలంచినను నామె భూతకాలిక వ్యక్తిగా శ్లోకమందలి క్రియారూపములబట్టి గోచరించుచున్నందున నామెనుగూర్చి యీ శ్లోకమును వ్రాసినవారు, సోమనాథుని ద్విపదపంక్తులను దాళపత్ర ప్రతిలో సరిగా బరీక్షింపక యాపయిని రెంటాల మల్లినాథుని గూర్చి చెప్పిన పంక్తులందలి సోపాననిర్మాణవిషయమునే యిట్లు కొన్ని వ్యత్యాసములతో నామెపరముగా జెప్పియుందురనియు, దీనినిబట్టి కూడ నా శ్లోకము, ఆ శాసనము బసవపురాణ రచనానంతరమే కొంతకాలమునకు వెలసినవని తలంచుట కవకాశ మేర్పడునని వ్రాసియున్నాను. తాళపత్ర గ్రంథములను సరిగా బరీక్షింపక యందలి విషయములను గ్రహించి తరువాతివారు వ్రాయు వ్రాతలలో నిట్టి వ్యత్యాసములు దొరలుటకు దృష్టాంతముగా నే, తోంటదార్యుడు క్రీ॥ శ॥ 1560 ప్రాంతమున వ్రాసిన సోమేశ్వర పురాణములో సోమనాథుడు దోచమాంబ విషయమున జెప్పిన కరవీర పుష్పపంచకార్చనవ్రత ప్రశంస నాతని బసవపురాణమున బయి పంక్తులలో పేర్కొనబడిన రెంటాల మల్లినాథున కతకరించిన

పూర్వోక్త పద్యములను జూపియుంటిని. ఇట్లు నేను వ్రాసిన వాక్యముల సరిగా నీక్షింపక రామకృష్ణ శాస్త్రిగా రీ విషయముల విమర్శించుచు యథేచ్ఛముగ వ్రాసిన యీ క్రిందివాక్యములందలి యౌచిత్యమును సహృదయులే గుర్తింతురుగాక!

“ఈ మాహాత్మ్య విషయము పెంటూల మల్లినాథుని పరముగ లోంటదార్యుడు రచించిన సోమేశ్వర పురాణమున చెప్పబడినది. కాన (బసవసోమేశ్వర) పురాణములలోని వ్యక్తుల పేళ్లు కొంచెము తారుమారైనట్లు స్పష్టమగుచున్నది. శాసనకాలమైన క్రీ॥ శ॥ 1290 సంవత్సరమున కుమారాద్రికి తూర్పువైపున సోపానములు మల్లినాథునిచేగాని దోచమాంబచేగాని నిర్మింపబడెననుట స్పష్టము—1290 సంవత్సరమున నిర్మింపబడినచో పాల్కురికి సోమనాథుడు బసవపురాణమున నుదాహరించెనని చెప్పవలయును కదా: లేక బండారు తిమ్మయ్యగారు వ్యాఖ్యానించినట్లు తర్వాత నెవరో యీ శాసనమును వేయించిరని భావింపుదమన్న నొకరు కట్టించిన సోపానములు మఱొకరు కట్టించెననుట వ్యర్థము. చెడిపోయినచో బాగుచేయించెనని చెప్పవచ్చును. కాని ఆ మాట లేదు. నూరు వత్సరముల పూర్వ మెప్పుడో నిర్మించిన సోపానములను 1290 సంవత్సర శాసనమున స్మరించెనని వ్యాఖ్యానించుట సరసముగా నుండదు. కాన కుమారగిరికి తూర్పుదిక్కున సోపానములు 1290 సంవత్సరమున దోచమాంబగాని మల్లినాథుడుగాని నిర్మింపజేసియుండవచ్చును. తర్వాతనే బసవపురాణమున దానినిగూర్చి రచించియుండవచ్చును. బసవపురాణవిషయములను తారుమారుచేసి శాసనముల కెక్కించిరనుట సముంజసముగా నుండదుగదా! దీనిని బట్టి చూచినను సోమనాథుడు క్రీ 1290 తరువాతవాడని తేలుచున్నది.”

సోమనాథుడు తనకు బసవపురాణ కథాసూత్రముల నెఱింగించిన పెద్దలను సమకాలీన భక్తులను ప్రశంసించు సందర్భమున వారినిగూర్చి చెప్పిన విశేషములలో వ్యత్యాసములు గాని ప్రమాదములు గాని దొరలుట కవకాశము లుండ నేరవని సహృదయులకు జెప్ప నవసరములేదు. కాని తరువాతివారా విషయములను దాళపత్రప్రతులను జూచి గ్రహించునపు డిట్టి వ్యత్యాసములకు ప్రమాదములకు సమ్యక్పరీక్షణ లోపమున లోనగుట యసంభావ్యము కాజాలదు గదా!

ఇట్లు లెన్నియో యసంగతులతో గూడిన యీ శాసనము సోమనాథుని కాలనిర్ణయమున కొక యప్రతిహత ప్రమాణముగ భావించి, పిడుపర్తి సోమనాథుని పద్య బసవపురాణావతారికావిషయములకు ప్రత్యక్షర ప్రామాణ్య మొసంగుచు వానికీ శాసనముగూడ సాధకము కాగలదని చేయు వాదము వ్యర్థమో, సమర్థమో విజ్ఞు లాలోచింతురుగాక! పిడుపర్తి సోమన చెప్పిన సంగతు లించుమించుగ ఏకామ్రనాథుడు ప్రతాప చరిత్రమున చెప్పినవానికి గొన్ని కూర్పు- చేర్పు-గావించిన యనువాదములు మాత్రమే. పుక్కిటి పురాణ రూపకముగనున్న యీ ప్రతాప చరిత్రాంశములు యథాతథముగ గ్రహింపదగినవి కావని చరిత్రజ్ఞులు వానికి ప్రామాణ్య మొసంగకుండుట సర్వవిదితము. వానికేలేని ప్రామాణ్యము తదనువాదముల కెట్లు లేర్పడును? పిడుపర్తి సోమనాథుడు పాల్కురికి సోముని కులగురువుగా నారాధించు శిష్యప్రశిష్యుల వంశ్యుడయినను 300 వత్సరముల యనంతరము వినికిడినిబట్టియు పుక్కిటిపురాణముల ననుసరించియు నాతడు వ్రాసిన సంగతులలోను వంశానుక్రమణికలోను గొన్ని లోపములు, వ్యత్యాసములు దొరలుట యసంభావ్యమని చారిత్రక దృష్టిగల సహృదయులు చెప్పగలరా! ఇంతకు పాల్కురికి సోముడు స్వయముగా దన గ్రంథములందు వ్రాసికొన్న సంగతులతో పొందిక కుదిరినంతవఱకే, పిడుపర్తి సోమన చెప్పిన విషయముల యాథార్థ్యము పరిగ్రాహ్యము కాగలదుగాని, కానినాడట్లు కానేరదని చెప్పనక్కరలేదు. కాకతీయ చక్రవర్తులు, వారి మంత్రులు సామంతులెవరితోడను దనకు సంబంధమున్నట్లుగాని వారి సమ్మానముల దా నందినట్లుగాని పాల్కురికి సోమనాథుడు తన కృతులం దెచ్చటను నొక్కింతయు సూచనయైన గావింపలేదు—అతడు చెప్పకున్నను నట్టిదేదయిన జరగియుండినచో నది ప్రథమ ప్రతాపరుద్ర గణపతిదేవుల కాలమందే ఘటిల్లవలెననుట యాతని కృతులందలి యంతస్సాక్ష్య మనుసరించి యేర్పడు కాలనిర్ణయమునకు సాధకముగా నుండును. అంతేగాని ఇందులూరి అన్నమంత్రిచే నాత డగ్రహారము లొందెనని యేకామ్రనాథుడు పిడుపర్తి సోమన చెప్పిన సంగతు లందుకు సాధకములు గావు. ఈ యన్నమంత్రి వంశ్యుడు కొలని గణపతిదేవుడు (పిడుపర్తి సోమనకు 150 సంవత్సరముల పూర్వమున్నవాడు) తాను రచించిన శివయోగసారము నవతారికలో అన్నమంత్రి పరాక్రమాదులతోపాటు లోకమునకు మున్నెఱుకవడని యెన్నియో యపూర్వాంశముల నాతనిగూర్చి తెలియబఱచియుండుట శ్రీ రామకృష్ణశాస్త్రిగారు గూడ పేర్కొనియున్నారు.

ఆంధ్ర కవులలో నే నెఱిగినంతవఱకు పాల్కురికి సోమనాథుని నాతని శిష్యుడు చక్రపాణి రంగనాథుని మున్ముందు పూర్వకవిస్తుతిలో పేర్కొన్నదీ గణపతిదేవుడే. ఈ క్రిందిపద్యము చూడుడు.

"అసమ శివభక్తి రసమా ।
నసుడగు పాల్కురికి సోము - నాథుని గవిరా ।
జ సమున్నతయశు సద్యః ।
ప్రసాదియగు చక్రపాణి - రంగన గొలుతున్॥"

కాని యన్నమంత్రి సోమనాథుని శిష్యుడయి యాతని కగ్రహారము లిప్పించిన విషయముల సూచనగా నయిన నాతడుగూడ నీ గ్రంథావతారికలో జెప్పియుండలేదు. అట్లు జరగియున్న నాతడా విషయ మించుకేని ప్రశంసింపకుండునా? అన్నమంత్రి రుద్రమదేవి, ద్వితీయ ప్రతాపరుద్రుల రాజకార్య ధురంధరుడని యందఱెఱింగినదే. దాని నెవరు కాదనుటలేదు. ఉపలబ్ధములైన యాతని శాసనము లన్నియు నాతని కాలము నే నిరూపించుచున్నవి గాని యప్పుడే పాల్కురికి సోముడుండెనని గాని యగ్రహారము లొందెననిగాని నిరూపించుట లేదు గదా! అన్నమంత్రి సోమనాథుని కగ్రహారము లిప్పించిన శాసనములకు ప్రాగభావము గాక ప్రధ్వంసాభావమే వర్తించుచో వానికయి పరిశోధన మొనర్చి ప్రకటించి సమర్థముగను నిర్బాధకముగను వాని సాయమున సోముని కాలనిర్ణయమును గావించుటయే కర్తవ్యము. అంతియేగాని యాతని యూరు పేరులేని పూర్వోక్తమయిన నీలగంగవరము శాసనమునుబట్టియే ప్రాకులాడి వ్యర్థవాదములతో గ్రంథమును బెంచుట వలన ప్రయోజనము లేదని మనవి చేయుచున్నాను. ఆ శాసనములను శర్మగారుగాని, శాస్త్రిగారుగాని, వారి యనుయాయులుగాని వెలికిదీసిననాడు కృతజ్ఞతాభివందనములతో ముందంజవైచి యందుబట్టి యేర్పడు కాలనిర్ణయమును గ్రహించుటలో నేనే యగ్రస్థానమును గయికొందును. అందఱితోపాటు నాకు గావలసినదియు సత్యనిరూపణమే కాన యట్టి శుభోదయమునకే నేనును నిరీక్షించుచున్నాను.

ఇకపయి దుర్బలాధారములచే సోమనాథుడు క్రీ॥ శ॥ 1290 తరువాతివాడని నిరాఘాటముగ నిరూపింపగలిగితిమనెడి విశ్వాసముతో నందుకు గల ప్రతికూలాధారములను శ్రీ రామకృష్ణశాస్త్రిగారు పూర్వపక్షము చేయు విధానమును బరామర్శింతము.

సోమనాథుడు బసవపురాణము చివర దాను బసవ చరితమును భక్తులచే విన్న మాడ్కి జెప్పితినని వ్రాసియున్నాడు. ఆ గ్రంథావతారికలోనె శ్రీశైల యాత్రావసరమున నొడ్డోలగమున వినకు బసవపురాణ కథాసూత్రముల నెఱింగించిన పెద్దలలో త్రిపురాంతక వాసియు, "పండితారాధ్య కృపాసముద్ధితుడు" నగు కరస్థలి సోమనాథయ్యగారిని మున్ముందు ముఖ్యునిగా బేర్కొనియున్నాడు. చరమదశలో రచించిన కడపటి కృతి పండితారాధ్యచరితము నవతారికలో "పేరెన్నబడిన శ్రీ బెలిదేవ వేము । నారాధ్యులను పరమారాధ్యదేవు । మనుమని శిష్యుండ" నని వ్రాసియున్నాడు. ప్రాథమిక కృతులగు అనుభవసార బసవపురాణములలో తన కవితాగురుడగు కరస్థలి విశ్వనాథుని ప్రశంసయే గాని యీ బెలిదేవ వేమన మనుమని ప్రశంస చేయలేదు. మఱియు పండితారాధ్య చరిత్రము చిట్టచివర దత్కృతి రచనాసమాప్తి కాలమునకు సజీవులుగానున్న పండితారాధ్యుని మనుమలు నలువురను, ఆతని పుత్త్రుడు కేదారాయ్యకు శిష్యుడయిన ఇవటూరి సోమనాథుని నాతని పుత్త్రులు ముప్వురను బేర్కొని, యాతని యీ యాత్మసంతాన, శైవ (శిష్య) సంతానములు, "తనయ పరంపరోత్తర పరంపరలు । పరిచిత గురుపరంపర దేజరిల్లు" "ప్రభుతర గురుపరంపర దేజరిల్లు" అని తద్ధర్మార్థక క్రియారూపములలో నాశీర్వదించి యున్నాడు. బెలిదేవ వేమనారాధ్యుడు శాపానుగ్రహసమర్థు డగు మహిమశాలి యనియు నాతడు బసవేశ్వర మల్లికార్జున పండితులకు సమకాలికుడనియు, పండితారాధ్యచరిత్ర దీక్షా పురాతన ప్రకరణములలో సోమనాథు డుగ్గడించిన యాతని చరితమువలననే వ్యక్తమగుచున్నది. బసవేశ్వర, మల్లికార్జున పండితులు వరుసగ క్రీ॥ శ॥ 1168, 1170 ప్రాంతముల లింగైక్య మొందినట్లు చరిత్రజ్ఞులు పలువురు నిర్ణయించియున్నారు. కావున సోమనాథుని గ్రంథములందలి యీ యంతస్సాక్ష్యమును సహజ, సరళ, సక్రమమార్గముల సమన్వయించి సోమనాథుడు బసవేశ్వర మల్లికార్జున పండితారాధ్యులకు గాని వారి సమకాలీనుడయిన బెలిదేవ వేమనారాధ్యునికి గాని వారి జీవితకాలములో వారి చరితముల సాకల్యముగ స్వయముగా నెఱింగిన ప్రౌఢవయస్కుడగు సమకాలికుడు గాక వారి నిర్యాణకాలమునకు రమారమి యేనిమిది పది సంవత్సరముల బాలుడయి యనగా క్రీ॥ శ॥ 1160 ప్రాంతమున జనించి పండితారాధ్యుని శిష్యుడయిన కరస్థలి సోమనాథయ్య మొదలగు పెద్దల వలన బసవపురాణ కథాసూత్రముల నెఱింగి రమారమి ముప్పదియేండ్లవయస్సున క్రీ॥ శ॥ 1190 ప్రాంతమున బసవపురాణమును, వేమనారాధ్యుని మనుమనియొద్ద వేదవేదాంగముల నేర్చి 1230 ప్రాంతమున పండితా

రాధ్యచరితమును రచించి 1240 ప్రాంతమున లింగై క్యమయి యుండునని సహృదయులకు స్ఫురింపగల దని నా నమ్మకము. అదియే నే జేయు నిర్ణయము.

బసవేశ్వరుడు కర్ణాటుడయినను నాతని చరితము నంత విపులముగ బురాణరూపముగ రచించిన కర్ణాట కవు లెవరును లేరు. హరీశ్వరుడను కవిమాత్రము కొందఱు పురాతన శివభక్తులగూర్చి "శివగణ దరగళె" అని రగడలలో నొక కృతి రచించి యందు బసవేశ్వ రుని చరితముగూడ కొంత సంగ్రహముగ గూర్చె.

క్రీ॥ శ॥ 1245 ప్రాంతమున 'సూక్తి సుధార్ణవము' అను సంకలన గ్రంథమును సంతరించిన మల్లికార్జునుడను కవి హరీశ్వరుని గిరిజాకల్యాణమను ప్రౌఢకావ్యమునుండి కొన్ని పద్యముల నుదాహరించి యున్నందున హరీశ్వరుని కాలము క్రీ॥ శ॥ 1215 సంవత్సరమునకు బూర్వమే కాని క్రిందికి రాజాలదని కర్ణాట చరిత్రజ్ఞులు నిర్ణయించియున్నారు. హరీశ్వర సోమనాథు లిరువురు తమ కృతులలో నొకరినొకరు పేర్కొనియుండ లేదు. అందుకు కారణము వా రించుమించుగ నేకకాలమున నే వేర్వేఱు ప్రాంత ముల దూరమునుండి యొకరి కృతుల నొక రెఱుంగ మిరే యని తెలియవచ్చును. సోమనాథుడు క్రీ॥ శ॥ 1240 తరువాతనే వెలసి బసవపురాణాదుల రచించి యున్నచో హరీశ్వరుని స్మరించియుండకపోడనియే నా యభిప్రాయ

సోమనాథుని బసవపురాణమునకు భీమకవి కర్ణా టానువాదము క్రీ॥ శ॥ 1369 సంవత్సరమునందును, పండితారాధ్యచరిత్రమునకు శ్రీనాథుని యాంధ్ర పద్యానువాదము క్రీ॥ శ॥ 1398 ప్రాంతమునను వెల సినవి. ఆనాటి దేశపరిస్థితులలో సోమనాథుని కృతు లకు నిట్టి భాషాంతరములు ననువాదములు వెలయు టకు దగినంత కాలవ్యవధి యవసరమైయుండునని సహృదయులు తలంపకపోరు. కావున దీనినిబట్టికూడ సోముని కాలనిర్ణయవిషయమున బయి నిర్ణయమే సమంజసముగా దోపగలదు.

శ్రీ రామకృష్ణశాస్త్రిగా రిందు గూర్చి పూర్వ పక్షము సేయు తెఱగు చిత్తగింపుడు. కరస్థలి సోమ నాథుడు పండితారాధ్య కృపాసముద్గతుడన్న దాని కాతని తలిదండ్రులు మల్లికార్జున పండితుని భక్తితో నుపాసింపగా నాతని యనుగ్రహమున వారికి జనిం చినవాడని యర్థము చెప్పవలయునట. పాల్కురికి సోముని ప్రయోగ సంప్రదాయముల గుర్తెఱింగినవా రెవరు నిట్టి యర్థమును చెప్పజాలరు. దీక్షాగురువు దీక్షాకాలమున హస్తమస్తక సంయోగమొనర్చి శి ష్యుని దేహములో జిత్కళాన్యాస మొనర్చుటలో భౌతికశరీరము లింగశరీరముగా మాఱి తమకు వేఱొక జన్మము కలుగుననియు నందువలన గురులింగము యొక్క కృపాహస్తమే తమకు జన్మభూమి యని చెప్పుకొనుట వీరశైవుల మతసంప్రదాయము. కృపా సముద్గతుడన్నను కృపాహస్తగర్భసంభవుడన్నను నొక్కటియే. అనుభవసారకృతిశ్రోతయగు గోడగి త్రిపురారి తండ్రి నారయను వర్ణిం చుటలో "ఆముష్మేశ్వరగురు దివ్యామృత హస్తా వతంసు డతికారుణ్యోద్ధాము తనూజుడు" అనియు, పండితారాధ్యచరిత్రశ్రోతయగు సూరనామాత్యుని వర్ణించుటలో "వీరమాహేశ్వర విశ్రుతాచార్య! కారుణ్యహస్తాబ్జ గర్భసంభవుడు" అనియు, తన విషయమున "గురులింగతనూజుండ, సద్గురులింగ ఘనకరుణాహస్తగర్భ సంభవుడ" "గురులింగ వర కరోదర జనితుండ"ననియు సోమనాథుడు గావించిన ప్రయోగాంతరముల బరీక్షించిన నీ సంప్రదాయము సువ్యక్తము కాగలదు. సంప్రదాయవిరుద్ధమయిన యీ పెడదారియే రామకృష్ణశాస్త్రిగారి వాదదౌర్బ ల్యమున కాదర్శము కాగలదు. బెలిదేవ వేమనా రాధ్యుని మనుమని శిష్యుడు సోమనాథు డన్నప్పుడు "మనుమడు" అను దాని పౌత్రుడు దౌహి త్రుడు అను సహజార్థము తీసికొన్న దా మేర్పఱచు కొన్న సోముని కాలనిర్ణయమునకు సరిపడదు కావున నౌపచారికముగ 4—5 తరములు తరువాతి యే ముని మనుమడనియో యర్థము చెప్పికొనవలెనని సమాధాన మొసంగుచున్నారు. అట్లుగాకున్న నా యభి ప్రాయము ప్రకారము క్రీ॥ శ॥ 1160 ప్రాంతమున జనించి 1195 నాటికి బసవపురాణరచనమున ప్రసిద్ధు డయినచో, బెలిదేవ వేమన నిర్యాణకాలము 1170 నాటి కాతని మనుమనికి 10, 15 సంవత్సరములకన్న నెక్కువ వయస్సుండ నేరదు గావున నాతని శిష్యుడు సోమనాథుడగుట సంభవము కాజాలదని, గురువు శిష్యునకంటె 15—20 సంవత్సరములు పెదవాడు కానిదే గురుభావము సిద్ధింపదని వ్రాయుచున్నారు. ఈ విషయములో నే వ్రాసిన యంశములందలి భావ ములను శాస్త్రిగారు క్రమముగా గ్రహించినట్లు కానరాదు. 1190 ప్రాంతమున బసవపురాణమును రచించినంతమాత్రమున సోమనాథు డప్పటికే సర్వ విద్యాపారంగతు డయ్యెనని తలంప నవసరము లేదు. ఆతడు చతుర్వేద పారగుడనని బెలిదేవ వేమన మను మని శిష్యుడనని జెప్పికొన్నది చరమదశలో రచించిన

పండితారాధ్య చరితమునందే గాని యంతకు మున్ను రచించిన కృతులలో గాదు. వేదవేదాంగాన్వయనమును బెలిదేవ వేమన మనుమనియొద్ద 1190 వత్సరమున కొంచెంత ముందో తరువాతనో సోమనాథుడు ప్రారంభించి కొన్ని సంవత్సరములు సాగించి యుండుట కొంత డిప్పటికి గావించిన బసవపురాణ రచన కెట్లు బాధకమగును? బసవపురాణ రచనమునకు మున్నే కన్నడులకు, ఆంధ్రులకు గూడ నుపకరించు తెలుగున సంస్కృతపదభూయిష్ఠములుగ సోమనాథుడు బసవస్తవరూపకముగ రచించిన యనేక లఘుకృతులు (పంచప్రకారగద్య మున్నగునవి) శ్రీశైలయాత్రాదిక సందర్భములలో నానాడే యొప్పటికప్పుడే కన్నడ దేశీయులగు భక్తులకు గూడ కంఠస్థములయి కన్నడదేశమున (భీమకవి సోముని బసవపురాణమును గన్నడించుటకు జాలమున్నే) క్రీ॥ శ॥ 1222 నాటికే వ్యాప్తమయియుండుటలో నసంగతి యేమియులేదు. సోమనాథుని బసవపురాణాదిక కృతులగాక యిట్టి లఘుస్తవముల నుద్దేశించియే యుద్భట కావ్యకర్త సోమరాజు తన కృతిలో "సముదంచద్వృషభస్తవామర మహీజారామ నందోమనం" అని నుతించియుండు నని నా తలంపు. శాపానుగ్రహ సమర్థుడు, మహిమశాలి, దీర్ఘాయుష్మంతుడు నగు బెలిదేవ వేమనకు క్రీ॥ శ॥ 1270 నాటికి 20-25 వత్సరముల యీడుగల మనుమ డుండుటయు నప్పటి కెనిమిది పదివత్సరముల యీడుగల సోమనాథు డాతనికి తరువాత నెప్పుడో శిష్యుడగుటయు నెట్లు లసంభావ్యములు కాగలవో నా కర్థము కాలేదు. వయస్సులో పది పదియేను వత్సరము లంతరము గల గురుశిష్యులు నేటి కాలమునగూడ నెందఱు లేరు? ఇక పండితారాధ్యచరితము చివర సోమనాథుడు మల్లికార్జునపండితుని మనుమలను, ఆతని పుత్త్రుడు కేదారయ్య శిష్యుడయిన ఇవటూరి సోమనాథుని నాతని తనయులను బేర్కొని యాశీర్వదించుట యస్మదాదుల నిర్ణయమునకే సాధకమగుట సువిదితము.

గురించియే కాబోలు రామకృష్ణ శాస్త్రిగారిందుగూర్చి విస్తరింపక, "గురుచతుష్క మాత్మ సంతాన । తనయపరంపరోత్తర పరంపరలు । పరిచిత గురుపరంపర దేజరిల్లు" అని సోమనాథుడు రచించినదానినిబట్టి పండితారాధ్య సోమనాథుల మధ్య కొన్ని తరములు గడచినట్లుమాత్రమే కనబడుచున్నది' అని జాఱుముడిగా వ్రాసి యది తమవాదమునకు బాధకము కాదని సమాధాన పడినట్లు తోచుచున్నది. కడచిన తరము లెన్నో స్పష్టముగా వివరించి యా గ్రంథరచనమునాటికి సజీవులయియున్న పండితారాధ్యుని మనుమలను వారి సమకాలిక శిష్యులను మాత్రమే పేర్కొని వారందఱు తనయపరంపరాభివృద్ధులతో దేజరిల్లుదురుగాతమని సోమనాథు డాశీర్వదించినాడు. అట్లుగాక యనిర్దిష్టములయిన యా తనయపరంపరోత్తర పరంపరలన్నియు గ్రంథరచనమునకు మున్ను గతించిన భూతకాలిక పరంపరలే యని యర్థముచేసెడిచో సోమనాథుని కాలము నింకను నాలుగైదు శతాబ్దులు క్రిందికి ద్రోయవలసిన వ్యవస్థ యేర్పడునుగదా! కావున శ్రీ శాస్త్రిగారు తమ నిర్ణయమున కనుగుణముగనుండుటకయి శంకలుకల్పించి సోమనాథుని వాక్యముల కన్యార్థకల్పనము గావించు నిట్టిఫక్కి సక్రమము గాదని సహృదయులు గ్రహింపక పోరు.

ఇక సోముని కాలనిర్ణయ విషయమున కుపకరించు పూర్వాంధ్ర కర్ణాట కవుల ప్రశంసలు, అనుకరణములుగూర్చి శాస్త్రిగారి పూర్వపక్షవిధానము చిత్తగింపుడు.

సోముని దన యుద్భటకావ్యమున ప్రశంసించిన కన్నడకవి సోమరాజు గ్రంథరచనాకాలము గూర్చి కర్ణాటకవి చరిత్రకారులు గ్రహించిన 'సాసిరద నూఱఱువింద నాల్వత్తు నాల్కనె" యన్నదానికి కొన్ని వ్రాతప్రతులలో "సాసిరద నానూఱంద నాల్వత్తు నాల్కనె" యను వ్యాకరణగుప్త పాఠముగూడ గానవచ్చిన కారణమున, దానిని బట్టి సోమరాజు గ్రంథమును రచించినది శా॥ శ॥ 1144 న గాక శా॥ శ॥ 1444 (క్రీ॥ శ॥ 1522) లో నని కొందఱు గావించు వాదమునే వీరు గూడ శరణమొందిరి. ఈ సందర్భమున వీరు నేను నా "పాలకురికి సోమనాథకవి" అను గ్రంథములో సంగ్రహముగ నుదాహరించిన వాదోపవాదాంశములు మాత్రమే చదివి తమ విమర్శనమును సాగించినట్లున్నదిగాని కర్ణాట కవి చరిత్రకారుల నిర్ణయము పయి విమర్శనము గావించిన శ్రీ వేంకట సుబ్బయ్య, గోవిందపాయి గారల వ్రాతలపయి శ్రీ నరసింహాచార్యులుగారు తమ పూర్వనిర్ణయమునే సమర్థించుచు గావించిన పునర్విమర్శనమును స్వయముగా చూచినట్లు కానరాదు. ఆ గ్రంథరచనా కాలము క్రీ॥ శ॥ 1222 సంవత్సరమే యగుచో నందలి పద్యములు తదనంతర మనతికాలములో క్రీ 1550 ప్రాంతమున సాళ్వకవి రచించిన యలంకార గ్రంథములో లక్ష్యములుగా నుదాహృతములగుట సంభావ్యము కాజాలదను విషయమును వీరు లఘుదృష్టితో బరీక్షించి యేదో కొంత స్వల్పకాలాంతరమయిన నున్నది

కావున నిదియొక బాధకము కాదను సమాధానముతో దృప్తినందియున్నారు. నేటి ముద్రణాలయములు, తపాలాలు లేని యానాటి దేశపరిస్థితులలో వేర్వేఱు ప్రాంతముల తాళపత్ర లిఖితములయిన కావ్యములకు ప్రత్యంతరములు దేశాంతరముల వెలసి యందలి పద్యములు తరువాతి కవులు రచించిన లక్షణ గ్రంథములలో లక్ష్యములుగా గ్రహింపబడుటకు 25—30 సంవత్సరముల యవధి సరిపోవునని సహృదయు లంగీకరింపజాలరనియే నా విశ్వాసము. సోమరాజు గ్రంథరచనా కాలము క్రీ॥ శ॥ 1222 అయినను సోమనాథు డాంధ్రులకు గర్ణాటులకు గూడ నుపకరించు విధమున సంస్కృతపదభూయిష్ఠములుగ, బసవ స్తవాత్మకములుగ గూర్చిన లఘుకృతు లానా డెప్పటి కప్పుడే శ్రీశైలయాత్రాదికములలో కన్నడులకు గంఠస్థములయి కర్ణాటదేశమున బ్రచారమగుటకు గల యవకాశముల గుఱించి యింతకుమున్నే ముచ్చటించి యుంటిని గదా! ఇంతకు గ్రంథరచనాకాలము వివాదగ్రస్తమయియున్న యా సోమరాజు గ్రంథములోని పద్య మొక్కటియే సోమనాథుని కాలనిర్ణయమునకు సాధకముగా నస్మదాదులము గ్రహించుట లేదుగదా: నరసింహబల్లాళుని దండనాథుడయి క్రీ॥ శ॥ 1150—1160 ప్రాంతమున బ్రసిద్ధివడసిన కెరెయ పద్మరసుయొక్క మనుమడు విశ్వారాధ్యుడు తన శివ పంచ స్తవవ్యాఖ్యానములో సోమనాథుని నామతః పేర్కొనెనని నేను వ్రాసిన విషయము గూర్చి శ్రీ శాస్త్రిగారు తేలికగా నది ప్రామాణికత్వము సిద్ధింపని యొకానొకరి వాక్యములపయి నాధారపడినది కావున నప్రామాణికమని సెలవిచ్చి తేలికగా సంతృప్తినందిరి. వీ రెంచిన యా యప్రామాణికత్వ మెట్టిది? విశ్వారాధ్యుడు సోమనాథుని పేర్కొనుటయా? అతడు కెరెయపద్మరసు వంశ్యుడనని చెప్పికొనుటయా? పద్మరసునకు తొమ్మిదవ తరమువాడయిన పద్మణాంక కవి యాతనిగూర్చి క్రీ॥ శ॥ 1385 ప్రాంతమున రచించిన పద్మరాజపురాణమున నొసంగిన వంశానుక్రమణికలో విశ్వారాధ్యుని పాండిత్యాదికముల బ్రశంసించుచు నాతనిని బద్మరసు పౌత్రునిగా జెప్పుటయా? ఈ వంశానుక్రమణికాభాగము నా కావ్యమునుండి కీ॥ శే॥ శ్రీ వీరభద్ర శర్మగారు తమ శివపంచ స్తవి యవతారికలో నుదాహరించుటయా? ఏది యెట్లు లప్రమాణమో నిరూపింపని యీ రిక్తమాటలవలని ప్రయోజన మేమి? యథావాక్కుల అన్నమయ్య, బద్దెన, తిక్కన మున్నగువారి యనుకరణములగూర్చి, వారు సోమనాథుని గాక సోమనాథుడే వారి ననుకరించెనని తలంపదగునని శాస్త్రిగారి సమాధానము. సోమనాథుని కాలమునుగూర్చిన తమ నిర్ణయమును నేను పైని వ్రాసినట్లు సమర్థములగు శాసనప్రమాణములతో వీరు నిలువరించునప్పు డట్లు తలంచుట కస్మదాదుల కభ్యంతరముండదు. కాని యట్టిది జరుగనప్పు డిప్పటి యాధార సామగ్రితో సోమనాథుడే వారికన్న ముందున్నవాడని తలంపనయియున్నదని మనవి చేయుచున్నాను.

ఆంధ్రదేశము త్వరలో తురుష్కాక్రాంతము కానున్నదని త్రికాలవేదియగుట నెఱింగి సోమనాథుడు చరమదశలో కన్నడదేశమున కేగి యచ్చట శివైక్యమయ్యెనని పిడుపర్తి సోమన పద్య బసవపురాణావతారికలో జెప్పిన సంగతులలో సత్యము గాని సారస్యముగాని లేదని చెప్పుచు నాతని కర్ణాటదేశనిష్క్రమణమునకు నచ్చట ఘటిల్లిన యాతని లింగైక్యమునకుగల వాస్తవ కారణములను తోంటదార్యుని సోమేశ్వరపురాణమునుబట్టి నే నుదాహరించియున్నాను. కర్ణాట కవి యగు తోంటదార్యునివాక్యములకన్న (పుక్కిటిపురాణ రూపకమగు ప్రతాపచరిత్రము ననుసరించి) పిడుపర్తి సోమన చెప్పిన వచనములే పరమప్రమాణములుగా గ్రహింపదగునని శాస్త్రిగారి సమాధానము. కన్నడ దేశమున జరిగిన సంగతుల కాప్రాంతము వాడగు తోంటదార్యుడు చెప్పిన వాక్యములకున్న ప్రామాణ్యము పిడుపర్తి సోమన మాటలకు వాటిల్లదని విజ్ఞు లెఱుంగకపోరు. మఱియు నేటికిని కల్యక్షేత్రమున సోమనాథుని సమాధియున్న మఠావరణములోనే యాతడు సందర్శింప నేగిన మహాభక్తురాలు చెన్నమ్మగారి సమాధి, "చెన్నమ్మ గవి" యను పేరితో విలసిల్లుచు తోంటదార్యుని కథకు బ్రత్యక్షప్రమాణముగ నున్నది. నా గ్రంథమున సోమనాథుని సమాధియున్న చిత్రపటములో నెడమవయిపు మూలలో నిలువుటాళ్లతో నెత్తుగా గాన్పించునదే "చెన్నమ్మ గవి". తురకలొకచో నమంగళ మొనర్చి మఱొకచో గౌరీకల్యాణము పాడలేదు. ఇంచుమించుగ నేక కాలముననే కాకతీయరాజ్యముపయినేగాక కన్నడ దేశమున మైసూరుప్రాంతమందలి హొయసల రాజధాని ద్వారసముద్రము, కాకతీయరాజ్యమునకు బడమర నున్న దేవగిరి రాజ్యభూములపైని వారు దాడులు గావించుట చరిత్ర ప్రసిద్ధము. ఆంధ్రభూమి విపన్నమయియున్న సమయమున కన్నడదేశము సురక్షితముగా లేదు. కావున పిడుపర్తి సోమన వ్రాతలందలి యప్రామాణ్యమును దేశచరిత్రముగూడ రాద్ధాంతమొనర్పగలదు.

సోమనాథుని కాలనిర్ణయమునకు నిర్బాధకముగ సహకరించు కాకతీయ శాసనము లింతవఱకు దొరకకుండుట మన దురదృష్టమే. అయినను నాతడు మొదటి ప్రతాపరుద్రుని కాలమునగూడ నుండెననెడి యభిప్రాయమునకు "గుడ్డిలో మెల్ల" యనురీతిగా నయిన దోడ్పడు శాసనమొకటి (శకవత్సరము లేనిది) కొండవీటి దండకవిలెనుండి నా మిత్రులు కీ॥ శే॥ శ్రీ మద్దులపల్లి గురుబ్రహ్మశర్మగారు తమ "కొండవీటి సామ్రాజ్యము" అను గ్రంథమున నుదాహరింపగా దానిని నేను నా వ్యాసములలోను గ్రంథమందును చేర్కొనియుంటిని. శకవత్సరము లేనిదిది యెట్లు ప్రమాణమగునని, యిందలి ప్రతాపరుద్రుడు రెండవ ప్రతాపరుద్రుడేయని యేల తలంపరాదని రామకృష్ణశాస్త్రిగారి యాక్షేపము. సప్తర్షి ప్రీత్యర్థముగ దద్గోత్రీయులగు ద్విజుల కేడుగ్రామములు, త్రిమూర్తులపేర మూడు గ్రామములు, సోమనారాధ్య గురునికి పిడుపర్తి పురమును, ఆదియందు ప్రతాపరుద్ర భూపాలుడు రుద్ర సంఖ్యాకముగ నగ్రహారములొసంగెనని యీ శాసనమందలి సారాంశము. అది కేవల మా భూపాలుడు వెలయించిన శిలాశాసనమో తామ్రశాసనమో గాక శ్లోకరూపకమయిన దాన విషయ ప్రస్తావనమైయుండునని నా యభిప్రాయము. ఆ కాలమునకు సంబంధించిన సోమనారాధ్యుడు వేఱొకడు లేనందున పాలకురికి సోమనయే మొదటి ప్రతాపరుద్రునివలన పిడుపఱ్ఱు నగ్రహారముగా బడసియుండునని శ్రీ గురుబ్రహ్మశర్మగారు తలంచిరి. "ఆదౌ ప్రతాపరుద్రాఖ్యో" అను వాక్యమందలి "ఆదౌ" శబ్దముగూడ మొదటి ప్రతాపరుద్రుడే దాతయనుటకు ద్యోతకము. రుద్రాంశ సంభవుడు, త్రిలోచన పల్లవుని బిరుదములను ధరించినవాడు నగు నీ ప్రథమ ప్రతాపరుద్రునకు "ముక్కంటి" యను వ్యవహారముగూడ నుండెనట. ఆతని కాలమున హనుమకొండ, ఓరుగల్లు, ధరణికోట గూడ ప్రధాన రాజధానులుగా నుండినట్లు కానవగును. కొండవీటి దండకవిలెలోనే యుదాహృతమయిన బందరు శాసనమందు గూడ నాతడు ముక్కంటియను నామముతోనే పేర్కొనబడినాడు. "శకాబ్దే శాలివాహశ్చ నేత్ర శాస్త్రాంబరేందుకే (1062) మాసే కృష్ణ చతుర్దశ్యాం విక్రమేమాఘసంజ్ఞికే । ముక్కంటి నామరాజాచ పాలితే

(అప్పటి కాతడు తండ్రియగు రెండవ ప్రోలరాజు ప్రతినిధిగానైన ధరణికోట ప్రాంతములకు బరిపాలకుడుగానుండి యుండవచ్చును) మఱియు బూర్వోక్తములయిన సప్తర్షిగోత్ర ద్విజదత్త గ్రామముల ప్రశంసించుచు వినుకొండ దండకవిలెలోగూడ నీ క్రింది పద్యమున్నది.

"సీ. నెరయ విశ్వామిత్ర నిలయంబు కారుచో
  లొకటి భరద్వాజునకును నొలస
కడునొప్పు గుంటూరు గౌతమస్థానంబు
  వరుస గశ్యపునకు వంగిపురము
జమదగ్నికినగల్లు జగతి కారముచేడు
  అత్రేయమానికి నాశ్రయంబు
అత్యంతనిష్ఠతో నలరెడు తపమున
  నొనరు వశిష్ఠున కుప్పటూరు
గీ॥ కరుణతోడుత సద్ద్విజగ్రామణులకు
గ్రామగ్రాసంబు లేడేసి ఘనతనిచ్చె
బల్లవాదిత్య త్రైనేత్ర పల్లవుండు
కాలగళువట్టి ముక్కంటి కాకవీటి
జగతి బెంపొంద దాతల చక్రవర్తి
దానమొగినిచ్చె నాచంద్ర తారకముగ
బ్రాహ్మణులకెల్ల వృత్తులు బలసినిగుడె
రాఘవస్వామివలె భువి రాజరాజు."

ఇందుగూడ ముక్కంటినామమే యుదాహృతమయినది. ఇట్టి వ్యవహారనామము రెండవ ప్రతాపరుద్రునకుగూడ నున్నట్లు కానరాదు. కావున నీ స్థానిక గాథా లేఖ్యములు (*Local records*) గూడ సోమనాథుడు మొదటి ప్రతాపరుద్రుని రాజ్యావసాన కాలమునగూడ నుండెననెడి యభిప్రాయమునకే తోడగుచున్నవి. పెక్కు లసంగతులతోగూడిన యంబయదేవుని నీలగంగవరము శాసనముకన్న నివి ప్రమాణములు కానేరవా?

సోమనాథుని కాలనిర్ణయ విషయమున నీలగంగవరము శాసనము సమర్థము కాజాలని విషయమును శ్రీ రామకృష్ణశాస్త్రిగారు కొంతవఱ కాంతరంగికముగనైన గ్రహించియుండకపోరని వారి వ్యాసాంతమందలి "ఇంతకంటె బలమైన ప్రమాణములు దొరకినప్పుడు శర్మగారి మతముగూడ మారిపోవచ్చును. అందు విచిత్రమేమియు నుండదు." అను వాక్యముల వలన ద్యోతకమగుచున్నది. ఆ శాసన మెట్టులసమర్థమో వలసినంత నిరూపించియే యుంటిని. కావున సమర్థములు, నిర్బాధకములు నగు శాసనముల వెలికిదీసి సోముని కాలనిర్ణయమునుగూర్చి తెగతెంపులులేకున్న యిట్టి చర్చలకు స్వస్తి చెప్పుటయే యవశ్యకర్తవ్యమని శ్రీ రామకృష్ణశాస్త్రి ప్రభృతి మిత్రులను మరల హెచ్చరించుచు విరమించుచున్నాను.

నాటిక

# సమ మట్టం

శ్రీ కవికొండల వెంకటరావు

## రంగము: 1

[సదానందుని ఇల్లు  ఉదయంపూట]

సదానందుడు: సర్వం సమ మట్టం చేయమంటే, ఏమి సమమట్టం అని నీ అభిప్రాయం?

సంజ్ఞాలేఖిని: నాబోర! నామోర!

సదా: అవి రెండూ సమ మట్టంగా కాలమే చేస్తుంది, ముసిలితనం వచ్చినకొద్దీ! మనిషికి చప్పిదవడలు పడేవులే, మరీ మరీ ఏళ్లు పైబడినకొద్దీ!

సంజ్ఞా: నెలకు వెయ్యి జీతంపుచ్చుకుంటూంటే ఎన్నటికీ పడవు. బంగారప్పళ్లు కట్టించుకు నేరు.

సదా: ఆ సేతుహిమాచలం వున్న ఆరిందాకు, అడుక్కు సేవానికి నీవన్న ప్రకారం నెలకు వెయ్యి రూపాయలు ఇస్తూవున్నట్టాయినా, అమెరికా పెట్టుబడి, రష్యా పెట్టుబడి కాదుగదా, అలకాపురానిది కూడా చాలదు. నలభైకోట్లప్రజకు ఒక్కొక్కడికి ప్రతీ నెల వెయ్యి రూపాయలు అందజెయ్యడమంటే నెలనెలా నలభైకోట్ల వెయ్యిరూపాయిలు మన యీ భారత్యూనియన్ భరాయించాలి! తెలుసా?

సంజ్ఞా: పోనీ! మహాత్మాగాంధి అన్నట్టుగా అయిదువందలు!

సదా: అది గరిష్ఠప్రమాణంగా కొందఱి కుశాగ్రబుద్ధులవిషయమై అన్నమాట.

సంజ్ఞా: అయితే మీబోంట్ల మాటేమన్నారని మీ అభిప్రాయం?

సదా: నాకు ఇంతమంది బోంట్లు లేరు. నీ వొక్కతవే బోటివి.

సంజ్ఞా: ఇలా పెడర్థాలు కల్పించి, తుదకు ఒక సమస్యా తేల్చకుండా వీధిలోకి నడిచేరు. ఇప్పుడు చూడండి! పక్కింటావిడ ఊరగాయ పెట్టినట్టు పెట్టమంటున్నారు! పక్కింటాయన గడిస్తూన్నట్టు మీరు గడిస్తూవున్నారా? ఆయన అంతంత కండ గల కాయ పట్టుకొచ్చారు! అయిదువందలు వున్న కావడి ఆలా దింపించి అడిగినంతా వాడికిచ్చి పంపించి, కొట్టే బొట్టెణ్ణి, కూరే బొమ్మక్కని అందర్నీ అప్పజెప్పేరు. అయిదురోజులై ఆవాలు, కారం, ఉప్పూ అవీ ఎండగా ఉన్నప్పుడే ఎండబెట్టుకు దండిగా విర్పర్చుకున్నారు. వారికీ మనకీ సాపత్యము తెచ్చేరు! వార్ని మనల్ని ముందు సమమట్టం చేయండి! చూస్తాను!

సదా: ఏమీ లేదు! ఆ అయిదు వందల కాయల్లోను రెండువందల ఏభై మనవి అనుకో! ఆ ఆవ, కారం, ఉప్పూ వాటన్నింట సంగోరుభాగం మనదనుకో!

సంజ్ఞా: ఏమి! మీకు వ్రాసిచ్చేరా ఆయన?

సదా: అనుకోడానికేమే? అనుకోడానికి వ్రాతా కోతా కావాలీ?

సంజ్ఞా: అయితే అనుకోండి ఆ యిల్లాలు పెట్టినట్టే నేనూ పెట్టేనని.

సదా: అనుకోక వేరేలాగున్నానా?—అదిగో ఎవరో వచ్చేరు.

[పెరటివైపునుండి ప్రక్కింటావిడ ప్రవేశింపగా—సదానందుడు తాను తప్పుకున్నట్టు పరోక్షంగా వుంటాడు—ప్రక్కింటావిడ పేరు పశుపతమ్మ]

పశు: పిన్నిగారూ! మా ఆవకాయ ముక్కకు కారమెలా అంటిందో కాస్త చెప్పండీ! ఇదిగో ముక్క! బాబుగారింట్లో వున్నారా?

సంజ్ఞా: ఆఁ! ఉన్నారు!—ఆయనే చవిచూచి చెప్పేరు ఫస్టుగా వుందని!

పశు: ఆయన చెబితే మరొకర్ని అడగక్కఱలేదు. మగవాళ్ళల్లో రుచులన్నీ తెలిసినాయన మీ ఆయనొక్కరే, నామతంలో!

సంజ్ఞా: అయితే అగ్నిహోత్రంలో ఆజ్యము పోసినంత అహంకారం ఆయనకు.

పశు: కోటకంచు దిగజార్చడమే దానికిమందు! మీరు అలా చేయరు! ఒకమూల కోటగంచు ఎగదోస్తూ వుంటారు. ఆయనపైని ఆజ్యం పోస్తూవుంటారు. అగ్నిహోత్రం ప్రజ్వరిల్లక ఏమౌతుంది?

సంజ్ఞా: మీరు ఇప్పుడు పురాణం వినడానికి వెళుతూవున్నారా?

పశు: ఆయన ఇంకా అక్కడే వున్నారా?

[సదానందుడు నిష్క్రమించును]

సంజ్ఞా: లేరు! మీ ముక్క రుచిమాచి, చేదు పులుపు! దొడ్డకంపు! ఈలాంటి కాయ అంతంత వుండి వుండాలంటూ తేవడానికి కాబోలు మార్కెట్టుకు వెళ్ళేరు.

పశు: మరిలేదుట అలాంటి కాయ!

సంజ్ఞా: అయ్యో! ఆమాట రావడంతోనైనా చెప్పారుకారు! మీవో రెండువందల కాయ పుచ్చుకోమని వుందును!

పశు: ఆ కాయే దొరకాలన్న మాటేమిటి లేండి! అలాంటి కాయకూడా పనికివచ్చేని.

సంజ్ఞా: చెట్లన్నీ ఒక్కలాంటి కాయ ఎన్నడూ కాయవు.

పశు: అసలు కాసిన ఒక్క చెట్టూ మాత్రం, అన్ని కాయలూ ఒకలాంటివి కాస్తుందా? కొన్న అయిదువందల్లోను కొన్ని కూష్మాండాలు కొన్ని కర తలామలకాలు.

సంజ్ఞా: ఆమాట మా ఆయనకు సుతరాం తెలియదండీ?

పశు: తెలిసి మా ఆయన చేసిందేమిటి?

సంజ్ఞా: అన్నీ లాటుచేరంగా కొన్నారు కాబోసు. డబ్బుంది! కొన్నారు!

పశు: డబ్బు? వెధవ డబ్బు ఏం చేస్తుంది? సరుకుండాలిగాని! బాబుగారు తీసుకువచ్చిన కాయ నాకు చూపించాలి!

సంజ్ఞా: ఆయన కాయ తెచ్చేలోపున ఊళ్ళో ఊరగాయలన్నీ రుచి చూస్తాం మేం!

పశు: అంతా తలో వెంద్రుకాయిస్తే, ఇల్లాలికాక గొంగళీ అవుతుందట! మీ పనే బాగుంది!

సంజ్ఞా: మొగుడున్న యిల్లాలు తలవెంట్రుకివ్వదు. మొగుడు చచ్చినదాని తలకట్టు మనకొద్దు— ఇక గొంగళీ యేలాగు? (అని కంటతడి యోడుస్తుంది)

పశు: ఏదో చలోక్తిగా అన్నాను. నామాట పాటించకు తల్లీ! సంజ్ఞా! అంతలోకే మొగుడు చావడాలు అవీ ఎందుకనడం? కన్నీళ్ళుకూడా కార్చేవా?—ఏదో అన్నాను! ఎవరో కేకేస్తున్నారు! వస్తాస్తా!

సంజ్ఞా: ఇదిగో బొట్టుంచుకెళ్ళండి! (గద్గదకంగా.)

పశు: బొట్టెందుకులే ఈమాత్రానికి. (మోమోటంగా.)

సంజ్ఞా: పెట్టించుకెళ్ళకపోతే వొట్టు! (గంభీరంగా.)

పశు: అయితే పెట్టించుకుంటా! (అని బొట్టు పెట్టించుక నిష్క్రమించును.)

సంజ్ఞా: కుంకుంబొట్టన్నది కొంతమందికైనా సమమటానికి తీసికొసుందనుకుంటాను. (తాను బొట్టుంచుకొనును.)

## రంగము: 2

[సదానందునియిల్లు: మధ్యాహ్నసమయం]

సదా: సంజా! నేడు మనకు కన్నంపాటించి. "క్రాస్‌వర్డు పజిల్ కాంపిటిషన్"లో నాకు ఆరు వేల రూపాయల "ప్రయిజ్" వచ్చింది.

సంజ్ఞా: మీకు! ఆరువేల రూపాయలు! ఊరికేనే వస్తా?

సదా: ఊరికే అన్నానా? "క్రాస్‌వర్డు పజిల్ కాంపిటిషన్ ప్రయిజు"గా వచ్చిందనలే?

సంజ్ఞా: మీ రన్నవన్నీ ఇంగ్లీషుమాటలైనాగున్నాయి, ఒక్క "నాకు" అన్నమాట "ఆరు వేల రూపాయలు" అన్నమాట తప్పిస్తే!

[illegible]

ఇదిగో "చెక్!" ఇప్పుడే తపాలా 'ఇన్షూర్డు కవరు'లో పెట్టి ఇచ్చాడు అలా మార్కెట్టుకు వెడుతూంటే!

సంజ్ఞా: అయితే వెంటనే ఆ డబ్బెట్టి మీ రను కొన్న మామిడికాయ కొనేసుకు రాలేకపోయినారూ?

సదా: ఆవకాయ కాయకోసం ఆరువేల రూపాయల చెక్కు మార్చడమూ కే? వెఱ్ఱిదానా! నీకసలు

"క్రాస్" అంటే ఏమిటో "వర్డ్" అంటే ఏమిటో, "పజిల్" అంటే ఏమిటో "ప్రయిజ్" అంటే ఏమిటో తెలుసునా?

సంజ్ఞా: తెలియదుకనకే చెప్పమంటూవున్నాను. ఏవీ రూపాయలు? ఆరువేలూ?

సదా: ఇస్తే ఏం చేస్తావు?

సంజ్ఞా: ఒక వంద ప్రక్కింటావిడ మొహాన్ని పారేసి, మీరెల్లా పెడతారో అలా ఊరగాయపెట్టి, పెద్ద పింగాణీజాడీ సమేతంగా మనయింటికి పంపించి వేయమంటాను. మిగతేన్ని మిగతేన్ని- -నేను కట్టుకపు కాసులపేరు చేయించుకుంటాను.

సదా: ఇంకా

ంజ్ఞా: ఇంకా చేసే పనులైనా వున్నాయి. సత్యనారాయణ వ్రతం, వెంకటేశ్వర దీపారాధన చేదాం! పిల్లలేరుగా మనకు- -సంతాన గోపాల స్వామిని దర్శించివద్దాం!

సదా: పుట్టబోయే పిల్లల ఆకారం బంగారంతో పోతపోసి చూదాం అన్నావు కావు!

సంజ్ఞా: అలా చేసినా మంచిదే! బంగారం వండీ రూపేణా ఏ వస్తువున్నా ఎప్పటికైనా చలామణీ అవుతుంది. కాగితంగా మాత్రం ముంచబోకండి!

సదా: మరి వాళ్లు పంపిన ఈ చెక్కు కాగితమే?

సంజ్ఞా: అందుకే త్వరగా లోహంగా మార్చి వేయమంటూ వున్నాను. చెమటోసిరట్లుందే మీకు చాలాను. (అని విసరును)

సదా: చెమటోడిస్తేనే సిరిఅన్నాడొకడు!

సంజ్ఞా: మీకు విసరడంలో నాకూ చెమటోస్తూ వుంది! అవితే అందులో నాకూ కొంతభాగం వుందన్నమాటే!

సదా: చల్లపట్టున పోసే కమ్మటి చెమట కాదు వాడు చెప్పింది. ఎండచే వాడిన చెమటకు!– ఏదీ చెక్కేది?

సంజ్ఞా: బలేబాగుంది వరస!

[ఆవల వీధివైపు కేక "దాహం! దాహం!" అని]

సదా: వాడెవడో వేసివున్న పక్కవాటా తలుపు కొడుతున్నాడు; తీసివున్న మన గుమ్మంవద్ద అటువంటి మానేసి!

సంజ్ఞా: తలుపు వేసివున్నచోట దాహం అన్నవాడు తలుపుతీసి వున్నచోట అన్నమే అడిగేడు!— అడుగో! ఈలాగే వచ్చాడు!—పో అబ్బీ! పో! ఇంకా భోజనాలు కాలేదు.

ఆవలవాడు: అమ్మా! తల్లీ! అపరాహ్ణమైపోయింది: హరిజనుణ్ణి! తల్లీ! కుసింత వణ్ణంవుంటే పెట్టించమ్మా!

సదా: నేనే ఇంకా భోజనం చేయలేదు! నీకా పెట్టేది?

ఆవల: తమ రెవరుబాబులూ! నా కెఱిక లేక అన్నాను! క్షమించండి! తమ భోజనమైనాకే పెట్టించండి!

సదా: నా భోజనమయ్యాక ఆమెగారి భోజనమవ్వాలి!

ఆవల: అప్పుడే వడ్డిస్తారమ్మగారు! అదాకా ఇక్కడ పండుకొంటాను!

సదా: ఛీఛీ! ఆవల వీధిలో ఉండు! హరిజనుడివి! యిలా లోపలకు జొరబడరాదు. పో పో— ఒసేవు! సంజ్ఞా! ఎక్కడకు వెళ్లావు?

సంజ్ఞా: వసున్నా, నుండమనండి ఆ అబ్బిని! కుసింత వణ్ణం గంజిలో కలుపుకొస్తున్నాను.

సదా: అలాగవితే నేను ఈ అబ్బికి నా ఆరువేల చెక్కు "ఎండార్సు" చేసియిచ్చి పారేస్తూ వున్నాను.

సంజ్ఞా: ఆఁ! ఆఁ! అంతపనే (మగని సాహస కృత్యం నాపుతూ) ఇదిగో నా కుడిచేయివేసి ఆ చెక్కు అట్టేపెట్టేను!—ఇదిగో అబ్బీ! డాచేత నీ కందిస్తూవున్నాను! అందుకో వణ్ణంగంజీ!

ఆవలి: (అన్నం గంజీ పోయించుకు) ఎందుకు తల్లీ! మీ రిద్దఱు ఆలా పోట్లాడుకుంటారు?— పక్కింటి వారెవ్వరో ఇప్పుడు తీసేరు తలుపు. నేను దాహం దాహం అన్నంతసేపూ ఏమైందో ఈవిడ? (నిష్క్రమించును)

సదా: ఒరేవ్! భిక్షుకా! పోకుపోకు! ఇదిగో! చెక్కు! చెక్కు! (నిష్క్రమించును)

[పశుపతమ్మ ప్రవేశించును]

పశు: సంజ్ఞా! ఏమిటమ్మా అలా ఏడుస్తావు? ఇందాకటి కన్నీరా? ఇది మరోకన్నీరా?

సంజ్ఞా: ఇందాకటిదీ కాదు. ఇప్పటిదీ కాదు ముందు జరిగేదానికి తల్లీ!

పశుప: ముందు జరిగేదాని కిప్పటినుంచీ ఏడుస్తారుటే తల్లీ?

సంజ్ఞా: ఆరువేల రూపాయలచెక్కు ఆ పొయ్యో వాడి ఎదాన్ని పోస్తారుట మా ఆయన?

పశు: మీ ఆయనకు అంత చెక్కు ఎలా వచ్చిందే ఇంతలోకే?

సంజ్ఞా: సంతలో నెంబరు గుండాడారులా గుంది! ఏవేవో ఇంగ్లీషులో అన్నారు!

పశు: తిట్లా దీవనలా?

సంజ్ఞా: రెండూ కూడాను.

పశు: బాగానే వుంది!

సంజ్ఞా: మగపనులు మనకు తెలియవో పశుప తమ్మా! అయినాగానీ!

పశు: తెలిసివుండాలని భగవదేచ్ఛ కనుక అవితే, కొంతకాలం కాకపోతే కొంతకాలమైనా మగాళ్లమై యుందుం మనం!

సంజ్ఞా: అయినా—ఇన్నాళ్లు ఇష్టఱం కాపురం చేశాం! ఒక్కనాడూ చెప్పేరుకారు "క్రాస్" ట! 'వర్డు' ట! 'పజిల్' ట! 'ప్రెయిజ్' ట చటక్కున కొట్టారు ఆరు వేలు!

పశు: ఇఖనేం? నీకరువు ఆయనకరువు తీ( దన్నమాటే ఈకొడెనుంచి?

సంజ్ఞా: మీరే యీపైని కరువుతో కొట్టుకు పోయేవారు!

పశు: అదేమిటో సంజ్ఞమ్మతల్లీ! మాట అన భయం! కరవొచ్చేవు!

సంజ్ఞా: అవును ఇదివఱకల్లా ఏడ్చిందాన్ని, నేనే! ఇప్పుడు కరిచేదీ నేనే!

పశు: అదుగో మీఆయన! నేపోతున్నా!

సంజ్ఞా: మఱి బొట్టు?—మళ్ళీ వచ్చినప్పుడు రెండుసార్లు పెడతాలే!—అయినా ఆయనవస్తే నీవు వెళ్లాలని ఎక్కడవుంది శాస్త్రంలో? కూర్చో!

పశు: మీరూ మీరూ లెక్కెట్టుకుంటారు లాగుంది! నేనెందుకు మధ్యపానకంలో పుడకలాగు?

(నిష్క్రమించును)

[సదానందుడు ప్రవేశించును]

సదా: లెక్కాలేదు పిక్కాలేదు!—ఆవిడ వెళ్లిపోతూవుందే! ఇల్లా పిల్చి పూరగాయ పెట్టమని ఈవందా ఆవిడికిచ్చెయ్యి!

సంజ్ఞా: ఇవ్వవచ్చును! తొందరేమిటి? గాని— ఏం—ఆ ముండాకొడుక్కి అంటరాని పారెయ్యాలా ఆరువేలాను.

సదా: వాడు మళ్ళీ కనిపిస్తేగా! వీధిలో వాడు వీధిలో నే మాయమైనట్టు మలుపుతిరిగేశాడు. కేసినా అందం దే?

సంజ్ఞా: ఆపాళంగా ఆ పోవడం పోవడం బాంకికి పోయారా అన్నమైనా తినకండా?

సదా: బాంకికిపోయి ఏంచేశానని నీవూహ?

సజ్ఞా: సొమ్ము మార్చివుంటారు.

సదా: లేదు. ఎదో మంచికంపెనీ చూచి ఆ కంపెనీలో షేర్లు కొనమన్నాను.

సంజ్ఞా: ఆరువేలు ఆరు వేలు పెట్టి?

సదా: లేదు. అయిదు వేల తొమ్మిది వందలు షేర్లు కొనమన్నాను. మిగతా వందా ఇమ్మన్నాను నాచేతికి.

సంజ్ఞా: తెచ్చారా? ఆవందా?

దా: మఱి తేనూ? ప్రక్కింటావిడ కివ్వాలన్నావుగా!

సంజ్ఞా: నేనన్నాను మీరని? మీచే యిచ్చి రండి! వచ్చి స్నానం చేయండి!

సదా: అయితే నీ వివ్వవు?

సంజ్ఞా: నేనివ్వను సరిగదా నేనిం కావిడలో మఱి మాటే ఆడను.

సదా: అదేదో చూస్తా!

సంజ్ఞా: చూడండి! ఆవిడైనా మట్టం కావాలి? నేనైనా కావాలి.

[పశుపతమ్మ వింటూ ప్రవేశించి]

పశు: ఈ ఓ ఘాయిత్యపుమాట లెందుకు తల్లీ! ఆవందరూపాయలు అందిస్తే ఎవరుపడితే వారే పెట్టి పెడతా రూరగాయ! ఒక్క పక్కింటావిడేకాదు!— కుసింత చల్లబొట్టువుంటే ఖాయ్యి! పాలతోడు పొద్దు ఉంచుకోవడం మఱచిపోయాను.

[సదానందుడు వెనక్కు వెళ్లను]

సంజ్ఞా: ఆవిడ అంతే; నీవల్లా అయ్యావో? ఆవిడఅంతే—ఇదిగో చల్లబొట్టు.

పశు: వెళ్లొస్తా [నిష్క్రమించును]

[సదానందుడు ముందుకు వచ్చును]

సదానందుడు:—

చల్లబొట్టు చేసేను
సమమట్టంగా కొంత!
ఉల్లమిపుడు చల్లగుందా?
వందతోటి? నాసంజ్ఞా!

## రంగము: 3

[ఒకానొక పరిశ్రమాలయపు రుతి—వేలకొద్ది రాట్నములు తిరిగే చప్పుడు]

పరిశ్రమాలయాధికారి : ఇది గాలిరాని జయిలు కాదు. అంతా గాలిగా సుష్టి అడుక్కునే ఆరుబయలు కాదు. తీర్థంగాదు, తిరుసుగాదు. త్రిప్పండి రాటాలు! ఇది పరిశ్రమాలయం! ఇన్నాళ్లూ పాటుపడకుండా సంపాదించడం మరిగారేమో, కబోదులు కాలు లేనివాళ్లు! నేటినుంచి అలా సాగదు. సృష్టివాడూ త్రిప్పవచ్చురాటం, నడ్డివంగినవాడూ త్రిప్ప వచ్చురాటం! పాడండి నాతోకూడా!

[బృందగానం]

రాటమన్న రాముడు!
రాటమన్న రాగము!
రాటమె మనలక్ష్యము!
రాటము సిరిసౌఖ్యము!
బండినున్న పంగుకు;
పడవ సరంగుకు
వాటముగను తిరుగురా!
రాటముతో తీయరా!
నూలుకండె వేయరా!
సిగ్గుగదర శ్రమపడే
జీవనంబు చెమటలేక
గుమ్మంకడ నిలబడి
బిగ్గఱగా అమ్మా! అన!
సోదరా! సోదరీ!
మీరు మీరు బీదవార,
కారు! బిడియపడకుడీ!
రాటములను త్రిప్పగా
రండి సంబరంబుగా!
రాగ మనగ రాముడు
రాటమనగ రాగము!"

నేను సదానందుడుగారు పరిశ్రమాలయంలో 5900 విలువగల వాటాలు కొని మీ కంపెనీకు కూడు కలిపించారు. రండి! రండి! మీమీ పనులలో మెలగండి! మెళుకువగా ఉండండి!—అయ్యా! సదానందుడు గారూ! నమస్తే! ఆర్యా! బ్యాంకు మేనేజరుగారూ వందనం!

[బ్యాంకి మేనేజరూ, సదానందుడూ ప్రవేశము]

బ్యాంకి మేనేజరు : సదానందుడుగారూ! ఈ పరిశ్రమాలయం నూతనంగా నెలకొల్పారు. ఇందులో 'షేర్లు' తీసికొన్నవారు అదృష్టవంతులు. వాళ్ళ సొత్తు అడుక్కుతినేవాళ్ళకు వెళ్ళి వాళ్ళను అడుక్కోకుండా చేస్తుంది. పైగా రాటపుం బరిశ్రమను అభివృద్ధి గావిస్తుంది. మీ 5900 పెట్టి ఇందులో వాటాలే కొన్నాం! ఈపైనుంచి ఏటేటా మీకు లాభం పంచి పెట్టబడుతుంది.

సదా: లాభం ఏమాత్రం వస్తుందంటారు? మీ బ్యాంకిరేటును మించివుంటుందా? మీ బ్యాంకిలో వుండివుంటే అసలు కెన్నడూ మోసంవుండదేమో! నా అభిప్రాయం ఈషేర్లు ఎవరికైనా మీరే అమ్మి, ఆ సొమ్ము నూటికి 95 వచ్చినా 85 వచ్చినా, అదంతా మీ బ్యాంకిలో ఫిక్స్డు డిపోసిట్టుగా వుంచడం మెఱుగనీ! ఏమంటారు?

బ్యాం. మే: మీరు అడుగడుక్కీ ఈలా అభిప్రాయం మార్చుకుంటూవుంటే ఏపరిశ్రమా ముందుకు రాదు.

సదా: మనం 'కాపిటలిస్టు'లము. డబ్బు రాయళ్ళము. జమీందార్ల తరువాత జమీందార్లంత వాళ్లం. మన డబ్బు అలా శాశ్వతంగా వుండాలి! మన మెప్పుడు పైనే ఉండాలి.

రాటముత్రిప్పే ఒక భిక్షుకుడు : అయ్యా! సిత్తం సిత్తం! ఇది తమరు మా కిట్టించిన వణ్ణం! దణ్ణం దణ్ణం. (అని సదానందుడు కాళ్లు పట్టుకో బోవును.)

పరిశ్రమాలయాధికారి: సిగ్గు! సిగ్గు! ఈ స్వతంత్రభారతంలో ఒకరికాళ్లు ఒకరింక పట్టుకో నవసరంలేదని ప్రవచనం! మీరంతా బుజాలమీద తలకాయలున్నవారిలా తిరుగవచ్చును.

సదా: అడుక్కునే అలవాటు మానివేసినారు కాబట్టి మరి మీరు అడుక్కో చూడనవసరములేదు.

బ్యాం. మే: ఇత డొక్కడను అలాంటి తప్పు పని చేశాడుగాని తక్కినవాళ్ళు చూశారా ఎంత నిటార్గా నిలబడివున్నారో!

భిక్షుకుడు: ఏమండి బాబూ! ఉపకారం చేసిన వారి పాదాలట్టుకుంటే తప్పా అండీ!

పరిశ్ర: ఇది తప్పొప్పులు చెప్పుకునే తావు కాదు. వారి పెట్టుబడిమీద ఎంత వడ్డీ కిట్టంపు అవు తుందో చూచుకుంటున్నారు! వారిని కలవర పెట్టకు!

వారిని కలవర పెట్టడానికి నే నెవరిని బాబులూ! రాములుం బాబులూ!

పరిశ్ర: అదే! ఆ అలవాటే కూడదన్నాది! మరి రాములుం బాబులూ! బంగారపుటింగ్లు అన్నారా తన్నారో!

భిక్షు: మరేమనమన్నారు?

పరిశ్ర: ఏమీ అనవద్దు. మీ పరిశ్రమ మీరు కానీయండి!

[భిక్షుకులంతా కలిసి పాడతారు:]

రాటమన్న రాముడు
రాటమన్న రాగము
రాటమె మన లక్ష్యము
రాటమె సిరిసౌఖ్యము.

(ఒకడు నవ్వును)

బ్యాం. మే: ఒరేవు! భిక్షుకా నీవు అలా నవ్వ రాదు! పని చేసూ!

నకటి జన్మలో సంగతి జ్ఞాపకంవచ్చి నవ్వుకున్నాను!

సదా: వెనుకటి జన్మ! భిక్షుకా! నీకు వెనుకటి జన్మల సంగతి కూడా జ్ఞాపకమా?

: వెనుకటి జన్మదంటే మొన్న మొన్న అనుభవించిందే వెనుకటి జన్మలోనిది లాగు జ్ఞాపకం వచ్చేని!

సదా: (పోల్చి) నీవేనా మా సుమ్మంచగ్గర "దాహం" "దాహం" అని అరిచింది?

భిక్షు: ఆఁ! తమ కింకా గాపకం వున్నాను! సిత్తం! సిత్తం! తల్లిగారు బాగావున్నారా?

సదా: తల్లిగారంటే?

భిక్షు: నాకు నచ్చేచ్చగా వణ్ణం గింజిపోసి నోరు! ఆ తల్లి! సీతమ్మతల్లి!

సదా: సంజ్ఞాలేఖినమ్మగారా? పసుపతిమ్మ గారా?

భిక్షు: సం! సం! ఆమే! ప్రక్కింటావిడ గారు!

సదా: ఆఁ! బాగానే వున్నారు! అదా నీ వెను కటి జన్మ?

పరిశ్ర: కాక మరేమిటి? మొన్నటివాకా ఏళ్లందలూ బిచ్చగాళ్లు. మీ మూలాన్ని నేను లక్ష్మీప్రసన్నులు!

సదా: అందఱం అంతేనని నా నమ్మకం!

బ్యాం. మే: అయినా తేడావుంది వాళ్ళకూ మీకూ! వాళ్ళు ఎంతకాదన్నా శ్రామికవర్గం, మీరు బూర్జువాజాతివారు.

సదా: మీరు?

బ్యాం. మే: మేం మీకు మీకు సేవకులం.

సదా: నెలకు మూడువందలు జీతం తీసికొంటూ సేవకులు? సేవకులు?—సెలస్ఫ్ షేక్ హేండ్!

బ్యాం. మే: అవితే తమవేళ్లు ఈ పరిశ్రమాలయ వ్యాపారంలో వుంచేస్తాం!

సదా: ముఖ్యంగా! ఆనాడు నా ఆరువేల రూపాయల చెక్కు ఆ భిక్షుకుడికి ఎండార్సు అయి వుండవలసినది. నేను ఆరువేలమంది కుపకరిస్తూవుంది! ఎంతో సంతోషంగా వుంది!

బ్యాం. మే: పైగా మీకు వడ్డీ వస్తూవుంది!

సదా: అంటే అదీ వీళ్లకే ఉపయోగించే ఏర్పాటు చేయించమనా తమ కోరిక?

బ్యాం మే: నా కోరిక కాదు. ఈ బిచ్చగాండ్ల అందఱి కోరికా అని పరిశ్రమాలయాధికారిగారు తమతో మనవిచేయమన్నారు:

సదా: మీ యిష్ట మేలాగో అలాగే కానివ్వండి!

పరి: సెభాష్! ఇదిగో! "ఈ కండిబొట్టు అమ్మ గారికి బహుమానం; ఈ నూలు దండ తమకు!" అని భిక్షుకులందఱూ అందిచ్చేరు.

సదా: (అందుకుంటూ)

కండిబొట్టు లోకంలో
కలిమి లేములచే
భేదభావ ముండనీదు!
సమమట్టం జూపుఁ బ్రజన్.
రాటము మన రాముడు
రాటము మన రాగము.

## రంగము: 4

### [సదానందుని యిల్లు]

సంజ్ఞా: ఏమి తేల్చుకొచ్చారు బ్యాంకికి వెళ్లి?

సదా: ఆ వెళ్లడం ఒక్క బ్యాంకికే కాదు. పరిశ్రమాలయానికి కూడా వెళ్ళివచ్చాను.

సంజ్ఞా: ఇంతకూ ఏమి తెచ్చారు? రూ 5900 మీద వడ్డీ ఎంత వచ్చింది?

సదా: ముందు నీవు చెప్పు నీ చేతికిచ్చిన వంద ఏలా ఖర్చు అయ్యాయో?

సంజ్ఞా: ఉస్కొ మంటే ఉస్కొ మనడం నేర్చారు! వందలో ఏభైకి ఆవిడ లెక్క చెప్పవలసి వుంది.

సదా: ఏభైఅయ్యాయే ఆవిడ పెట్టిన ఊర గాయకు?

సంజ్ఞా: మీరేగా ఆవిడకు ఒక ఏభై ఇమ్మన్నది?

సదా: ఏది? ఆవిడ తగలేసిన పద్దు ఏభైకా?

సంజ్ఞా: ఒక్క నూనికే అయింది ముప్ఫైఆరు రూపాయిలు. అంతచేటు నూనిపోసికోనా? ఇలా ఎత్తితే ఊటకు బదులు అంతా నూనే! మఱేన్ని నేనవితే సరికిసరి అన్నీ పోస్తాను. ఆమె ఆవ ఎక్కువ పోసేసింది లాగుంది, ఆవాలకో పదిరూపాయిలు వేసింది. మిగతావి అలాఅలా సరిపెట్టి భేరీచేసి వెరసి ఖర్చు ఏభై రూపాయలు చూపించింది. ఇదిగో విడి కాగితమ్మీద కూడా కాదు వ్రాయడం? ఒకరి సొమ్మైతే ఎంత వోయిభోగమైనా చూపించవచ్చు. అట్టబొక్కు మీద వ్రాసింది! అట్టకో సినిమాబొమ్మ అంటించింది!

సదా: అవన్నీ తన ఖర్చునా? మన ఖర్చునా?

సంజ్ఞా: తానెందుకు పెట్టుకుంటుంది బొక్కులో మన పద్దులు వ్రాసి?

సదా: అవునులే! కనబడుతూంది కు 0-3-6 బొక్కుకు 0-6-0 మాగజీనుకు.

సంజ్ఞా: మాగజీను ముఖచిత్రం చింపి అట్టకు అంటించి మళ్ళీ విడి కాగితాలు తానే తీసుకుంది. ఏ పాత కాగితాలు కొనేవాడి కిచ్చుకునేనో?

సదా: "డొమెస్టిక్స్" "పొలటిక్స్"ను మించి వున్నాయి!

సంజ్ఞా: ఇంతకూ చెప్పేరు కారు నేనడిగే వడ్డీ మాట?

సదా: మిగతా ఏభై ఎలా ఖర్చు అయినాయో చెప్పొద్దూ ముందు? నీవు చెప్పాక నేను!

సంజ్ఞా: ఎలా ఏమిటి? 1922 లో పెరుగుమంత అర్ధణా ఖరీదు అవితే 1952 లో అర్ధరూపాయ. 1922 లో చింతపండు వీశడు అయిదణాలన్నర అవితే 1952 లో రూపాయ అర్ధణా! 1922 లో నూనె వీశెడు రూపాయపావులా అయితే 1952 లో నాలుగు రూపాయల పావలా! మరి నెయ్యి డాల్డాయే 1952 లో వీశె నాలుగు. అచ్చావు నెయ్యి 1922 లో వీశె రెండురూపాయిలే. ఇలా అంతా ఆజ్యం పొయ్యకుండానే అగ్నిహోత్రం మండుకుపోతూన్నట్టు మండుకుపోతూ వుందికదా! ఇంక మీరిచ్చిన ఏభై రూపాయలుకు పద్దు వ్రాసి నేను చూపే దేమిటి? ఉప్పుని ఎగిరిపోయినాయి ఏభై యీ వొక్క పూటలో! మీరేగా తిన్నారు నిన్నను బొబ్బట్లు! పలాచగా మైదాపిండి హత్తి పనస్సారతో వేశాను. పెనం ఇంకా అది తోమనే లేదు:—ఒసేవ్! వెంకుళ్ళూ! ఏమే పెంకెతనం?—వెళ్ళు వెళ్ళు! తోమకుండా వెళ్ళు! మళ్ళీ వచ్చినప్పుడు నీ వొళ్లు హూనమైతీరుతుంది.

[అవలనుంచి] వెంకుళ్లు: మీరే వండుకు తిన్నారు గాని నాకేమైనా పెట్టారా ఒక్క బొబ్బట్టైనా నిన్న?

సంజ్ఞా: ఏమిటే పెట్టేది వెన్నట్టు?

సదా: అఁఅఁ! దాన్ని కొట్టబోకు! ఈరోజుల్లో పనిచేసేవాళ్లు కొట్టినా తిట్టినా పడరే!

సంజ్ఞా: పడకేం చేస్తారు? పది రూపాయలు పారేస్తే పాదా లొత్తేరు!

సదా: నయం కాదూ—వాళ్లు పది రూపాయలు పుచ్చుకు ఏదో పనిచేస్తారు. మనం పది రూపాయలు ఇచ్చి మళ్లీ పాదా లొత్తేం?

సంజ్ఞా: నే నెవరి పాదాలూ అలా వొత్తలేదు.

సదా: నీవంటే నీవేనా ఏమిటి?—లోకంలో ఎందరు స్వాములవారికి పాదపూజ చేసుకుంటం లేదు? డబ్బు సమర్పించడం లేదు? నిజంగా ఊరికే మొక్కే వాళ్ళందర్నీ తీసుకువెళ్ళి ఆ రాటాల పరిశ్రమాలయంలో పనికి పురమాయిస్తే మన దేశం ఈలాంటి దౌర్భాగ్యస్థితిలో ఉండదు.

వెంకులు: [చేయవడ్డొస్తూ] ఈలాంటి అమ్మలుంటే ఉండకేం చేస్తుంది?—ఇదిగో! తల్లీ మీ పెనం! తెల్లగా తోమి బోర్లించాను.

సంజ్ఞా: నీవు తోమింది బూర్లెమూకుడే! పెనం అట్టే పెట్టేశావు!

వెంకు: అవితే రెండింటిలోనూ వండేరు!

సంజ్ఞా: ఆc! బూర్లెమూకుడుతో కూర వేయించుకున్నాం! పెనముమీద బొబ్బట్లేసుకున్నాం!

సదా: మనం వండుకున్నదీ విన్నదీ అంతా దానికి చెప్పాలిటే? సంజ్ఞా!

సంజ్ఞా: చెప్పకపోతే మాత్రం తెలియదూ? అదేం ఆడది కాదా?

సదా: ఆడదే కాని పనిమనిషి!

సంజ్ఞా: నా కిన్ని తెలియవు. అందరూ మనుష్యులేనని నా అభిప్రాయం. నే నందరికీ వొక్కలాగే పని చెప్తాను. మీరంటే నాకు ఎక్కువ లేదు అదంటే తక్కువ లేదు!

సదా: అంత ఎగురు నీ కుండబట్టే అది ఆ పెనంతోమకుండా పెరటిగుమ్మాన్ని పోయింది.

సంజ్ఞా: అది తోమకపోతే నే తోముకుంటాను. తిన్నదాన్ని తోముకోవడం అబ్బురం కాదు.

సదా: అంట్లుతోమ పడేశావులాగుంది?

సంజ్ఞా: అవితే మళ్లీ స్నానం తగులడుతాను!

సదా: అబ్బ! అబ్బ! ఆలాంటి ఓఘాయిత్యపు మాటలే ఆడకూడదంటాను. నీవు మడిగట్టుకున్నప్పుడు పక్కింటావిడ తోమి పెట్టాలి. పక్కింటావిడ మడిగట్టుకున్నప్పుడు నీవు వారికి తోమి పెట్టాలి. ఈలా ఈ పైనుంచి మనం అన్యోన్యం సాయపడితే ఈ కార్మికసంఘంయొక్క బండారం బయలుపడుతుంది.—ఇదిగో!

సంజ్ఞా: ఏమిటో తెచ్చారు? పత్రసూత్రంతో పాటు!

సదా: ఏమీ లేదు! మొన్నటి భిక్షుకు నీకు బహూకరించిన కండిబొట్టు.

సంజ్ఞా: ఆc ఆc! నాకు తిరిగి కనిపించదా మీకు?

సదా: కనిపించడ మేమిటి? కళ్ళల్లో నవ్వాలి కిందుకుంటూ కవ్వించావు!

సంజ్ఞా: ఏమి అదృష్టజాతకులండీ! సంతోషమంటే వాడిదే సంతోషం! వాడికది నా కివ్వాలని ఎలా బుద్ధిపుట్టిందో!

సదా: అది వాడి పరిశ్రమ యిచ్చాను!

సంజ్ఞా: రాటము వడికే పరిశ్రమ ఉన్న మాట?

సదా: వాడే అన్న మాటేం? అందరు ఏద్దు గాండ్లు చేసే పనీ అదే ఇప్పుడా పరిశ్రమాలయంలో!

సంజ్ఞా: ఆ పరిశ్రమాలయపు షేర్లు మీరు కొన్నారా?

సదా: కొనడమేమిటి? నా సర్వస్వం అందుకే ధారపోసి వచ్చేను!

సంజ్ఞా: వడ్డీ కూడా?

సదా: ఆc! ఇదిగో నూలుహారం! అక్కడి కార్మికులు నాకు వేసింది!

సంజ్ఞా. మీరు చేసిన మేలుకిది ప్రతిఫలం అన్నమాట?

సదా: ప్రతిఫలం కాదు! గౌరవం!

సంజ్ఞా: మళ్లీ మనకు అబ్బాయి పుడితే?

సంజ్ఞా అదెట్లా?

సంజ్ఞా: ఈపొద్దు నాకు ఒకిలింతవస్తే ప్రక్కింటావిడ నెల తప్పిందేమో అంది.

సదా: ప్రక్కింటావిడంటే పశుపతమ్మేనా?

సంజ్ఞా: కాదు. ఆమెకూ నాకూ ఆనాటినుంచీ మాటలే లేవు. చల్లబొట్టు ఎందుకు పోశానా అని అనిపిస్తుం దిప్పటికీ!

సదా : ఇంకెవరు?

సంజ్ఞా : ఈ ప్రక్కనున్న ఆవిడ.

సదా : ఆవిడెప్పుడూ అంటుండే దెప్పుడూ! ఆవిడ కడుగడుక్కీ సెల తిప్పుతూ నేవుంటుంది.

[అవలనుంచి] పసుపతమ్మ : ఓ అమ్మో! సంజ్ఞా! నే పెట్టియిచ్చిన ఊరగాయ ఎలా వుందన్నారో మీ ఆయన?

సదా : ఇంకా ఊటలు వెయ్యడంలోనే వున్నారు!

సంజ్ఞా : అదేమిటండీ! అలా మాటాడేసేస్తారు అందరితో ఏని?

సదా : నీకూ పసుపతమ్మకూ మళీ మాటలు లేవన్నావుగా?

సంజ్ఞా: ఊరికే అన్నాను గాని, మీ రిచ్చిన కండిబొట్లు ఆవిడే పోసి పెట్టాలి! పురుడు ఆవిడే పొయ్యాలి!

సదా: ఆవిడ?

సంజ్ఞా: ఆవిడెవన్నీ పైపై నంగనాచి కబుర్లే! నిజం చెప్పాస్తే ఆవిడే పనిమంతురాలు.

సదా: అవిడే ఆపి దిచ్చిన వస్తు సరెంతే!

సంజ్ఞా: నే కాదంటే గా!—కరువులో అధిక మాసంలా పురిటిఖర్చు ఒకటి మనకు ఈనుండి అమ్యేటట్టుంది!–తొలిసారి కనడం కూడాను! (అని కన్లనీళ్ళెట్టుకొనును).

సదా: ఈ వేడికన్నీళ్లు చల్లటి ఆనందబాష్పాలవాలి!

సంజ్ఞా: గడంగడచి పిండం బయలుపడితే గంగాజొంపెం కొటితీరతాను పెద్దాంజనేయులుకు?

సదా: ఆ మాటమీదనే వుండు. దేనికి తగ్గ డబ్బు దాని కప్పుడే వసుంది.

సంజ్ఞా: పిల్లాడు పుటుకలోనే సన్యాసిగా పుడతాడేమోనని నా భయం!

సదా: అంటే వాడే ఆస్తికి వారసుకాడేమో అనా?

సంజ్ఞా: అసలూ వాళ్ళకే ఇచ్చి, వడ్డీ వాళ్ళకే యిచ్చి, అన్నీ వాళ్లకేయిచ్చి—ఇక మనకేం వుంచారు?

సదా : ఆసమస్య ఇన్నాళ్లూ నాకు తోచలేదు. ఈపైనుంచి ఆలోచిస్తాను—కుసింత విశ్రాంతి తీసికోనియ్యి!

లాకుసేరు సమమట్టం
కాలువకేం వట్టం?
కలగనియ్యవే ఒకని
వాడే మిడతంభొట్లో!''

## రంగము : 5

[సదానందుని యిల్లు]

వెంకట్లు : సంజ్ఞమ్మగారూ! ఈవేళ అడుగుతున్నాను! నిజంగా మీరె తోముకున్నారా ఆనాడా పెనం?

సంజ్ఞా : ఏం నే తోముకోలేనా?

వెం : మీచేతులు కాయలు కాయలే తోమితే?

సంజ్ఞా : ఇన్నాళ్లూ తోమితే నీచేతులు?

వెం : ఆలా అవితే మా సేతుల్లాంటి వే తమరివీని?

సంజ్ఞా : చీమూ చెమటా అందఱవీ ఒకటే నే!

వెం : బిడ్డెల్నెత్తడం మఱిగాక తెలిసిందను కుంటాను ఆసంగతి? ఏమన్నా అదృష్టంమీదీ అయ్యోరిదీ కూడాను! మీకో నీటిబొట్టూదితే గొట్టికాయ కలిగాడు! అదే మాకందఱికీ పదివేలు.

సంజ్ఞా : ఇన్నాళ్లనుండీమాత్రం మాకు సంతానం కలక్క పోనా? 'ఫామిలీ ప్లానింగు' అని "బర్త్ కంట్రోలు!" అని దిబ్బరనీ తిరుగుండం అనీ వేపుకు తిన్నారు మావారుగాని అన్నాళ్లూను?

వెం : వేపుకుతిన్నారో పదిరాళ్లు వెనకేసుకో గలిగారు!

సంజ్ఞా : ఏమి వెనవేసుకోవడం? ఆయనదంతా త్యాగబుద్ధి! భిక్షుకపరిశ్రమాలయానికి పదివేలు దానం చేశారు! వినవే!

వెం : మఱిప్పుడు వాడుతూవున్న డబ్బు? మీ జీవన సౌకర్యాలు మీ జిల్లేళ్ళకాయలు ఆలాగే జరుగుతున్నాయి!

సంజ్ఞా : అదే బ్రదుకుబద్దయొక్క కొలమానం పెడకుండా సంసారం పొదుపుగా చేసుకోవడం అంటే!

వెం: ఎక్కడనుంచి యీ రొఖ్ఖం అంతా మీవారు తేగలుగుతూవున్నారు అనేది నాకు వింతగా వుంది! తెల్లారకుండా కాఫీ, తెల్లారడంతోనే పునః! ఎండెక్కే ఎక్కకుండా వేడి ఇడ్డెన్లుతోడి స్నేహితులతో అరగించడం. తరువాత పెళ్లిమంటూ గొప్పోరితో విందులు వేడుకలు.—నా మొగుడు ఒక్క నాతోటే వేగలేనంటాడు! ముక్కలు ముక్కలు చేసుకుపోక చెక్క పట్టుకొచ్చినట్టు రోజూ పొద్దోయి రూపాయ పధ్యాలుగణాలు తెచ్చేడు! నన్ను తంపరే చూస్తూవున్నారు! పాచిపనికొడనుంచి పక్క వేసేదాకా తమయింట వుంటే నెలకు అయిదు రూపాయ లిస్తున్నారు! ఈ ముత్తాలతో నా మొత్తకు మూర తిరగాలి నా మొగుడికి ముకుర మందివ్వాలి! ఇంతకూ ఎప్పుడు పుట్టాలో అప్పుడే పుట్టేరు! మాకూ్కడా ఒక నీటిబొట్టు విడిచేవాడు పుడితే మంచిదనే యీ బీదతనంలోకూడా ఆలోచించుకునేం!

సంజ్ఞా: మీరు బహుశా మాకన్న శాస్త్రోక్తంగా సంసారం సాగించేరేమో ఈమధ్య వయోజన విద్దెం అదీ వచ్చి?

వెం: అబ్బే లేదండీ! ఎంతొట్టు పెడితే అంత వొట్టు. అవేంలేవు మాకు సతుకులు చట్టుబంపలు కూడానా?

సంజ్ఞా: అవితే నీవన్నట్టు సిరీసంపదా వాటంతటవే వస్తాయి! మనం తొందఱపడ్డా రావనే మనం అనుకోవాలి!

[సదానందుడు ప్రవేశించును]

వెం: అయ్యో వొస్తున్నారు! — చిన్నబాబు త్రైతుకు నేరులాగుంది.

సంజ్ఞా: నిదరోతున్నారు చిన్నబాబులు, నిదరోతూంటే ఎలా ఎత్తుకుంటారే? — నీవు కూచో? లేవనసరంలేదు.

వెం: నెగడం లేను. — నీటిబొట్టొదిలేవాడు మాకూ ఒకడుండాల విడుకొండలవాని దయవల్ల!

సదా: సంజ్ఞా! ఇదిగో నీకోసం సేలం జరీచీర తెచ్చాను. ఎల్లుండి సంక్రాంతి పండగట! అబ్బాయికి సబ్బు సన్నటి మల్లుగుడ్డ పట్టుకొచ్చాను!.

సంజ్ఞా: దోమ తెర? విద్యుద్దీపన?

సదా: అవీ తెచ్చాను!

సంజ్ఞా: వెంకమ్మకు?

సదా: ఓసి! నీ విక్కడే ఉన్నావుటే! ఇదిగో! చీర! ఆరుమూర పొడుగు రెండుమూరలు వెడల్పు. చాలనుకుంటాను నీ హోదాకు!

వెం: ఓ! తమ రేమిస్తే అదే సరిపోద్ది! మోకాలు దిగని బట్టేకదండీ యీదాకా నే కట్టింది: ఈబట్ట కేం? ఇది మహిమలు తగిలేను!

సంజ్ఞా: నీవు శానా పొట్టిదానవు! అందుచేత మట్టెలు మునిగిపోతాయి బొడ్డుబరికున్నప్పుడో శావా!

వెం: అమ్మగారిదయ! ఎలవు! (నిష్క్రమించును)

సంజ్ఞా: మొన్న దేనికీ డబ్బులేదన్నారు! ఈపొద్దు వీని కన్నిటకీ ఎలా వచ్చింది?

సదా: నీతోటి మఱి చెప్పడం మానేసేశాను. "మనీ! మనీ! మనీ!" అదే లోకం మన్నిస్తూంది... మనం ఎంత త్యాగంచేసినా ఎన్ని పరిశ్రమాలచూపిన్ని పోషించినా మన ధనం మన కుండాలి! మనమనిషి మనకుండాలి! అది ప్రపంచము సూత్రం అని ఇప్పుడు బోధపడింది! "మనీ! మనీ! మనీ!"—మళ్ళీ కొట్టాను "క్రాస్‌వర్డు పజిల్ ప్రయిజ్" ఇది లక్ష "బంపర్" ఇద్దఱకు పంచేరు. ఆ యిద్దఱిలో నేనొక్కణ్ణి!

సంజ్ఞా: అంటే మనకు ఏభైవేలు వచ్చాయి మళ్ళీ ఈమధ్య!

సదా: మనకొ్కదు.

సంజ్ఞా: ఎవరికి?

సదా: మనకు పుట్టబోయే బిడ్డడికీ అని కట్టాను.

సంజ్ఞా: అంటే మన కన్నమాటే! వీడు మనల్ని కాదంటాడా?

సదా: కాదన్నా, నీటిబొట్టు వదలడంలో వాదించడు.

సంజ్ఞా: వీడు పెద్దవాడయ్యేసరికి ఈ హిందూ మతం ఈలా వుంటుందన్న మాటేమిటి?—మాటలో ఆవిడా ఇలాగే వస్తున్నారు! పశుపతమ్మగారూ! రాండి! కూర్చోండి! మాపిల్ల డిప్పుడే బండఅయ్యేడు! ఈదాకా ఏడ్చి ఏడ్చి ఇప్పుడే నిదరోయాడు. (సదానందుడు చాటుకు తప్పుకొనును)

పశు: మీకేం లోపం? పుట్టుబోగులు!

సంజ్ఞా: మీకుమాత్రం ఏంలోటు? మీకూ ఒక బొట్టు వదిలే కుట్టుకున్నాడుగా!

పసు: ఉన్నాడెందుకు? వాడిల్లా వుండడు! నల్లగా వుంటాడు.

సంజ్ఞా: నల్ల అని వొల్లకుంటారా? మీరు మొన్న మీ పిల్లల్ని ముద్దెట్టుకుంటూంటే చూశాను! బుగలు కందిపోయాయి అలే లేత మొగకి!

పసు: ఏపనిచేసినా నాతో అంతే! ప్రక్క వాళ్లున్నారన్నది కూడ మఱచేను. నీవు చూశావో?

సంజ్ఞా: నేనగా చూశాను! మా ఆయనా చూశారు మీ చర్యలంతా!

పసు: ఇంట్లో వున్నారా ఆయన?

సదా: ఆఁ—ఏదో వ్రాసుకుంటూ వున్నాను!

పసు: త్యాగంలో నుంచి మళ్ళీ భోగంలో పడ్డారులాగుంది సదానందుడుగారు!

సదా: పడ్డాను!

"సీటిబొట్టు
కాటిమార్పు
నమృతముగ!
సమమట్టం
సమ సం బిఁక!"

# కలగూర గంప

## అణ్వస్త్రాలు

ప్రపంచ రాజకీయ యౌగంధరాయణంలో ఎవరికివారు పైచేయి గావాలనే ప్రయత్నంలో అమెరికా రష్యాలు పరస్పరం పోటీబడి అణ్వస్త్రాల ఉత్పత్తులను పెంచినై. ఈ ఉభయదేశాల ఉత్పత్తులూ ఎందాకా పెరిగినాయంటే, అణ్వస్త్రప్రయోగానికంటూ దిగితే అమెరికా రష్యానూ, రష్యా అమెరికానూ భస్మంచేసేసుకోగలవు. ఇట్టి పరిస్థితి యేర్పడినప్పుడు ప్రపంచ రాజకీయాలలో దీని పరిణామం ఎలా వుంటుంది? ఈ విషయాన్ని చర్చించుతూ ప్రొఫెసర్ పి. యమ్. యస్. బ్లాకెట్ 'న్యూస్టేట్స్‌మన్ అండ్ నేషన్' అనే పత్రికలో వ్రాసిన వ్యాసానికి ఇది సంక్షిప్తం.

రష్యా అణ్వస్త్రాల ఉత్పత్తులు ఒక అవధికి వచ్చాయనే విశ్వాసం వ్యాపించటంతో, భవిష్యత్తులో రానున్న పరిణామాలనుగురించి అమెరికా ప్రజలలో అనేక వాద ప్రతివాదాలు ప్రారంభమైనై. ఈవిషయాన్ని పురస్కరించుకుని 'అణుశక్తికమిషన్' మాజీ అధ్యక్షుడు గార్డన్ డీన్ యిటీవల ఒక గ్రంథం ప్రచురించారు. ఆ గ్రంథంలో ఆయన అమెరికా అణుశక్తి కార్యక్రమంయొక్క విస్తృతి యేమిటో కూడా విస్పష్టం చేశారు. బ్రిటన్ మొత్తంగా యెంత విద్యుచ్ఛక్తిని వినియోగించుతోందో అంత విద్యుచ్ఛక్తిని అమెరికా యీ అణ్వాయుధ నిర్మాణ పరిశ్రమకు వినియోగించుతున్నట్టు డీన్ వ్రాశారు.

డీన్ ఆ గ్రంథంలో ఈ వివరాలను పొందుపరచారు:

'ఇప్పుడు అమెరికా రష్యామీదికి అణ్వస్త్రాల దాడికి ఉపక్రమించితే, తను నిల్వచేసిన ఆటంబాంబులతో, రష్యాలోవున్న ప్రధాన నగరాల నన్నిటినీ ధ్వంసంచేసి పారెయ్యగలదు. రష్యా పారిశ్రామిక కేంద్రాలను కూడా చాలావరకు నాశనంచేయగలదు. ఇప్పుడు అమెరికా చేతిలో షుమారు ఒక 5000 వరకూ ఆటంబాంబులున్నాయి. రష్యాను సర్వనాశనం చేయటానికి యిన్ని బాంబులు అసలు అవసరమే లేదు.

'ఈ అణ్వాయుధాలు ఒక్క అమెరికా చేతిలోనే వున్నప్పుడు, అంటే హిరోషిమా సంఘటన దినాలలో (1945) ప్రపంచ రాజకీయరంగంలో అమెరికా అంటే సింహస్వప్నంగా వుండేది. ప్రపంచంలో వున్న యే నగరాన్ని బడితే ఆ నగరాన్ని ఒక్క బాంబుతో నాశనం చేయగలిగి వుండేది. ఎంతటి యుద్ధాన్నయినా రెండు బాంబులతో అంతం చేసి వెయ్యగల సామర్థ్యం గలిగివుండేది. కాని అనంతరం పరిస్థితులు కొంచెం మారినై.

1949 లో తొలిసారిగా సోవియట్ రష్యా తొలి ఆటంబాంబును పరీక్షించింది. తొలి బాంబును పరీక్షించటానికీ, అవసరానికి కావలసిన అవధికి బాంబులను తయారుచేసి నిల్వచేసుకోవటానికి చాలా వ్యత్యాసమున్నమాట నిజమే అయినా, ఆ సంఘటన ప్రపంచ రాజకీయ భవిష్యత్తు దృష్ట్యా ఒక ప్రధానమైన పరిణామమే. ఎందుచేతనంటే, నేడు కాకపోతే మరి కొన్నాళ్లకు రష్యా, అమెరికానూ, మిగతా స్వతంత్రదేశాలనూ దెబ్బతియ్యటానికి చాలినన్ని ఆటంబాంబులను తయారుచేసుకోగల అవకాశం కనుపించింది. రష్యా అటువంటి స్థితికి రాగలిగితే, రాజకీయ రంగంలో అమెరికాదే పయిచేయిగా వుండటానికి అవకాశం వుండదు.

'తనమీద అణ్వస్త్రాలదాడికి దిగకుండా రష్యాను అదుపులో పెట్టటానికి తప్ప అమెరికాకు ఈ అణువు బాంబుల ప్రయోజనం మరేదీ వుండదు. ఈ ఆయుధం ఇలా నిరుపయోగమైపోతే, రష్యా తనకున్న అంగబలాన్ని అవకాశంగా తీసుకుని ప్రపంచ రాజకీయ రంగంలో పైచేయి కావటానికి ప్రయత్నించవచ్చు.

'రష్యా చేతిలో యిప్పుడు ఎన్ని ఆటంబాంబులు సిద్ధంగా వున్నాయో చెప్పటానికి కచ్చితమైన భోగట్టా యేమీలేదు. నూరు బాంబులైనా వుండి తీరతాయని కొందరంటున్నారు. 300 వుండ

సం॥ లు వరుసగా నడిచెనట. ఈకాలములో 59 మంది రాజులపాలన జరిగెను. మొదటిసంఘము నిర్మింపబడిన పిమ్మట దాదాపు 500 సం॥లకు ఈ సంఘముద్భవించి నట్లు చెప్పవచ్చును. రెండవశతాబ్దివరకు నిలిచియుండెను. మూడవ సంఘ మొకటి యుత్తర మధురలో నుండెడిది దీనిని వరుసగా 49 మంది పాండ్య రాజులు పోషించుచు వచ్చిరి. దీనిలో 49 సభ్యు లుండెడివారు. ఇది వరుసగా 1850 సం॥లు నడచెను. దీనిలో 449 కవులు తమ రచనలను జేర్చి సంఘాభి వృద్ధికై పాటుబడుచుండిరి. ఈ సంఘ సభ్యులలో పాండ్యరాజు గూడ ఒకడైయుండెను. ఉగ్రసేనుడను పాండ్యరాజు దీనిలో సభ్యుడుగా నుండినట్లు తెలియు చున్నది. ఈ సంఘము సేకరించిన గ్రంథములలో కొన్ని యిప్పటికిని లభించుచున్నవి. ఇందులో చోళ, పాండ్య దేశముల కధిపతులైన కరికాలచోళుడు, నెడుంజలియన్ మొదలగువారికి కృతి నొసంగబడినవి కలవు. వీనివల్ల నా రాజుల దండయాత్రా విశేషాలు, నాటి సాంఘికాచారములు, విశ్వాసములు, పరిస్థితులు మొదలైనవి తెలియుచున్నవి

కేవలము చరిత్రల కుపయోగించు వీరపురుషైతి హాస గ్రంథములుగూడ యీ వాఙ్మయ మందున్నవి. ఇట్టివానిలో సిలప్పాదికారము, మణిమేఖల, జీవ చింతామణి మొదలగునవి కలవు. వీనిలో నాటి రాజుల చరిత్రలు, నాటి బౌద్ధ, జైనమతవిషయాలు చక్కగా తెలియనగుచున్నవి. జీవచింతామణిలో చేరరాజు చావకునిగురించిన వివరాలు కలవు.

పత్తుప్పాట్టు, ఎట్టుతొకై, పదినేన్ కిల్లానక్కు మొదలుగాగల గ్రంథములా వాఙ్మయమున నున్నవి. నక్కీరారు, రుద్రన్ కన్ననారు, మరుతనార్, కన్ని యార్, నత్తితానార్, నప్పుతానార్, కపిలార్, కాశికానార్ మొదలగు ప్రసిద్ధ కవులీగ్రంథములను రచించిరి.

కరికాలుడు మొదలగు రాజులు ద్రావిడదేశ రాజులయ్యును, ఆర్యమతమును స్వీకరించి,సూర్యవంశ జులుగా నెంచబడి, క్రమముగా నాంధ్రదేశమునగూడ వారును, వారి వంశీకులును పాలనసాగించి, పెక్కు శతాబ్దులు ఆంధ్రభూమిలో నుండి చివర కాంధ్రు లలో లీనమైపోయినట్లు. ఆంధ్రదేశ ప్రాచీన శాసన పరిశోధన జేసిన పండితులకు వేద్యమే.

ఇట్లాంధ్రదేశమునకును, దక్షిణదేశమునకును ప్రాచీనకాలమునుండి సంబంధముండుటవల్ల, ఆంధ్రుల చరిత్రా నిర్మాణములో 'సంగం' వాఙ్మయ పరిశోధన గూడ ప్రాముఖ్యత వహించియుండు విషయము చారిత్రక పరిశోధకులు గుర్తింపదగినది.

తమిళ వాఙ్మయములో పురనానురుకి, పొరు నారారుప్పడై పట్టినప్పలై గ్రంథములలోగూడ కరి కాల రాజు విషయము వర్ణింపబడియున్నది.

క్రీస్తుపూర్వము దాదాపు 456 నుండి ఆంధ్ర రాజ్యమున్నట్లు బలవత్తర ప్రమాణములు లభించు చున్నవి. మహాపద్మని కాలములో శ్రీకాకుళము రాజధానిగా ఆంధ్రదేశము కౌకులుడు పాలించెను. ఇది పురాణములందున్నది మెగస్తనీసు కాలమునాటి కనగా క్రీ. పూ. 325 నాటికి ఆంధ్రరాజ్యము 30 పట్టణములతో విలసిల్లుచుండెను. అశోక చక్రవర్తి రాజ్యపాలనాంతమున ఆంధ్రరాజ్యము స్వతంత్రమై శ్రీముఖరాజు యాజమాన్యమున మహారాష్ట్రమును గూడ ఆక్రమించి తర్వాతి దాదాపు 460 సం॥లు నిష్కంటకముగా బాలించినట్లు కనబడుచున్నది.

కన్నడ గ్రంథములనుబట్టి యీ శ్రీముఖునికి పూర్వము ఆంధ్రరాజ్యము బెంగాలు రాజులలోని యశోధరుడు, ప్రియబలుడు, శ్రీధరుడు, రెండవ యశోధరుడు, ధనదుడు, ఇంద్రగుప్తుడు మొదలగువారు పాలించినట్లు చెప్పవచ్చును. వీరందరును బౌద్ధులైన సంప్రదాయకులైన యిక్ష్వాకు రాజులు—అందుచే వీరు క్రీ. పూ. 400–200 సం॥ల మధ్యవారని భావింప వచ్చును. వీరి విషయ మింకను వంగ వాఙ్మయమున గూడ దొరకునేమో పరిశీలింప దగినది. పై విషయ ములనుబట్టి మన దేశచరిత్రా నిర్మాణమునకు దేశము నందలి వివిధవాఙ్మయముల నెంతో శోధింపవలసి యున్నది. ముఖ్యముగా ఆంధ్రదేశ చరిత్రకు తమిళ వాఙ్మయము, తమిళ శాసనములుగూడ ప్రాచీన చరిత్రా నిర్మాణమునకై యింకను శోధించు టావ శ్యకము.

—కొత్త భావయ్యాచౌదరి.

# గ్రంథ విమర్శనము

## మనుస్మృతి

గేయ నాటకం: రచన: శ్రీ కనక మేడల వెంకటేశ్వరరావు: ప్రాప్తిస్థానం: రచయిత, 9 రండాల్స్ రోడ్, మద్రాసు 7; వెల 0.12 0.

పుస్తకం పేరు చదవగానే, ఇది మనుధర్మశాస్త్రమేమోనని భ్రమకలుగుతుంది. కాని ఇది అలాంటిది గాదు. హృదయ మేధా సంఘర్షణ మానవ పురోగమనంలో తీరని సమస్య; ఈ సమస్యను తీసుకుని సుప్రసిద్ధ హిందీ రచయిత జయశంకర్ 'కామాయినీ' అనే కావ్యం రచించారు. ఆ కావ్యంలోని కొన్ని సిద్ధాంతాలు స్వీకరించి వాటికి శ్రీ వెంకటేశ్వరరావు గారు రూపకల్పన చేశారు. ఈ గేయ నాటికలో మనువు, శ్రద్ధ పాత్రలు. ఈ నాటిక ద్వారా వీరు ప్రతిపాదింపదలుచుకున్న తాత్విక సిద్ధాంతం:

"ఇచ్ఛా కర్మ జ్ఞానాల భిన్నత్వం
మానవలోక శాంతికి మూలం
వాని సామంజస్యమార్గం
శ్రద్ధా హృదయ విశ్వాసం
ఇదె మానవజీవన రహస్యం
ఇదే మహాజ్ఞానం."

## ఆంధ్రస్మృతి

ఖండకావ్య సంపుటి; రచన: శ్రీ క్రొవ్విడి వెంకటరత్నశర్మ: ప్రాప్తిస్థానం: రచయిత, పెద్దపల్లి, కరీంనగర్ జిల్లా, హైదరాబాదు; వెల: 1-8-0.

ప్రాచీనాధునాతన ఆంధ్రవైభవాన్ని అభివర్ణించుతున్న గ్రంథం: దేశభక్తి పూరితమైన పద్యరచన; మచ్చుకు:

"మౌర్యసామ్రాజ్యరమాన ర్తనగురుండు
 చాణక్యుడోనమాల్ చదివె నిచట
మొగలుసామ్రాజ్యపు మోహానచ్ఛత్రంబు
 వీరబలుండిట బేర్ల నేర్చె
కాకతి రత్నయుగంధరుడిచ్చోట
 ఢిల్లి సుల్తాను గుండెల వసించె
కర్ణాటరాజ్య రక్షాదీక్షితుండైన
 తిమ్మరుసు సారవళ్ల దిద్దెనిచట
భూరితేజులు, ననఘులీ పుణ్యభూమి
హాలిబండించిరెపుడు ముత్యాలపంట
పంచి రఖిలశ్రేయఃకీర్తి పాయసముల
ఏల ప్రభవించె నేడు దుష్కాలఘటిక"

## నటన

రచన: శ్రీ శ్రీనివాస చక్రవర్తి; ప్రచురణ: సాహితీ ప్రచురణాలయం, విజయవాడ 2; వెల 1-8-0.

ఈ రచనకు రిచర్డ్ బొలెస్లవస్కీ వ్రాసిన 'యాక్టింగ్' అనే గ్రంథం మాతృక; ఇతడు మాస్కో ఆర్టుథియేటర్ నటుడుగా, మాస్కో ఆర్టుథియేటర్ స్టూడియో డైరెక్టరుగా ప్రసిద్ధికెవచ్చిన కళాకారుడు. నాటకకళా సమస్యలను వ్యాసరూపంలో గాక సంభాషణల రూపంలో సంఘటించారు. శ్రీనివాస చక్రవర్తి ఈ రచనను తెలుగులోకి తీసుకురావటంలో, తెలుగు వాతావరణాన్ని సృష్టించటానికి చాలా స్వతంత్రించారు. నాట్య కళా విషయంలో మన భారతీయ సంప్రదాయాన్నీ రష్యన్ సంప్రదాయాన్నీ సమన్వయం చేసి చూసుకోవటానికి ఈ గ్రంథం ఉపకరించుతుంది.

## రోదసి

ఖండకావ్య సంపుటి: రచన: 'శార్వరి'; కళావాణి ప్రచురణ; తెనాలి; వెల 1-8 0. ఈ రచయిత కావ్యధోరణిని అభివర్ణించటం కంటే, మచ్చుకు ఈ కావ్యఖండాన్ని చిత్తగించితే పాఠకులకే స్వయంగా విస్పష్టమవుతుంది.

'2 × 2 = 4 అన్నది నిజం!
డు, ము, వు, లు, ప్రథమా విభక్తి
అన్నమాట నిజంగా నిజం.
సుదూరంలో లోకానికి డాలర్ చే
అపాయం 3 తుంది.
6 బైట పడుకొన్న 'ప్రదేశం'
తనలోకి తనే ముడుచుకొంటుంది.
జనత బాధలతో 7 స్తుంది.
ఆనాడు 5 వ శాంత్రడపురూపులౌతారు.
శరీరమంతా పోయిపోయి
మిగులుతుంది ఒకే ఒక్క 'లిబిడో'

ఆటమ్మిని ధరిత్రీలలామ
బూడిద పంట పండిస్తుంది'—

అంకెలు మినహాయించి మిగతా రచనలన్నీ కూడా యిదే ధోరణి.

## తెలుగు పాపాయి

బాలసాహిత్యం: గేయాలు: రచన: శ్రీ శ్రీనివాసకౌశ్యప; ప్రచురణ: బాలసరస్వతీ బుక్ డిపో, కర్నూలు: వెల 0 8-0.

ఇందులోని గేయాలు బాలబాలికల మనస్సులను తేలికగా ఆకర్షించగల సరళమైన తేలికభాషలో వున్నాయి.

పాపాయి నవ్వులో
పండు వెన్నెలలూ
చక్కగా మెరిశాయి
దిక్కు లన్నీను!

ఈవిధంగా రచన హృద్యంగా వున్నది.

## అనార్కలీ

కావ్యం; రచన: శ్రీ దురిశేటి వేంకట రామాచార్యులు; ప్రాప్తిస్థానము: శ్రీ ఎల్లోజు మాధవాచార్యులు, అప్పారాయ గ్రంథమాల, నూజివీడు; వెల: రు 1-4-0.

"అన్నులమిన్న! నైతిక మ
హత్త్వముచే నితడీ సలీము డ
త్యున్నత గోత్రజాతుడు మ
హోజ్జ్వల సంపదవాడు, నీదు కన్
సన్న మెలంగ జూచెడి; పి
శాచము లేలెడి రాజనీతి యీ
న న్నదలించలేదు; లల
నా! కనులెత్తు! మన గ్రహింతువా?"

ఇట్టి వైదర్భీరీతిని కావ్యం అత్యంత సుకుమారంగా నడిచింది.

## అఖండ భారతము

రచన: శ్రీ కోటమర్తి చినరఘుపతిరావు; ప్రచురణ: పాంచజన్యంపబ్లికేషన్స్, కాకినాడ; వెల: రు 1-0-0.

రచయిత ఈ గ్రంథంలో, ప్రాచీన హిందూ దేశపు స్థితిగతులూ, బౌద్ధ జైన మహమ్మదీయ మతముల ప్రాబల్యము, గత వెయ్యి సంవత్సరములుగ మహమ్మదీయులు హిందువులపై జరిపిన దాడులు, ముస్లింలీగు స్థాపన, హిందూ మహమ్మదీయ సఖ్యతకై గాంధిజీ సల్పిన కృషి హిందూమహాసభ స్థాపన, హిందూ మహమ్మదీయ వైషమ్య విజృంభణకు అంగ్లేయులు కారకులై పన్నిన పన్నాగములు, దేశవిభజన, పాకిస్థాన్ చరిత్ర, కాశ్మీర్ సమస్య మొదలైన విషయాల నన్నిటినీ సమగ్రంగా చర్చించి అఖండ భారతం యేర్పడవలసిన అవసరాన్ని ప్రతిపాదించారు.

## శ్రద్ధాంజలి

ఖండకావ్య సంపుటి; రచన: శ్రీ రావు వెంకట శేషరావు. సరళమైన పద్యరచన; నీతి బోధకములగు కావ్య వస్తువులు: విద్యార్థులకు మిగుల ఉపయుక్తముగా నున్నది. ప్రాప్తిస్థానము: రచయిత: చిత్రాడ, పిఠాపురం పోస్టు. వెల ఒకరూపాయి.

## మానవ ధర్మం

ఆధ్యాత్మికావలోకనము; రచన: శ్రీ గనకుగరం వరదాచార్యులు. ప్రాప్తిస్థానం: శ్రీ వైద్యవిద్యాసంస్థానము, అలపాడు, గుంటూరు జిల్లా. వెల ముప్పావలా.

## శ్రీరామానందలహరి

శ్రీరామచంద్ర స్తవరూపమైన పద్య రచన: రచయిత: శ్రీ రత్నాకర బాలరాజ; ప్రాప్తిస్థానం: రావుజీ ప్రెస్, అనంతపురం, వెల: 0-8-0.

## ఆంధ్రభాషా భూషణము

## దివ్యప్రభా వివరణ సహితము

కేతన రచించిన 'ఆంధ్రభాషా భూషణము'కు శ్రీ దేవినేని సూరయ్యగారు 'దివ్యప్రభ' అనే పేరుతో విపులమైన వివరణమును రచించారు. తెలుగు భాషకు వున్న వ్యాకరణ దీపం చాల చిన్నది. ఆ వున్న వ్యాకరణ గ్రంథాలలో కూడా చాలవరకు సంస్కృతంలో వుండటమే గాక ఇంచుమించు సంస్కృతభాషాసంప్రదాయాలను దృష్టిలో వుంచుకు రచించినవి. ఆ దృష్ట్యా 'ఆంధ్రభాషాభూషణం' చిన్ని గ్రంథమే అయినా ఆంధ్ర వాఙ్మయంలో అత్యంత ప్రధానస్థానమే వహించుతోంది. ఎందు చేతనంటే, ఇది తెలుగుభాషలో, తెలుగు నుడికారాన్నీ, తెలుగు పలుకుబడి సంప్రదాయాన్నీ దృష్టిలో వుంచుకుని రచించిన స్వతంత్రమైన తొలి తెలుగు వ్యాకరణం, మున్ముందు మన తెలుగు వ్యాక

రణ సౌష్ఠవం నిర్మాణం కావటానికి ఇది ప్రధానమైన ప్రాతిపదిక కాదగినది. శ్రీ సూరయ్యా చౌదరిగారు దీనిలోగల పద్యాలకు ముందు టీకను రచించి ఆపైని తను వివరణను పొందుపరచారు. ఈ వివరణలో ఆంగ్ల యితర వ్యాకరణ గ్రంథములలో ఉల్లేఖింపబడిన విషయాలను సవిమర్శకంగా ద్యోతమానం చేస్తూవచ్చారు. తెలుగు నుడికారపు స్వభావ సంప్రదాయాలను అవగతం చేసుకోవటానికి ఈ గ్రంథం అత్యంతమూ ప్రయోజనకరంగా వుంది.

ఈ గ్రంథానికి శ్రీ వల్లమూడి గోపాలకృష్ణయ్య గారు దాదాపు 150 పేజీల విస్తృతిగల ఒక పెద్ద పీఠికను రచించారు. ఆయా వ్యాకరణనిర్మాతలు రచించిన అనేక విషయాలను గురించి విపులంగా చర్చించారు. ఆంధ్రభాషాపురోగమనానికి ఆటంకంగా వాఙ్మయ రంగంలో ఎన్ని గచ్చపొదలు వ్యాపించి వున్నాయో తెలుసుకోవటానికి ఈ పీఠిక ఉపకరించుతుంది. ఆంధ్రభాషా పురోగమనాన్ని ఆశించుచున్న ప్రతిఒక్కరూ చదువదగివున్నది. కేతన తిక్కనకు శిష్యుడు కాదని వారు ఒకవాదం ఎత్తిచూపుతున్నారు. 'తిక్కనసోమయాజి వరప్రసాద కవితావిలాస' అనే వాక్యం కనుపించుతుండగా వీరి వాదాన్ని అంగీకరించటానికి ఆస్కారం లేకపోయినా పండితపరిశోధకులు గమనించదగిన విషయం. శ్రీ సూరయ్యగారి తొలిపలుకులోనూ వల్లమూడివారి పీఠికలోనూ కూడా శ్రీ వఝ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రి గారికి సంబంధించిన ప్రసక్తులు లేకుండావుంటే గ్రంథగౌరవం ఇనుమడించివుండేది.

ప్రాప్తి స్థానం: "కళాకృష్ణులు", పొన్నూరు (గుంటూరు జిల్లా) వెల రు. 3-8-0.

## మేఘసందేశము

ఆంధ్రీకరణము: శ్రీ కె. నారాయణరావు; ప్రచురణ: జయలక్ష్మి & కో., నెల్లూరు; వెల తెలియదు.

కాళిదాసు మేఘసందేశానికి ఇది తెలుగు వచనానువాదము. మేఘసందేశ కావ్యమునకు ఇదే మొదటి వచనానువాద మనవచ్చు. ఈ రచన యథామూలంగా వుండటంచేత కాళిదాసు రచనను చదువుతున్నప్పుడు ఎలాంటి ఆమోదం కలుగుతుందో అలాంటి ఆమోదం కలగటానికి అవకాశం వుంది. కాని యీ గద్య రచనయందు తెలుగుభాషకు గల వాక్య నిర్మాణ సంప్రదాయం సరిగా పాటించకపోవటంచేత భాష నాతి కఠినంగా వున్నా క్లిష్టత యేర్పడుతున్నది. ఉదాహరణకు:

'అబలా విరహియై కాముకుడగు నా యక్షుండు బంగారు మురుగు జారుటచే రితయైన ముంజేతితో గొన్ని నెలలట్లు పుచ్చి'—అన్నారు. బంగారు మురుగు జారిపోవుటచేత రిత్తయైన ముంజేయిగలవాడై అని మనం అవగతం చేసుకోవలసి వుంది.

కొన్ని కొన్ని ప్రదేశాలలో భావకూడా, సంస్కృత శ్లోకంలో గల భావాయాసాన్ని పొంది తెలుగుదనాన్ని చంపేసుకుంటోంది.

'ఆ సూర్యోదయము ప్రియతములు ఖండిత యోషితల నయనసలిలంబులను శాంతి పొందింపదగిన సమయంబు'—అను వాదానికి ఇది పద్ధతి కాదేమో.

## స్వీకారం

సాహిత్యంలో సర్పం: రచన: శ్రీ యమ్. యస్. శాస్త్రి: ప్రాప్తిస్థానం జయనికేతనం, తాడేపల్లి గూడెం. పశ్చిమగోదావరి జిల్లా.

స్వర్వజ్ఞాన స్వరకల్పవల్లరి: శ్రీ వారణాసి రామసుబ్బయ్యశాస్త్రిగారి జీవితము: రచన: శ్రీ చల్లా పిచ్చయ్యశాస్త్రి; ప్రాప్తిస్థానం: రచయిత, యింటూరు (పోస్టు) గుంటూరు జిల్లా. వెల ఒక రూపాయి.

అనంతం: గేయకావ్యసంపుటి రచన: రాంషా; కళా కేళీ ప్రచురణ: ప్రాప్తిస్థానం: విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ-2; కళా కేళీ ప్రచురణాలయం, శాహలీ కోట; వెల: రు 1-0-0,

సఫల జన్మ: డాక్టర్ జార్జి వాషింగ్టన్ కార్వర్ జీవిత చరిత్ర; మూలం: షెర్లీ గ్రాహాం, జార్జి టి. లిప్సి కోంబ్; అనువాదం: వి. సదానంద్; ప్రచురణ: జయెసెసన్ ప్రెస్, మద్రాసు; వెల తెలియదు.

అమర గేయాలు: రచన: శ్రీమతి గుడిపూడి రాజేశ్వరీదేవి; చిలకలూరిపేట; గుంటూరు జిల్లా; వెల: 0-6-0.

విశ్వశాంతి: పద్యకావ్యం రచన: శ్రీ కొల్లా శ్రీకృష్ణారావు; ప్రచురణ: అభ్యుదయ సాహిత్య పరిషత్తు, గుంటూరు: వెల 0-4-0.

ఆంధ్రరాష్ట్ర విజయము: పొట్టి శ్రీరాములు గారి ఆత్మబలిదాన గాథ; పద్యకావ్యం; రచన: శ్రీ మలపాక రామసూర్యనారాయణ; సహోపాధ్యాయుడు, మద్దాల రామకృష్ణమ్మ బోర్డు హైస్కూలు, వీరవాసరం (పశ్చిమ గోదావరి జిల్లా) వెల 0-6-0.

మానవా మానవా!: గేయకృతులు; రచన: శ్రీ వసంతరావు వెంకటరావు: ప్రాప్తిస్థానం: వసంత నికేతనం, విజయనగరం; వెల 0-8-0.

బాలయోగీశ్వర మహా మహిమలు: రచన: శ్రీ జయంతి స్వామి నాయన; ముమ్మిడివరం; వెల 1-0-0.

బాలయోగీశ్వర చరిత్ర: రచన: శ్రీ జయంతి స్వామి నాయన; ముమ్మిడివరం; వెల 1-0-0.

పార్వతీ పరిణయం: (వచనం) రచన: శ్రీ పురాణపండ; తరుణ సాహితి ఆలమూరు; వెల 0-8-0.

రామచంద్రశతకము: రచన: శ్రీ మలపాక రామసూర్యనారాయణమూర్తి సహోపాధ్యాయుడు; మద్దాల రామకృష్ణమ్మ బోర్డు హైస్కూలు; వీరవాసరం; ప॥ గోదావరిజిల్లా; వెల 0-4-0.

రెడ్లచరిత్రము: పద్యకావ్యము; రచన: శ్రీ కొత్త భావయ్య చౌదరి, సంగం జాగర్లమూడి, గుంటూరు జిల్లా; వెల 0-8 0.

రమాపతిశతకము: రచన: శ్రీ చింతలపాటి నరసింహ దీక్షితశర్మ; శ్రీ బా. సంస్కృత కళాశాల, పొన్నూరు; వెల 0-6-0.

భక్త కన్నప్ప (హరికథ): రచన: శ్రీ కేశవ తీర్థస్వామి; ప్రాప్తిస్థానం: శ్రీరామ తీర్థాశ్రమం; పిడుగురాల; గుంటూరు జిల్లా; వెల 0-8-0.

పాంచజన్యం: గేయాలు: రచన: శ్రీ కొరుమంచి వెంకటేశ్వరరావు: ప్రాప్తిస్థానం: నవయుగ పబ్లిషింగ్ హౌస్, బ్రాడీపేట, గుంటూరు - 2; వెల 0-6-0.

పరిణామం: (నాటిక) రచన: శ్రీ చిల్లర భావనారాయణరావు: ప్రచురణ: నవ్యకళాసమితి; సికింద్రాబాద్.

గ్రామసేవ: (నాటకం) రచన: శ్రీ పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రి: మోపిదేవి, దివి తాలూకా, కృష్ణా జిల్లా, మూల్యం 1-8-0

కల్పవల్లి: ఖండకావ్యసంపుటి; రచన: శ్రీ కొత్త భావయ్య చౌదరి: సంగం జాగర్లమూడి (గుంటూరు జిల్లా) వెల 1-0-0.

మచ్చుతునకలు: కథలు: రచన: పి. వి. రత్నం; ప్రచురణ: ఎవరెస్టు పబ్లికేషన్సు, రేలంగి, పశ్చిమ గోదావరి జిల్లా; వెల 1-0-0.

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No. 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.



మరల ఎండాకాలము వచ్చింది!
...ఒళ్లంతా చాల జిగటగాను, మలినములతోను యున్నట్లు ఉందా?
ప్రతిదినము మీరు మలినము లోని క్రిములనుండి అంటు రోగమును పొందే ప్రమాద మున్నది
లైఫ్‌బాయ్‌తో ఈ క్రిములను కడిగివేసి మిమ్ములను మీరు ప్రతిదినము కాపాడుకొనండి
లైఫ్‌బాయ్‌యొక్క "రక్షక నురగ" మీ ఆరోగ్యమును కాపాడును
లైఫ్‌బాయ్ సబ్బు
ప్రతిదిన మలినములోని క్రిముల నుండి మిమ్ములను కాపాడును
LIFEBUOY
SOAP
LIFEBUOY
ఇండియాలో తయారుచేయబడినది
L. 247-X52 TL

Bharathi, 7th May 1954. Regd. No. 1856

# తుంగభద్రా ప్రాజెక్టు



ఎ.సి.సి. సిమెంటు

**2,20,000**

టన్నులకు పైగా

వినియోగింపబడినది.

తుంగభద్రా ప్రాజెక్టు ఆంధ్రరాష్ట్రములో 1,00,000 కిలోవాట్లుల విద్యుచ్ఛక్తిని, 8,00,000 ఎకరముల భూమిని తడుపుటకు నీటిని సరఫరాచేయును.

కాంక్రీటు ఆనకట్టలు మనదేశములోగల బంజరుభూములను ఆహారసమృద్ధితో అభివృద్ధి చెందు ప్రదేశములుగా మార్పుటకు తోడ్పడును.

ఎసిసి

సేల్సు మేనేజర్సు

**ది సిమెంట్ మార్కెటింగ్ కంపెనీ ఆఫ్ ఇండియా.లి.**

SISTA'S CMI - 165 Telugu